అన్యున్ వేఁడఁగఁబోదు కూటికయి, కాయక్లేశసంపాదితం
బే న్యాయ్యంబని జీవయాత్రకొఱకై యేగంజియో త్రావుచున్
దైన్యంబెన్నడులేక యచ్ఛమగు స్వాతంత్ర్యోజ్జ్వలచ్ఛిత్త నీ
ధన్యం జూడుడు భారతీప్రకృతి కీ స్తన్యంబు సామాన్యమా!॥

—పసుమర్తి కృష్ణమూర్తి.



# గృహలక్ష్మి

## మసిపూసిన నేరేడుపండు

అతివా చూడుము కోటుహాక్కు కయి నీ వత్యంతకష్టంబులం
గుతుకం బారఁగ బొందినావయిన నీకో క్కుల్ వృథాకోయి యీ
గతిపట్టెక్ మసిపూసి నేరెడని వీఁకం జూపఁగావచ్చెవాఁ
యరనామాత్రరమాత్రశోభనయుతం బా శ్వేతపత్రంబదే.

—సనుమర్తి కృష్ణమూర్తి

ప్రభుత్వమువారు దయాభిమానపూర్వకముగా నొసగిన శ్వేతపత్రము (White Paper) యథార్థముగా శ్వేతపత్రమే. అందు నల్లనియక్షరములు తప్ప మరేమియు లేవు. ఇది చదివినప్పుడు, చిన్ననాటి మా అయ్యవారికథ జ్ఞప్తికి వచ్చుచున్నది. అది మా సహోదరీమణులును విని యానందింతురని వ్రాయుచున్నాము.

ఒక పేదబ్రాహ్మణుడొక ప్రభువు నాశ్రయించి నిత్యమును బంచాంగము జెప్పుచుండెడివాఁడు. ఆ పంచాంగశ్రవణము జేయుచుండు సమయములయం దొక్కొక్కపుడు "దొరగారూ! ఏమి వంటచేయుమని సెల"వని వంటకత్తె వచ్చి యడుగుటయు, దొరగారు, "రాజగిరి తోటకూర" యని యొక మారును "పువ్వులచా"రని మరియొక తూరియు "శేషపాన్పు"లని యింకొక సమయమందును సెలవిచ్చిరి. ఈపేరు లెన్నడు నా బాపనయ్య వినియుండలేదు. ఇవి నిజముగా నపరూపపు వస్తువులే కదా!! ఇట్టి యనన్యసామాన్య పదార్థముల భుజించు ప్రభువుయొక్క దయ యున్నపుడే తాను కాశీయాత్ర చేయవలయునని తలంచి యా బాపనయ్య, తన తలపును దొరగారికిఁ దెలిపెను. దొరగా రది విని బ్రహ్మానందభరితుఁడై "అయ్యగారూ! మీ సంకల్పము తప్పక నెరవేర్చుకోతగ్గదే! నాకు చాలా సంతోష" మనెను: పారుఁడును దరు

వాత నొక ముహూర్తము నేర్పాటుచేసికొని వచ్చి యొకనాడు దొర కెరింగించెను. "సరే! మంచేమున్నది! అలాగే బయలుదేరండి" యని దొరయు హెచ్చరించెను. ప్రయాణదిన మునఁ బ్రాతఃకాలమునందే బ్రాహ్మణుడు దొరగారి దర్శనముఁజేసి "యీవాళ మధ్యాహ్నం రెండున్నర ఘడియలకు బయలుదేరుచున్నా" నని తెలిపెను. "మంచిదే!! ఈ మార్గముననే కదా మీ బండి వెళ్లవలెను! ఆ సమయమున నొక్కసారి శ్రమ యనక బండి దిగి చావడిలోనికి దయచేయించుండి! చిత్తం" అని యాతని బంపెను. ఆ మాటప్రకారమే బ్రాహ్మణుఁడును బండిని వీధిలో నిలుపఁబెట్టి దొరగారి చావడిలోనికి వచ్చి ప్రభువు నెదుట నిలచెను. "ఓహో! దయచేస్తున్నారా" యని లోపలి కొకమారుపోయి రెండు పిడికెళ్లను బట్టుకొని మరలఁ జావడిలోఁ బ్రవేశించి "దయయుంచాలి! దయయుంచాలి—మళ్లా యెప్పుడు దర్శనమో" యనెను. బ్రాహ్మణుఁడు, మునిముసినగవులతో "పదినెలలు పట్టదా?" యనెను. దొరగారు రిచ్చవడి "పదినెలలా!! అనగా చైత్రం, వైశాఖం, జ్యేష్ఠం" అని వ్రేళ్లతో లెక్కపెట్టి "చిత్తం! ముహూర్తం మించిపోనియ్యకండి- బండి యెక్కండి- నేనుందునా" యనెను.

బ్రాహ్మణుడు పంచాంగము జించి పారవైచి మరునాటినుండియు వ్యవసాయమునకుఁ గడంగి దొరగారు సెలవిచ్చుచుండిన "రాజగిరి తోటకూర"ను బండింప నెంచి ఆ విత్తనమునకై దొరగారి వంటకత్తె నాశ్రయింప నొకనాఁ డామె యా వైదికుని వెఱ్ఱికి జాలినొంది, "అయ్యా, ముండ్లతోటకూరనే మా దొరగారు రాజగిరితోటకూర యందురు. దానికి విత్తనలెనా?" యని నవ్వెను.

బ్రాహ్మణుఁడు రిచ్చవడి "ఐతే అమ్మా, పువ్వులచారును శేషపాన్పులూ యేమిటే?" యని యడిగెను. దాసి "అయ్యా, నూకలగంజియే పువ్వులచారు—ఆ నూకలకుగూడ గతిలేనినాడు కడుపుమీద తడిపాత వేసుకొని పడుకొనుట శేషపాన్పు" అని నిర్వచించెను.

ఈ తెల్లకాగితము గూడ నిట్టిదే! సోదరీమణులారా, పురుషులతోఁబాటు మీరును నానా కష్టములను బడినారు! కాని యేమి ఫలము? ఇతర విషయము లెటులున్నను వాటితో మనకు బ్రసక్తిలేదు. మనకుఁ గావలసియున్నది వోటింగు హక్కు. ఈమాత్రము దానికి గూడ మనము నోచుకోలేదే! "తాటిపండు క్రిందుదువా లేక తలపట్టదవా" యని శ్వేతపత్రి మడుగుచున్నట్లున్నది. కాదా మరి—మనలోఁ బెద్ద పెద్ద యాస్తులుగల భర్త లెందరికి గలరు? ఇక విద్యావిషయకమగు యోగ్యత హుళక్కి. మరియును మును పిరువది

యొక్కరుండ్రను పురుషులు నొక స్త్రీ-ఇపుడు ఏడుగురు పురుషులు నొక స్త్రీ—ఇందేమి భేదమున్నది? మునుపు నార్గురు పురుషుల సంఖ్య, ప్రస్తుతమున మున్నూరో నన్నూరో కానచ్చును: కాబట్టి యిదికూడ సున్నకు సున్న హాళ్లీకి హాళ్లీ!!—ఏమియులేదు. పట్టి "మసిపూసి నేరేడుకాయ" యని చెప్పాల.

ఇట్టి భ్రమలుమాని మీా యాత్మశక్తిని సంపూర్ణముగాఁ జూపి దేశము నుద్ధరింప వలసియున్నది. ఈ కార్యమును సాధించుటకు మొదటి మెట్టు ప్రతి బాలికను విద్యావతిని జేయు దీక్షవహించుటయే!! మీారు మనస్ఫూర్తిగ దీనికై పట్టుపట్టిన నాలుగైదేండ్లలో పంతము సాగించుకొనఁ గల్గుదురనుట ముమ్మాటికి వాస్తవము.

ఈపట్ల శ్రీమతి బేగమ్‌షా నవాజ్ సతిగారొక హితోపదేశముఁ జేయుచున్నారు. అది సమంజసముగనే యున్నది. కాఁబట్టి దానిని బట్టి పోవుటయును ధర్మమే. "ఈ శ్వేత పత్ర సిద్ధాంతములను కేవలముగా "త్రోసిరాజు" చేసి త్రోసివేయక ఉన్నవాటి మూలమున మన మెంతవరకు మేలుపొంద నవకాశములున్నవో అంతవరకును మేలు పొందుటకే సకల యత్నములను చేయుట మంచిదని, నా దేశముననున్న భారతీయులను—స్త్రీ పురుషుల నిరువురను గూడఁ గోరుచున్నాను. ఇట్లు చేయుటవలన జాయింటు పార్లమెంటరీ కమిటీలో నున్న మన ప్రతినిధుల పక్షమునకు బలము చేకూరును. అట్లుగాక యిదెంతమాత్రమును పనికిరాదని త్రోసివేయుదుమా, మన ప్రతిపక్షులగు డైహార్డు ప్రముఖులకు మరింత యవ కాశము గలిగించినవార మగుదుము. దానంజేసి ఆ యున్నపాటి లాభమునుగూడ వీరి మూలమున బోగొట్టుకొందుమేమో! అందువలన నేమి లాభము. స్త్రీల వోటింగు హక్కుల విషయమున లోథియను కమిటీవారు చేసిన ఆ కొలదిపాటి సిఫారసులనైనను ప్రభుత్వమువారేల యంగీకరింపలేదో నాకు గోచరముగాలేదు. విద్యాయోగ్యత లుప్త ముగాఁ జేయబడుట స్త్రీల పక్షమున పట్టి యన్యాయము. ఇట్టి యన్యాయమువలన, సహాకారమునకై మనవంటివారు పడుచున్న కష్టములు ఇనుమడించును" అని. ఔను. నిజమే! "స్థితస్యగతిః చింతనీయః" అన్నట్లు ఉన్నదానిని బట్టుకొని లేనిదానికై ప్రాకు లాడుట యవివేకము; కాని ఉన్నదానిని త్రోసివైచి లేనిదానికై దేవులాడుట నేలవిడచిన సాము. కాబట్టి శ్రీ బేగంగారి మాటయు బాగుగనే యున్నదంటిమి.



# 'ఆశీస్సు'

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

ఉ॥ శ్రీలలితానులాపముల చిత్తము నచ్చగ తెల్గునాటిలో
స్త్రీలకు కల్పవృక్షమయి చెన్నలరారుచు వారి బెక్కుచం
దాల పురోభివృద్ధి కృషితత్పరలై మనునట్లు జేయున
ల్లాలిత మార్గదాయి "గృహలక్ష్మి" చిరాయువు గాంచుగావుతన్.
హిందూవనితల సాహిత్యవిజ్ఞానముల్ పెంపొందజేయుచు వెలసినావు
అజ్ఞానతిమిరంబునణగింప గతులకు మహనీయకాంతి సమర్చినావు
ఆబాలగోపాల మైకమత్యమెసంగ చెలికత్తెవై పేర్మిచెలగినావు
అల్లారుముద్దుగా నెల్లవారలజేరి "గృహలక్ష్మి" వగుచు రహించినావు
తెలుగు వెలదులు రారమ్మ చెలువయనుచు
పిలిచి ధనమిచ్చి చేకొని పేర్మిజూపి
మురిసి పల్కంది సంతసమును వహింప
సంచరించెదు "గృహలక్ష్మి" సంతతంబు
ఉయ్యేలలో తల్లియూచి జోలలుబాడి జోకొట్టినట్టి రోజులు గతించె
తప్పటడుగులు వైచి తల్లికేల్వట్టుచు సోలుచునుండు రోజులు గతించె
"అప్పప్ప నాన్ననాన్నా"యంచు మురిపెంబుజూపుచు బల్కురోజులు గతించె
పిలిచినయంత సవ్వాలయంగ తలవంచి చెలువంబుజూపురోజులు గతించె
కూకటిముడికిన్నై కురులించుకించుక చుట్టుకువచ్చురోజులు రహించె
పంచశారదలయ్యె క్రొమ్మించుకళల
దేరు నారవవర్ష మెతేరజొచ్చె
మంజువాక్కులతోడ సమంజసముగ
దినదినాభివృద్ధిని నీవుగని ముదంబు
గూర్పుమా యింక "గృహలక్ష్మి" కూర్మిమీఱ.

# గృహలక్ష్మి బాధ్యత

శ్రీమతి కె. వి. లక్ష్మీగారు

సామాన్యముగా జననీజనకులు లోకమాన్యులై_జ్ఞానాధికులై_దేశసేవాపరాయణులైనచో బిడ్డలుకూడ నట్టివారే యగుదురు. లేక వారు సంగీత సాహిత్యములం దసమాన ప్రజ్ఞాధురీణులైనచో బిడ్డలుగూడ స్వల్పప్రయత్నముతో నట్టివారు కాగలరు. ఒకవేళ వారు వ్యసనలోలురై_లోక కంటకులై_ప్రాణహత్యాది దోషముల కాటపట్టై యగుచో బిడ్డలుగూడఁ దమ బాల్యావస్థయందే తలిదండ్రుల మించిన వారగుదురు. అట్లుగాక, జననీ జనకులు సుఖవ్యాధులు, క్షయ ఇత్యాది రోగ పీడితులగుచో బిడ్డలును తప్పక తద్రోగ సంక్రమితు లగుదురు.

"ఆత్మా వైపుత్రనామాసి" యని గదా అన్నారు పెద్దలు. కాన బిడ్డలకు తల్లిదండ్రుల చాలుగాక మరొకరి చాలు వచ్చునా? పులి కడుపున మేకపిల్ల పుట్టునా? కాబట్టి భావిపౌరుడఁగు శిశువు విషయమై తగు జాగ్రత వహించి యభివృద్ధి ప్రాప్తుఁడగునట్లు పోషించవలెను.

ఆహారము.

శిశువులకు వేడినీళ్లును, బాలును, శుభ్రమగు గాలియు గదా ముఖ్యములు. సంవత్సరములోపున నున్న బిడ్డలకుఁ బగటిపూట 8_9 పర్యాయములు, రాత్రి 2 సార్లును దల్లి పాలియ్యవలెను. అన్నప్రాశనానంతరము మెత్తని యన్నములో వాము పొడి, యుప్పుకలిపి పెట్టవలెను. మఱియు బలవర్ధకములగు వెన్న, మీగడ, పెరుగు, బిస్కత్తులు, పండ్లరసము, రొట్టెల నాహారముగా నీయవలెను. కొందరు పాశ్చాత్య మోహ పరవశులై, సప్త వ్యసనాంతర్భాగమనఁదగిన కాఫీ, టీ లను దామలవాటు చేసికొని పిల్లలకును జిన్న చిన్న చెంచాలతో నోటిలోఁ బోయుదురు. అది యుద్యోగ డాంబికమనియు, గౌరవార్హమనియు దలతురు గాబోలు. అట్లు కాఫీ పుచ్చుకొనుటచే వారలవి చిన్న బొజ్జలు కాన నరుగక సర్వరోగ మూలకమగు నజీర్తి కాహుతియై యసువులఁ బాయుచున్నారు.

నీరు.

పిల్లల కుష్ణ జల మత్యంతోపకారకమయినది. రెండు పూటలును సున్నిపిండి, పేడ, సబ్బు నుపయోగించుచు స్నాతులఁ గావించవలెను. అనేకపురుషులకు వనితామతల్లులవలె ముంగురులలోను, కొందరు స్త్రీలకు స్త్రీసహజములగు నలక లుండక ముఖాగ్ర భాగము వఱకు కేశము లుండవు. దానికి కారణము వారి తల్లుల తెలివి తక్కువయే. మొదట శిశువులకు నొడలంతయు రోమావృతమై యుండును. అప్పుడు తల్లులు యథావిధిగా_మనోహరముగ వెండ్రుక లుండునట్లు ముఖాగ్రముపై నలుగుపెట్టినచో సముచితముగా నుండును.

ఈ యుష్ణజలము పిల్లలకు నధిక తేజస్సును, నారోగ్యమును, సుఖ విరోచనమును గలుగఁ జేయును. స్నానాత్పూర్వము నేత్రములలోఁ గొంచెము చమురు వేసినచో నా

కర్ణాంత నేత్రులై వెలయుదురు. స్నానాహారానంతరము పిల్లలకుఁ గాళ్లు చేతులు పట్టినచో నాహారము ప్రతి నాళకోశమునకు బ్రవించి బలవర్ధక మగును.

గాలి.

ప్రాణాధారకమగు వాయువు విషయమై తగు జాగ్రత్తతో నుండవలెను. అత్యంత శీతోష్ణముల బారి బడయనీయరాదు. భాగ్యవంతులు తమ పిల్లల కెక్కడ దృష్టిదోషము తగులునో యను భయముచే గవాక్షములు మూసి చీకటి గదిలో గుడ్డలు మొగమునిండ కప్పి దాతురు. అది యజ్ఞాన కృత్యము. సాయంకాలమందుఁ బిల్లలనారు బయటఁ బరుండ బెట్టవలెను. పిల్లల నెంతగా వస్త్రావృతులుగాఁ జేసినను దోమలు నీగలు ముసురుకొనును గానఁ బ్రతివారును సాధ్యమైనంతవఱకు దోమతెరల వాడుట సముచితము.

పండ్లు.

పండ్ల పుట్టుకకాలము పిల్లలకుఁ బ్రాణాంతకకాలము. అరు నెలలకుఁ గాని సంవత్సరమునకుఁ గాని పండ్లు వచ్చును. పాపము వారల చిగుళ్లుబ్బును. "కుదుళ్లు కట్టుతుంటే కుంచెడు పాలుకుంటారు" అన్నట్లు వారి ఆరోగ్యము తారుమారగును. విరోచనాలు కూడ నగును. దీనివలనఁ బ్రమాద మంతగా లేదు. పండ్లు వచ్చిన పిదప జబ్బులన్నియు మాయమగును.

రోగములు.

పసి పిల్లలకు జబ్బు లెక్కువగా వచ్చుచుండును. దీనికిఁ గారణము గృహలక్ష్మి యనఁదగు మాతామతల్లియొక్క యశ్రద్ధయు నజ్ఞానము. పొంగు, అటలమ్మ, మశూచి, విషజ్వరము, దగ్గు, పడిశము, కురుపులు నిత్యాదిరోగములకు శిశువు లాహుతియగుదురు. ఈ రోగపుంజముయొక్క చికిత్స విషయమై తగు శ్రద్ధ వహించినచో సజీవులు కాగలరు. తల్లి బలిష్ఠగా—రోగరహితగా నుండుచో పిల్లలుకూడ రోగరహితులుగానే యుందురు. "కార్బన్" పేపరు నుంచి వ్రాయుచో నొకటి రెండుకాగితములు స్పష్టాక్షరసహితములై మూడు నాల్గు కాగితములపై సరిగా నక్షరములు పడనట్లు తల్లి దండ్రుల వయసు మీరిన కొలది పిల్లలును బలహీనులుగానే పుట్టుదురు.

కుటుంబ స్థితిగతులఁ బట్టియు, దారిద్ర్యమువలనను, ననహ్యములగుఁ బార్శ్వ ప్రదేశముల వలనను, అజ్ఞానమువలనను, శిశు మరణము కల్గును. మఱియు నవమాసపూర్తి కలుగక పూర్వమే పుట్టిన బిడ్డలు మరణింతురు. అంతియగాక కొందఱు పిల్లలకు సరిగా పాలియ్యరు. ఇందుకు శిశు మరణములు జరుగుచున్నవి. కాలపరిణామవశమున నేమి? ఆరోగ్యశాఖల ఫలితముల వలన నేమి? నాగరికతాభివృద్ధి వలన నేమి? క్రీ॥ శ॥ 1880 సం॥ పిదప శిశు మరణ సంఖ్య తగ్గినది. ఆఁడుపిల్లల శరీరముకంటె మగ పిల్లల శరీరము లతి మృదులములు, సున్నితములును. అందుచే కొంచెము బాధ కల్గినను సహింపక యసువులఁ

బాయుటచే నాఁడుపిల్లలకంటె మగపిల్లల మరణసంఖ్యయే యధికము. సంవత్సరము లోఁపున నున్న శిశువులు 100-కి 20-మంది చనిపోవుచున్నారు. శిశువు లధికముగా మరణించు చున్నారన్న నర్థ మేమిటి? ఆదేశపు స్త్రీలు వట్టి యజ్ఞానురాండ్రు. అలక్ష్మ్యోపేతలు. ఉచితానుచిత జ్ఞాన రహితు లన్న మాటేగా. ఆదేశజులు నాగరికత యందెంతయో హీనస్థితి నుండుండి యజ్ఞానాంధకారావృతులై యున్నారన్న మాటేగా. లోకకల్యాణకారకులై వారలలో నెందఱు కవి పుంగవులు, అధ్యాత్మిక తత్వ వేత్తలు, విమర్శకాగ్రేసరులు, కళోపాసకులు, లోకమాన్యులు నుండిరో అట్టివారల యమూల్య బుద్ధులు నశించి పోవలసినదే గదా! మన మొకింత శ్రద్ధ వహించుచో వారలలో గొంతమందియైనను నట్టి మహనీయులు తయారై ప్రపంచకల్యాణమునకుఁ దోడ్పడుదురు గదా! అఫగన్‌స్థాన్ దేశీయులు అమెరికా వాసులును బహు శ్రమల పడి యారోగ్యశాఖాభివృద్ధి గావించి శిశు మరణ సంఖ్య తగ్గించినారు. మనము నధికముగా శ్రమించి శిశుమరణసంఖ్య తగ్గించినచో నెంతయో దేశోపకారుల మగుదుము. శిశ్వవస్థలో నుపేక్షించి దేశోపకారకులు, ధీమంతులగు యువకులు లేనిర దుఃఖించిన నెచటినుండి వత్తురు?

టీకాలు పిల్లలకు సంజీవని వంటివి. దీనిని "జెన్నరు" దొరగారు కనిపెట్టిరి. ఒక్క-సారి టీకాలు వేయించుకొనిన నేడేండ్లవఱకు మసూచికాదులు రావు. ఆరోగ్యశాఖవారు టీకాలు వేయబోయినను దల్లులు తమ బిడ్డల కేమిముప్పు వచ్చునో యని దాచుకొనుచున్నారు. దీనికంతకు నజ్ఞానమే కారణము.

మన దేశములో భ్రూణహత్యలు నానాటి కభివృద్ధిఁ జెందుచున్నవి. దీనికిఁ బ్రబల కారణము వితంతు సంఖ్య యధిక మగుటయు, దేశము దారిద్ర్య భూయిష్ఠ మగుటయును. ఇతర దేశములలో ననేకానాథశరణాలయములు కలవు. శిశుమరణసంఖ్య తగ్గించుట కివి యధికశరణ్యములు. ఇట్టిది యేలూరులో నొకటి స్థాపించిరి.

శిశువుల హైన్యమునకు, నుచ్ఛ దశకును మాతృదేవతలే కారకులు. తల్లులు జ్ఞానాధికురాండ్రగుచో శిశువుల పురోభివృద్ధికి నుపకారక మగుదురు.

# సీత యుత్కలిక

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

శ్లో॥ కమఠపృష్ఠకఠోరమిదంధనుః
మధురమూర్తి రసౌరఘునందనః
కథమధిజ్యమనేనవిధీయతాం
అహహ! తాతపణఃఖలుదారుణః॥

తే॥గీ॥ కమఠపృష్ఠకఠోర మీకార్ముకంబు
సరస సుకుమారుఁడీరామచంద్రమూర్తి
యెటుల నెక్కిడ నేర్చునో యేమియౌనొ
కటకటా! యేటి శపథ మో కన్నతండ్రి.

భాషాంతరీకరణము:

# కృతజ్ఞతా పంచరత్నములు

శ్రీమతి చిలకపాటి సీతాంబగారు

ఇలవేలుపై నాకు నిష్టార్థములొసంగి యలరించు వెంకటాచల విభుండు
స్మరణమాత్రనె సేవ సాయించి శుభదృష్టి నను గాంచు శ్రీరంగనాయకుండు
దమ కంకితంబిత్తుఁ దనరు శ్రీపద్మినీ పరిణయప్రఖ్యాతిఁ బరగఁజేయ
ఒంగోలు వెంకటరంగరాయాఖ్యను సత్కృపాపరతఁ బ్రసన్నులగుచు
బాలపలుకుల కలరెడి భంగి నందుఁ గలుగు నెరసుల సరసంబుగా విమర్శ
నంబనెడివ్యాజమున సోయగంబుఁ గూర్చు, దైవమూర్తికిఁ జేతు వందనశతంబు.

అతులప్రకాశమహాప్రభావంబులై, మహితవరా సద్గుణమణులు గలిగి
సంతతోత్సాహవిస్తారభావములునాఁ, బ్రకటతరంగమాలికలు గలిగి
సరస గంభీర విశాలాశయములను, జల గభీరాశయంబులఁ జెలంగి
ఘనుల సవ్వారి త్యాగమున మిన్నందించి, ఘనములఁ బూరించు ఘనతఁ గాంచి
క్షీరవారాసి కెనయైన సిరుల నలరి, ధరణి గృహలక్ష్మియను చిన్నితనయఁ గాంచి
పెంచియలరించి కీర్తినొందించు ఘనుని, కేసరిమహాశయునకు నేఁ గేలుమోడ్తు.

సీమంతినీమణీసేవ్యమై శుభదమై, యాలోకరమణీయమై చెలంగి
తరుణాంబుజాలిసంభరితసరోవర, ప్రతిమమై చెలువమై పరిఢవిల్లి
మాంగల్యకృద్వధూమాధుర్యసాహిత్య, రచనావిభూతిచే రమణమెఱసి
బహుళవిద్వత్సతీభావుకామోదమై, శ్రీదమై యెనలేని సిరుల నలరి

సంతతారూఢభాగ్యవిస్తారయుక్ గృ
హాకలితరామణీయక భవ్యదే హ
యతులితానందకీర్తిలతాలవా ల
పూజ్య యాస్త్రీలపాలిటి రాజ్యలక్ష్మి.

శ్రీగృహంబగు విరిదమ్మి చెలువుఁ బోలె
సహజ సౌందర్యయుతపత్రసమితిఁ దనర
సలలితామోదమాధురీకలన వెలసి
లక్ష్మికావాసమై గృహలక్ష్మి యలరె.

కరుణచెలంగ నారచిత కావ్యము నాగృహలక్ష్మి పత్రికా
వరమునఁ బెంపుఁ గూర్చు బుధవంద్యుఁడు శ్రీకవితాభిమాని కే
సరి నరసింహమూర్తిసిరి శాశ్వతమై మహిళాభిరామమై
ధరఁ జెలువొందుఁ గాక విదితంబగు కీర్తిసతీసమేతమై.

# వాకలగరువు—వంగలపూడి—అడ్డతీగెలు

కవికొండల వేంకటరావుగారు

మా మాతామహుణ్ణి మేము 'తాతయ్యా' అని పిల్చేవాళ్ళంకాము. 'ఆయా' అనేవాళ్ళం. బహుశః అది 'అయ్యా'యొక్క రూపాంతరం అయివుంటుంది. మా మేనమామలు 'అయ్యా' అనడానికి మాకు 'ఆయా' అనడంవల్ల వారల ననుకరించి మేంకూడా 'ఆయా' అనేపిలవడం రివాజుఅయితే అయివుండవచ్చు. అంతకంటే మరో కారణం కనిపించదు. మేమంతా ఓయింట్లోనే కాపురం.—రాజమహేంద్రవరంలో కూరలమార్కెట్టునుంచి గోదారికేసి దిగే వాలువీధి రాతిచప్టా కుడంచేతిమీది మొదటిసందులో ఎడంతట్టు మొట్టమొదటి మేడింట్లో వుండేవాళ్ళం. దాన్ని చగిడీసందంటారు. ఆయింటి వీధిగుమ్మం పశ్చిమానికి వుంది. సూర్యుడు పడమటి దిసకు దిరిగేటప్పటికి కాస్తోకూస్తో యెండ లోపలిపావిట్లోకి వీధితలుపు తీసి వుంచితే తప్పకుండా పడుతుంది. ఆవీధిగుమ్మంకు ఓరిపిలుగా మాఆయ తన పట్టెమంచం జంబుఖానా అన్నీ ఉంచుకొని భోంచేసిన వెంటనే పగలు కాస్సేపు విశ్రమించుకోవడానికి వాటి నన్నిటినీ పొదుపుగా అమర్చుకొని ఓకునుకు కునికి మూడుకొట్టేసరికి లేచి, మంచంకింద అప్పటికప్పుడే వుంచుతేవచ్చే ఆపుకోరాడు మంచినీళ్లు గడగడాత్రాగేసేసి కబుర్లుచెబుతూవుండేవాడు—ఎవళ్ళమన్నా పలకరిస్తే—లేకపోతే మాఅమ్మమ్మ మీద కేకలు పెడుతూవుండేవాడు—కేకలు పెట్టకుండా వుంటాడని పలకరిస్తూనే వుండమనే ఎవర్నో యెుకర్ని మాఅమ్మమ్మ—అలా పలకరించడంవంతు ఓపొద్దు నాక్కలిగింది.

"ఆయా" అన్నాను. "ఏంబాబూ! దగ్గఱకు జేరుతున్నావు. ఏంకథ?" అన్నాడు. "ఏమీలేదు. పటికబెల్లంవుందా, అయిపోయిందా?" అన్నాను. "ఉండాలరా కాస్తముక్క; చూడు;అవక్క, పొట్లంలో" అన్నాడు. అదితీసి రెండుముక్కలు క్రిందకొట్టి ఒకటి ఆయనకిచ్చి యొకటి నేతీసికొని—టీపార్టీల్లోకవక ఇద్దరొకరొకరి కాయుష్షు ఆరోగ్యం చెప్పుకుంటూవుంటారే ఆలా పాయిలాబాయిలాగ్గా వయస్సుయొక్క హెచ్చు తగ్గులతో ప్రమేయంలేకుండా చేరిగ్గాకూర్చొని పటపటమనిపిస్తూ వున్నాము. "ఆయా! నీపళ్ళింకా గట్టిగానే వున్నాయి!" అన్నాను. "ఉండవురామరి? ఇప్పటి వాళ్ళకు మల్లే చిన్నప్పుడే పెళ్లిళ్ళై అస్తమానం పెళ్ళాల్దగ్గఱే కాలం గడిపేవాళ్ళంరా మేము?" అన్నాడు.

అలా అంటూవుండేసమయంలో వీధిగుమ్మాన్ని లోపలికిపడ్డ యెండకడ్డను పడి ఓముత్తైదువయెవరో పెద్దశరీరచ్ఛాయ లోపల కాక్రమణ చేసేటట్టుగా వస్తువుల గలగలతో మెట్లెక్కుతూ లోపలకడుగు పెద్దప్రథ లాగుపెట్టింది. ఆముత్తైదువ చేతిలో చిన్నమూటుంది. పచ్చనిశరీరం. లావుపాటి ఎత్తరిమనిషి. పెద్దబుగ్గలు. పెద్దజబ్బలు— !—ఆమెను జూస్తూ నేను నిర్ఘాంతపోతూవుంటే తాతయ్య యెంతో పరాసికంగా "ఎక్కణ్ణుంచేవ్? వీరమ్మా! రాక?" అన్నాడు. "పుట్టింటికాణ్ణుంచే బావా!, అడ్డతీగల్నుంచి వంగలపూడొచ్చి, వంగలపూణ్ణుంచి యీలావొచ్చాను." అంది. "ఒక్కర్తవే వస్తా? మఱదలపిల్లా! ఎంతసాహసం నీకు!" అన్నాడు. అని "వెళ్లు. లోపలికివెళ్ళు. మీఅక్కయ్య లోపలుంది. ఏమేవ్. వీరంబుల్లొచ్చింది." అన్నాడు.—నాకేమో నవ్వుగావుంది. గొప్పసమస్యగావుంది. నేనెప్పుడూ ఆవిణ్ణి చూడలేదు. అలాంటి మనిషినీ చూడలేదు. అంత వేళాకోళంగా మాతాతయ్య ఏఆడమనిషితోనూ ఆఖరుకు మాఅమ్మమ్మతోనైనా ఆడ్డం వినలేదు కనలేదు. ఇంకో టేమిటంటే, వంగలపూడి అనే వూరు నేటేవుంది. అది ఆపెద్దవీరం కాదు—

బుల్లివీరం పుట్టిల్లని రట్టుచేసింది మాఆయమాట-అంటేనామజీ—మాఆయ కోపుట్టిల్లు అమ్మమ్మ కోపుట్టిల్లు వుండాలాఅని అనిపించింది. అదివఱకును అమ్మమ్మది, మాది, మాఆయదీ అందఱిదీ పుట్టిల్లూ, అత్తిల్లూ రాణ్మహేంద్రవరమనే.—

"ఆయితే ఆయా! ఈవిడ పుట్టిల్లు వంగలపూడైతే అమ్మమ్మ పుట్టిల్లో?" అని అడిగేను.

"ఓరి నీచదువు తగలడ, అమాత్రం తెలీదురా? మీ అమ్మమ్మదీ వంగలపూడే. వాళ్ళిద్దఱిదీ ఓకోచే" అన్నాడు. "అయితే నీకూ ఓపుట్టిల్లుందా" అన్నాను. "ఆ! వాకలగరువు నా పుట్టిల్లు" అన్నాడు. ముసిలికనుబొమలు పైకిగరేసుకుంటూ-పాపమనిపించిం దంచేతో నాకు-ఊరుకున్నాను ఓనిమిషం. అప్పుడు మళ్ళీ మాపెంలుమనిషై "మగాడికి పుట్టిల్లేమిట్రా బాబూ?" అన్నాడు ఆయ. అంటే నేను కొంచెం దగ్గఱగా చేరి "అదికాదు. అదే—" అన్నాను—"అదేఅంటే పుట్టినూరు అనేనా" అన్నాడు. "పుట్టినూరు పెటిగినూరు అకే" అన్నాను. "వాకలగరువురా" అన్నాడు. "ఏక్రైనా వాకలగరువేరా" అన్నాడు. అంటే నేనడిగాను "వాకలగరువంటే, అమలాపురం తాలూకాలోది అదేనా" అని. అవు నన్నాడు. "అయితే ఆయా నీ దెక్కడో వాకలగరువైతే అమ్మమ్మదెక్కడో వంగలపూడైతే, అక్క-డమ్మమ్మను ఇక్కడితాతయ్యవి నీవు ఎలా వివాహమైనావు? నీకెల్లా తెలిసింది ఆయా! అక్కడమ్మమ్మ న్నట్టు ఆఅమ్మమ్మను నీవు పెళ్లాడాలన్నట్టు—ఎక్కడి వాకలగరువు ఎక్కడి వంగలపూడి!" అని కృచ్ఛిం చేను రిచ్చపోతూ—కించిత్తు కించిత్తు. నేనలా రిచ్చపోవడం సరైందే అంటారు పాఠకు లావూరు ఆవూరు ఎంతదూరాన్ని వీలావున్నాయో తిలకిస్తే—వంగలపూడి సింగారం ఈ గ్రామాదులు సీతానగరం రఘుదేవ పురం అప్రాంతానివి, అంటే కికారణ్యపు మణ్ణెం. ఒక్కొక్క ఊరు. ఊరుకాదది. పల్లె—కోనవాళ్లుండే మాయకోన. అదంతా వెదురుబిడాలు, మత్తిచెట్లు, టేకిచెట్లు, మద్దిచెట్లు, చెట్లల్లోచెట్లు మొలిచి చెట్లను తీగెలుకాలించుకుని, కట్టుగుడిసెలకు వేళ్ళప్రహారీగోడ లక్కఱలేకుండా వేకేకంచె లక్కఱకాకుండా వుండే కొండపంచవన్నీని. రస్తాలేనివి. చిలుతపుళ్ళు, సివంగులు, పెద్దపుళ్ళు, అమాంతంగా, దారంట పోతూవుంటే మీదికుఱికి పీకలుకొఱికి పారేసేస్తాయి. అవూళ్ళల్లో—ఇక వాకలగరువన్నట్టాయినా ఈమూల సప్తసాగరకేంద్ర కుండలంలో కుగ్రామం. పిల్లకాలవంచే పోకతోటల్లో కొబ్బరిమాదల్లోకప్పడి, ఇళ్ళమీద ఎండుమట్టల నిగారిస్తు పగానికిపగం సూర్యచంద్రాదుల్ని చూపిస్తూవుండేకుప్పం. పడవలు వెళ్ళవు; బళ్ళు వెళ్ళవు. రైలుమాట మోటార్లమాట ఎత్తనెందుకు? అటువంటిది వాకలగరువు.

వాకలగరువు స్వస్థానమైన మాతాతయ్య వంగలపూడి పుట్టిల్లుగా వుండియుండిన మా అమ్మమ్మ నుద్వాహమైనాడూ అంటే ఆశ్చర్యం కదూ.

"ఎల్లా చూచేవు ఆయా! అంతదూరాన్ని వుండియున్న అమ్మమ్మమీద ఎలా నీకు చూపుఆనింది?" అని గంభీరసమస్యల్లే తెలిసికొందామని నిక్కచ్చిగా నిలదీసిఅడిగివ ట్టడిగేను. అపాంగంగా నాకేసి చూచి నాడు ఆయ. చూచి అన్నాడు "వాకలగరువు తోట్లో అన్నిటికంటే ఎత్తయిన పోకచెట్టు వొకటుంది. అదెక్కి చూస్తే వంగలపూడిలో మీ అమ్మమ్మ కాదు కదా దుమ్మగూడెం అవతల శబరమ్మకూడా కని పించేదన్నాడు. "అలాగ్గా ఓనా నాపోకచెట్టెక్కి మాస్తూవుంటే మీ అమ్మమ్మని పెళ్ళాడే యూహా నాకు పట్టింది" అన్నాడు. ... అప్పటికి లోపల్నుంచి పీరమ్మమ్మమ్మ తన అక్కయ్యను చూడు కొని యీవలకు వస్తూ "ఏం మనవడా! మఱచిపోయావు? అమ్మమ్మని" అంది. నాకు ఆమెను చూచి నట్టే జ్ఞాపకం లేదు. మాతామహు డన్నాడు. "వీడు నామాట నమ్మటం లేదే పీరమ్మా! ఈ మనమ డడు

గుతాడు.—వాకలగరువులో వున్న నేను వంగలపూడిలో వున్న మీఅక్కయ్య నెలా చూచి ఎలా వివాహమైనానో అని—ఇప్పుడు నా తొంభైయో యేట దాని ఏభైఆరో ఏట—ఏం చెప్తావు దానికి నువ్వు సమాధానం?" అనిఅడిగేడు. వీరమ్మన్న ఆవిడ దభాలున చతికిలపడి "బావా! మీవూళ్లో పొడుగు పోక చెట్టెక్కి చూస్తే వంగలపూడి కాదు కందా, పర్ణశాలగూడా కనిపిస్తుంది" అంది. తాతయ్య వెంటనే 'ఓసి నీ పిస్సినిమడ. నాకు తట్టిన ఊహే నీకు తట్టింది. అయితే మీవూళ్లో వెదురుపొదల్లోంచి తొంగిచూచి అడ్డతీగల్లోని నూతమ్మడొపిస్తే నే పెళ్ళాడావా? వాణ్ణి? వాకలగరువులో పోకచెట్టెక్కి మీఅక్కను నే చూచి పెళ్ళాడ్డానికి?" అన్నాడు. "అయితే నీ విందారా నన్నదబద్ధమన్న మాటే అయూ?" అన్నాను. "ఉండరా ఇదేమంటుందో నేనడిగిందానికి విందాం." అన్నాడు. ఏమంటుందా! "బావా మరి నీపెళ్ళికి నేనసలే పుట్టలేదు కదా ఏం చెప్తావు అంటే ఏం చెప్పేది? ఏదో చెప్పాను" అంది. అంటే తాతయ్య "నా పెళ్ళినాటికి నీవు పుట్టకపోయినా వాయూహా వీయూహా మాత్రం తూచినట్టుగా ఒక్కటైందే వీరమ్మా" అన్నాడు. ఆ ప్రశంసకు ఆవిడ కొంచె ముబ్బినట్టయింది. అప లావిడ ఎత్తిరి పెద్ద బొద్దయిన పచ్చని మనిషి అని అదినే గ్రానీసు. "మాతాతయ్య పెళ్ళినాటికి పుట్టక పోవడ మేమిటి? తనకు తొంభైయోయేట దానికి యాభైయారో యేటా అంటే పెళ్ళినాటికి మాఅమ్మకు మూడో ఏడో నాలుగో యేడో అయియుండాలి" అని లెక్కించడములోపడి మళ్ళీ గిరుక్కున ఊహాప్రపంచంలోకి పుజీకి—"ఇంతంత మనుష్యులు, ఈఅజానుబాహులు, ఈ లావుపాటి కొత్తగా వచ్చిన వీరమ్మ వీళ్లంతా మొదట్నుంచి పుట్టియుండాలి. యీ మధ్యకాలంలో పుట్టి పెళ్లి కావడం ఏమిటి?" అని అదో మాలోకంలో పడ్డాను.

అసరసంజకుడుపు కుడుచుకుంటూ పాము చెవుల్లాగ చెవు లేసుకొని మాఅమ్మమ్మ అంటె మా తాతయ్య పెళ్ళాం మామాతామహి ఆవిడ "ఏమిట్రా! వింత! వంగలపూడి గోదావరి కగువుగా వుంది. వాకలగరువు దిగువగా వుంది. నన్ను మా తండ్రి అగోదావరిలో పారేస్తే ఆ వాకలగరువున తేలి మీ తాతయ్య చేతుల్లో పడ్డాను. అక్కణ్ణుంచి ఇద్దలం ఎగువుకు ఈదుకుంటూ ఈ రాజమహేంద్రవరపట్టాన్ని ఎద్దిరాళ్ల దిబ్బ దగ్గఱగ గట్టెక్కాం. ఇదంతా ఓప్రవాహం" అంటూ లేవండి మంచ మెత్తండి. లే చెల్లీ! లే! దీపాలు వెలిగించు కాస్తంత" అంటూ అందఱ్ని లేవదీసింది.

ఆహో ఇదో కొత్త సిద్ధాంతం అనుకున్నాను. "తాతయ్య పోక చెట్టెక్కి అవ్వను చూచానంటే అవ్వ గోదావరిలో కొట్టుకుపోయి తాతయ్య చేతిలో పడ్డాను అంది"—అనుకున్నాను. వీరమ్మమ్మమ్మ లోపల దీపాలెడుతూ "అవతల చీకటి చీకట్లాగే వుంది నేనింట్లో దీపా లెన్ని పెట్టినా కానీ—మన సిద్ధాంతాలు మనవి! జరిగే కల్యాణములు జఱక్క మానవు-"అంది. "ఎక్కడ వాకలగరువు, ఎక్కడ వంగలపూడి, ఎక్కడడ్డతీగెల!—"అంది. "అతీగలన్నీ తప్పించుకొని నువ్విప్పుడీ పూటిక్కడికి రావడం?" అన్నాడు తాతయ్య తన మఱదల్ని చూచి—

ప్రపంచంలో ఆశ్చర్యం కలగచేయకుండా వుండే దొకటీ లేదనుకున్నాను. నేను తిరిగి అముగ్గురుని కృతయుగపుమనుష్యుల్లాంటి ఆముగ్గుర్ని అంటే మాతాతయ్యను మాఅమ్మమ్మను, ఆకొత్తగా వచ్చిన అమ్మమ్మ చెల్లెల్ని చూస్తూ— అనాదికాలంనుంచి వాళ్లుండి వుండాలి. వీళ్లొకప్పుడు పుట్టడ మేమిటి, వీళ్ళొకళ్ళొకళ్ళని జూచుకు పెళ్లి కావడం ఏమిటి? టప్! నేను నమ్మను" అనుకున్నాను. నిశ్చయంగాఅనుకున్నాను. ముమ్మాటికి అనుకున్నాను.

# పేదరాలు

చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాదుగారు, బి. ఏ.

ఆమెగుణవతి—నిరుపేద అందమొల్క
మేల్మిబంగారునగ లేవిమేనలేవు
మనసుదీరగ ధరియింపమంచివైన
వలువలైనను నెరుగ దావనరుహాక్షి—

గుణమెముఖ్యము—వేలుభూషణములెల్ల
బాహ్యసౌందర్యమును బాగుపఱచువఱకె
అనపహార్యము శుభముల కాస్పదంబు
సద్గుణముకన్న వేలుభూషణము లేదు—

అన్నమే లేనినిఱుపేద యగునుగాక
ఆమె కనుగొనలందున నవఘుళించు
కాంతిపుంజమె ఆనందకరముగాదె
వెన్నెలనుమించు రత్నాలవెలుగుకన్న—

ముద్దులొల్కునట్టి ముత్యాలహారాలు
లేవటంచుదిగులు లేనెలేదు
విలువలేనియట్టి విరజాజిమాలలే
వింతసొరుగూర్చు వెలదికెపుడు

సన్నుతికినెక్కుబుత్త్రిల గన్నకసువు
పరులయాదరణంబును బడయునేర్పు
లేమిగల్గిన కష్టమేలేనియోర్పు,
విలువగలభూషణములివి వెలదికెపుడు—

ఆమెగుణవతి—నిరుపేద, అగునుగాక
కరుణనుంతైన లేదు లోకమునకకట!
ధనమునేగాంచితలయొగ్గు ధరణిజనులు
కాంచనేలేదు పేదలకష్టములను

# ఉగాదిరాక

అబ్బరాజు వెంకటరంగారావుగారు

---

చిగురుటాకులలోని చిఱుతకోయిలకూత
మధురమై నీరాక మాకుఁ దెల్పె
విరియఁ బూచినయట్టి వేపపూతల తీపి
మధురమై నీరాక మాకుఁ దెల్పె
ఎల్లదిక్కుల నల్లు మల్లెపువ్వులతావి
మధురమై నీరాక మాకుఁ దెల్పె
మధుమాసవేళల మావిపిందెలశోభ
మధురమై నీరాక మాకుఁ దెల్పె
అరువదేఁడుల బహుకాలమైనదాక
రాకరాకను వచ్చిన రాకఁగాన
స్వాగతము నీకు శ్రీముఖా! స్వాగతమ్ము
శ్రీల నిమ్ముగ మాపై నీఁ జిమ్మి పొమ్ము.



శ్రీమతి వి. ఆర్. సరస్వతి గారు

నర్సాపురం ఆంధ్రస్త్రీల పోటీపరీక్షలో మొదటి
తరగతిలో నుత్తీర్ణులైనవారిలో నొకతె.

# దిక్కులేనివారికి దేవుడేదిక్కు

జె. యస్. సోమయాజులు గారు

"ఎల్లావుందిపిల్లకు?"

"ఎల్లాఉందనిచెప్పను! ఒంటిమీద వడ్లగింజ వేస్తే పెటేక్కున పేలాలగింజఅవుతోంది!"

"డాక్టరుగారువచ్చారా?"

"ఆ. మందుసీసా కొనితెచ్చుకోమని చీటీరాసిచ్చేరు. ఇవ్వాళైనా కాస్త పెందరాడే రాకూడదూ?!"

వెంకట్రావుముఖం తెల్లమతాబా కాల్చింది— అంటే, ఆతనిముఖం, తుమ్మల్లోపొద్దుగుంకినట్లుంది. దాన్నే, కత్తివాటేస్తే నెత్తురు చుక్కలేదంటారు. నిస్తేజుడై, నిర్విణ్ణుడైపోయేడు మందుసీసా కొని తెచ్చుకోవలసివచ్చుటచేత.

వెంకట్రావు బడిపంతులు. స్వంతంగా బడిపెట్టుకొని, పిల్లలదగ్గర జీతం వసూలుచేసుకుంటూ మర్యాదగా, ప్రభుత్వంవారిచ్చే గ్రాంటు పుచ్చుకుంటూ గౌరవంగా జీవయాత్రచేస్తున్నాడు. ఆపట్టణంలోని ప్రాథమికపాఠశాలల్లో, వెంకట్రావుగారి బడంటే, చాలాప్రసిద్ధి: ఆపాఠశాలలో అర్చనచేస్తూ ఇతర ఆసక్తులు—వ్యాపారాలు-ఆశలు- పోకడలు లేక, తృప్తిగా నలుగురికి నోట్లోనాలికలా-ఉంటున్నాడు వెంకట్రావు.

వెంకట్రావుభార్య సుశీల - వివేకంగలది-భర్త మనస్సుగుర్తించి, చేదోడువాదోడుగా ఉంటుంది.

ఆదంపతులికి ఒక ఆడపిల్ల-అయిదేండ్లవయస్సు. ఒక్కక్షణంకూడా ఆపిల్లనోరు వూరుకోదు-బహు మాటకారి-ఆవీధిలో అమ్మలక్కలు ఆపిల్లనుచూచి నప్పుడల్లా, "నీకు మీఅమ్మ వస ఎక్కువపోసిందా ఏమిఅమ్మాయి" అంటారు. కాని, ఆపిల్ల చిలిపి పనులు చేయదు. ఎదుటివాళ్లకికోపంవస్తే, ఇకమాటాడదు. తల్లిపేరుపెట్టుకుని, ముద్దుగా 'అమ్మణ్ణి'యని పేరుపెట్టి పిలుస్తూ గారాబంగా పెంచుతున్నాడు వెంకట్రావు.

ఒకరోజున అమ్మణ్ణికి జ్వరంవచ్చింది. క్రమంగా హెచ్చింది తగ్గటంలేదు. అల్లంమిరియాలకని, గోధుమ్నూక పటికబెల్లానికని, వానరొట్టికని, పాలకని సోడాబుడ్లకని ఇంటోడబ్బు కాస్తాఅయిపోయింది. జ్వరంతగ్గలేదు. పొద్దున్నలేచి, డాక్టరుగారితో చెప్పి, ఊళ్లోకిబయలుదేరేడు తాను చదువుచెప్పిన పిల్లలతండ్రులు ఏమైనా ఇస్తారేమోయని.

ఒకపిల్లవానితండ్రి దగ్గరకు వెళ్లి, "అయ్యా! మా అమ్మాయికి నుస్తీగాఉంది. పిల్లవాడిజీతంతాలూకు ఏమైనాయిప్పించండి చాలా అవసరంగాఉంది," అన్నాడు "అయ్యా మేష్టారుగారు! ఎక్కడాపైసా కన్పించడంలేదు. కొట్టద్దెలుబోలెడురావాలి. ఒక్కళ్లూ ఇవ్వడంలేదు. రేపు అమావాస్యకు తప్పకుండా ఇస్తానండీ" అని స్వంతదిక్కులు ఏకరువుపెట్టేడు ఆయన. ఇంకొకచోటుకి వెళ్లేడు వెంకట్రావు. "ఎక్కడ బేరాలుసారాలు లేవు. బాకీలువసూలు కావడంలేదు. ఈనెల్లోనిక్కచ్చిగావుంది. పైనెల్లో అన్నికలిపి పంపిస్తానండి" అన్నాడు—ఇంకొక తండ్రి, "పంతులుగారూ మీరు రెండుమూడుసార్లు వచ్చి, తిరిగి వెళ్లిపోడం చాలా చిన్నతనంగాఉంది. ఇక మీరు రాకండి; రేపకెల్లుండిలో తప్పకుండా పంపుతాను" అన్నాడు - వేఱొకచోటికి వెళ్లి, "అయ్యా! చౌదరిగారు! మీరు రెండుమూడునెల్ల నుంచి జీతం ఇవ్వటంలేదు. ఇవ్వాళ చాలాఅవసరంగా వుంది. ఏమైనా ఇప్పించాలి" అన్నాడు - ఆయన "నిజమేనండి, మీకు సరిగ్గా జీతం ఇవ్వటంలేదు. అదిగో! గాదిలోపోశేనుధాన్యం. బస్తా, కాస్త నాలుగురూపాయలేనా అయితే అమ్మేస్తానండి. అమ్మేసినతక్షణం మీజీతంమీకు పువ్వుల్లోపెట్టిఇస్తాను. కొంచం ఓపికపట్టండి" అన్నాడు, ఇంకొకపిల్లవానితండ్రి. "ఏంటయ్యా! సమువూలేదు, సందిలేదు, జీతం జీతమని ఏపించకతింటావు. ఇత్తానులే, ఎగదొబ్బుతానా

ఏంటి,? ఎళ్లండి, ఇయ్యాళ లేదు." అని తన నాగరికత వెల్లడిచేశాడు. అథోవదనుడై ఇంకోయింటికి వెళ్లేడు వెంకట్రావు. ఆయన నమస్కారపూర్వకంగా బహూకరించి మేష్టారు పిల్లకేమ స్తీగా ఉన్నందుకువిచారించి చివరకు "పంతులుగారు! ఇవ్వాళ శుక్రవారం, ఇవ్వ కూడదు రేపుచూద్దాం లెండి" అన్నాడు చల్లగా. వెంకట్రావు మరికొందరియింటికివెళ్ళేడు. ఒకాయన ఇంట్లో లేడు, ఒకాయన ఊళ్ళోలేడు, ఒకాయన ఇప్పుడే ఎక్కడికో వెళ్ళేడు. మరొకనికి నుస్తీగా ఉంది, ఇంకొకడు కోర్టువ్యవహారంలో మునిగిపోయేడు. వేరొకనివద్ద డబ్బులేదు.

ఈప్రకారం తలకోకఇబ్బంది తలకోకమాట తలకోకవంక చెప్పి, వెంకట్రావుని సాగనంపేరు. పాపం! బడిపంతులికి, అహర్నిశలు బాలునివిద్యాభివృద్ధికి పాటుపడు పంతులికి, రక్తమాంసాలు పిల్లలపాలు చేసేపంతులికి, కుమార్తె యస్వస్థతతో కుందుచున్న పంతులికి, సాయంచేయుటకు ఏతండ్రిదగ్గఱ డబ్బు ఉండదు. అన్నీచిక్కులే, అన్నీ ఇబ్బందులే, అంతా నిక్కచ్చే. అర్ధశేరుమాంసంలేందే అశనంగుడువనతనికి, పంతులుజీతానికి కోట్లుఅడ్డాలు కొదువఅవుతాయి. సవాశేరు పకోడీలులేందే ఇంటికిరా సాహసంలేని షాహుకారికి, కుర్రవాడి జీతానికి బేరాలుసారాలు ఉండవు. సాయంత్రం పడేటప్పటికి సారాలేందే సానుకూలంగాని అసామీకి, అబ్బాయిజీతండబ్బుకి నిక్కచ్చిలో చిక్కుకుంటాడు. సినీమానాటకాలంటే చెవికోసుకుచేచాడకీ, మేష్టారి కష్టంతీర్చడానికి, ధాన్యం అమ్మాలంటే ధరపెరగాలి,—తన పిల్లకి జ్వరంవస్తే డాక్టరుఫీజు యివ్వడానికి వారంవర్జం లేదు, కాని మానసికవైద్యుడైన పంతులి అవసరం తీర్చడానికి, శుక్రవారం అడ్డుతగుల్తుంది—అసలు, ప్రపంచకంలో పేచీపూచీలేని బాకీ మేష్టారుజీతం. అడిగితే చిరాకు, అడక్కపోతే పరాకు. పిల్లవాడు మారాముచేస్తోంటే, రోజూ కానిడబ్బుఇస్తారుకాని మారాము లేకుండా బడికితీసుకెళ్ళి నాలుగుముక్కలు చెప్పిన పంతులికి నెలకుపావలా ఇవ్వలేరు. అది దేశ దౌర్భాగ్యం.

అని గొణుక్కుంటూ, తిరిగితిరిగి, అలసి, సొలసి, విసిగి, వేసారి, డస్సి కృస్సి—ఎక్కెగుమ్మం దిగే గుమ్మంతో, జీతంలేని శుష్కసమాధానంతో, చివర ముఖంపెట్టేడు వెంకట్రావు. కాని డబ్బు లభ్యం కాలేదు. తాను లేచిన వేళను దూషిస్తూ ప్రొద్దున్నే లేచిచూచినముఖాన్ని తిడుతూ, ఎదురైనశకునాన్ని కసిస్తూ—కాళ్లీడ్చుకుంటూ—పండబిగిస్తూ—తల వంచుకుని—దీనముఖంతో—హృదయోద్విగ్నముతో చేతులు నలుపుకుంటూ బుర్రగోక్కుంటూ, సొక్కుచు సోలుచు, నీల్గుచు, మూల్గుచు, ఇంటికివచ్చి, కుమార్తె జ్వరాన్నిగూర్చి ప్రశ్నించేడు. మందుసీసా ఎల్లాగ లేదు, పిల్లదానిజ్వరంఎల్లాతగ్గుతుందనే ఆలోచనలతో ఒకచోట చతికిలపడ్డాడు.

అతనిభార్య అతనిఅవస్థ గ్రహించింది. పొద్దున్నుంచి అతనుపడ్డశ్రమ ముఖంలో ప్రతిబింబించింది. ఆయిల్లాలు వెంటనే ఇంట్లోకి వెళ్ళింది. పెట్టెతీసింది వెదకింది ఖంగారుపడింది. మళ్లీ వెదికింది. ముఖం చిట్లిస్తూ భర్తదగ్గిఱకువచ్చి అంది నిమ్మళంగా:—

"నాగరం తేశారా?"

"ఆ తేశాను"

"అది తాకట్టుపెట్టి మందుసీసాకొనండి, గ్రాంటు వచ్చినతర్వాత విడిపించుకోవచ్చు."

"తాకట్టుపెట్టేను"

"త్వరగా భోజనంచెయ్యండి—మందు తేవచ్చు"

"ఆడబ్బువేరే ఖర్చయింది"

"పిల్లజబ్బుకంటే ప్రాణాపాయం ఏంవచ్చింది?"

వెంకట్రావు మాటుమాటాడలేకపోయేడు. చివరకు అన్నాడు.

"ఇన్స్పెక్టరుగారు రేపు బడిపరీక్షకువస్తారు"

"పిల్లకి ఇల్లావుంటే పరీక్షఎల్లా?—ముందునెల్లో రమ్మనకపోయేరూ?"

"నెలాఖరుకి ఆయనకు బదిలీఅవుతుందట. అంద

చేత ఇప్పుడే తొందరపెట్టేరు. కపురప్పితే ఇక వీలులేదట.''

"నాగరంమీద ఎన్నిరూపాయలు తెచ్చేరు?''

"ఇనస్పెక్టరుగారి మడుపు ఇరవై రూపాయలు తెచ్చేను, ఇచ్చేను''

"కొంతఇచ్చి మిగిలింది తరవాత ఇస్తాననక పోయేరూ?''

"కట్నం చేతిలో పడితేనేకాని కాలు కదప నన్నారు''

అయితే పిల్లగతిఎల్లా?''

లోకంలో ముడుపులున్నాయి. అమ్మాయికి ఆరోగ్యంగాఉంటే, వెంకటేశ్వరస్వామికి బాల తొడుగు ఇస్తానని, ముడుపుగడుతుంది ముసలమ్మ—అబ్బాయికి కళ్ళు శుభ్రంగావుంటే సుబ్రహ్మణ్యుడికి పువ్వులుపడగలు ఇస్తానని ముడుపుకడుతుందితల్లి—పరీక్షప్యాసయితే కోడల్ని తీసుకువచ్చి కుర్రవాడి చేత సత్యనారాయణవ్రతం చేయిస్తానని ముడుపు కడతాడు తండ్రి. కానిడబ్బుఅతుంతలు పసుపు గుడ్డలో.—అల్లుడికి రిజిస్ట్రారుఆఫీసులో ఉద్యోగం అయితే అయిదువందల కొబ్బరికాయలు ఆంజనేయు లికి కొడతానని అత్తగారు ముడుపుకడుతుంది.—ఇంకా మేకపోతులని, కోడిపెట్టలని గెటంజాతర, అంటూ అనేకముడుపు లున్నాయి. అనుకున్నపని సఫలంఅయితే, సావకాశంగా మీద జరిగించవలసిన ముడుపులివి. కార్యఫలం కాకపోతే కానిడబ్బు ఖర్చులేదు.

వెంకట్రావు సమర్పించిన ముడుపుసంగతి వేరు. స్కూలుపరీక్షచేసి, రిపోర్టుబాగా రాసి, ఎక్కువ గ్రాంటువచ్చేటట్లు చేయుటకు ఇన్‌స్పెక్టరుగారికి ముడుపుముందే ముట్టచెప్పాలి. పై అధికార్ల ఫరమానావల్ల గ్రాంటుతగ్గిస్తే గవ్వతిరిగిరాదు—కొత్తపెళ్ళి కొడుకు, కోరినదిఇస్తానంటే, అలకపాన్పు దిగుతాడు. ఇన్‌స్పెక్టరుదొరగారు కోరిందిఇస్తేనేగాని బడిపరీ క్షకు బయలుదేరడు—గోరుచుట్టుమీద రోకలిపో టులా, ఈముడుపుచెల్లించవలసివచ్చింది వెంకట్రా వుకి. "పిల్లగతిఎల్లా" అని భార్య అనేటప్పటికి ఒక వేడినిట్టూర్పు విడిచేడు. అంతలో అతనిమనస్సుకి ఒక ఊహతట్టింది. వెంటనే వచ్చి, డాక్టరుఇచ్చిన చీటీ తీసుకుని బయలుదేరేడు. "పన్నెండుగంట లయింది. భోజనంచేసి వెళ్ళండి. మందులేకపోతే మరి రెండురోజులు తీసుకుంటారు. కాని ప్రాణ భయంరాదు" అని చెప్పిన భార్య చల్లనిమాటలు అతని హృదయతాపంలో హరించి వినిపించలేదు.

వెంకట్రావు తిన్నగా ఇన్‌స్పెక్టరుగారిఇంటికి వెళ్ళేడు. పడకకుర్చీలో ఇన్‌స్పెక్టరుగారుపడున్నారు. ఇంట్లో ఉపాధ్యాయుడు, బైటఉపాధ్యాయుడు, అరుగుమీద, చెట్టుక్రింద, ఇన్‌స్పెక్టరుగారి ఇంటి ముందు ఎక్కడచూచిన ఉపాధ్యాయుడే. ఖద్దరుబట్ట ఒకవిధంగా నీరుకావిపట్టినది కట్టుకొని, అట్టిదే చొక్కాతో, తలపాగతో, అకుచెప్పులతో, మాసిన తలతో, నీరసముతో, చేతిలో పండ్లబుట్టలవారు, పూలదుత్తెలవారు, కూరగంపలవారు, నేతిముంతలు, పెరుగుగిన్నెలు, పొగాకుకట్ట, అనపకాయ, ప్రాను అద్దము, ముంచాకు, పడకకుర్చీ, పాముకోళ్లు మొద లగు రంగంసరుకులు పుచ్చుకొని, దేవతాదర్శన మునకై వేచియున్న యాత్రికులవలె, భోజనముచేసిన వారుకొందరు, చేయనివారుకొందరు, వృద్ధులు, మధ్యములు, యువకులు గాగల ఉపాధ్యాయులు వేచి యున్నారు.

వెంకట్రావు వెళ్ళేటప్పటికి ఇన్‌స్పెక్టరుగారొక ఉపాధ్యాయునితో ముచ్చటిస్తున్నారు. ఆ ప్రసంగా నంతరం, కొంతసేపటికి, వెంకట్రావు లోపలికివెళ్ళి నమస్కరించి, అనుజ్ఞాతుడై క్రిందచాపలో చతికిల పడ్డాడు, ఉస్సురని. ఆగదిలో కుర్చీలులేవు. ఒక బల్లమాత్రంఉంది. దానిమీద కూర్చోడానికి ఉపా ధ్యాయునికి తాహతులేదు. ఉపాధ్యాయుడు కూర్చో వలసినచోటు ఇన్‌స్పెక్టరుగారు పడకకుర్చీలో కూర్చుంటే, వారికాళ్లక్రింద ఈతాకులచాపలో, లేకపోతే నేలపంచాగతి,- ఉపాధ్యాయులు తాబే దార్లగా... కూర్చుని వెంకట్రావుఅన్నాడు.

"అయ్యా! ఇన్‌స్పెక్టరుగారూ! అపాయంవచ్చిం ది రక్షించాలె"

"ఏమి? నాయనా! చెప్పు; నాసాధ్యం అయినంత వరకు సహాయం చేస్తా. మీకు కన్నతల్లిలా నేను

ఉన్నానుకా, కష్టసుఖాలు నాతో చెప్పండి సహాయం చేస్తాను."

"మాసెలవిమాలేదండీ, మీకుస్వల్పం. మాఅమ్మాయికి జ్వరంవచ్చింది, మహాప్రళయంగాఉంది నాభార్య నాగరం తాకట్టుపెట్టి మీకుఇరవై..."

"సరే. ఇప్పుడు నన్నేమిచెయ్యమంటావు"

"ఇవ్వాళ ఎక్కడతిరిగినా కాని డబ్బుదొరక లేదండి, పిల్లకి మందుసీసా అర్జంటుగా కొనాలండి, పరీక్ష వాల్లురోజులుపోయేకా చేద్దురుగాని. ఆ సొమ్ము ఇప్పించాలి."

ఆర్బే. నువ్వుఇవ్వగానే పిల్లకి నాగరంచెయ్య మని కంసాలికి ఇచ్చేశాను. అంతతొందరగాఉంటే మొదటే మానివేయకపోయావు?"

"పోనీ మీ స్వంతంలోంచి ఒకరూపాయఇవ్వండి. మీ పేరు చెప్పుకు మందుతెచ్చుకుని, మీకు తిరిగి రెండురోజులలో ఇస్తాను"

"లేదునాయనా! నెలాఖరులో మాదగ్గరరాగి డబ్బుండదు. రేపటిఖర్చు ఎల్లాగా అని నేనే తహ తహలాడుతున్నాను."

"మరి గత్యంతరం ఏమిటంటారు?"

"మీకులోటేమిటి! మీకు ఎక్కడైనా దొరుకు తుంది"

"లేదండి. ఇవ్వాళ అగ్గి పుట్టటంలేదు. పోనీ ఒక్కఉపకారం చెయ్యండి. మీ పేర చీటివ్రాసి ఇవ్వండి. షాపులోకివెళ్ళి అరువు తెచ్చుకుని, రేపు ఇచ్చేస్తాను"

"ఏమిటి! నీకోసం, నేను సిగ్గువిడిచి, అభిమానంలేక, అరువుచీటి వ్రాసియిచ్చేదా, చాలు; బాగుంది! కొంచంసేపుంటే నాభార్య మెళ్లో వస్తువు తాకట్టు పెట్టికూడా డబ్బుఇమ్మంటావు. సరసంగాఉంది, చనువిచ్చినందుకు!! ఇక వెళ్ళు చాలమందిఉన్నారు."

హతభాగ్యుడై వెంకట్రావు బయటికివచ్చేడు. "నెలకు రెండువందల ఏభైరూపాయల జీతగాడు ఎట్టిబీదతనం వెల్లడిచేశేడు! బడిపరీక్షకని ఇరవై రూపాయలు గుంజుకొని, ప్రాణావసరమంటే, ఒక్క రూపాయ అప్పుగా సర్దుబాటు చెయ్యలేకపోయేడు. ఏమిమానవధర్మం! ఏమిభూతదయ! పండుక్కని, పర్వానికని, వ్రతాలకని, ఘృతానికని;— పిల్లపుట్టిన రోజని, తల్లిచచ్చినరోజని, అమ్మగారు కడుపుతోం దని, అల్లుడువస్తాడని, బొమ్మలపెళ్ళని, మాదగ్గర సహస్రవిధాల గుంజుకొని, షాపులోకి చీటివ్రాసి ఇవ్వమంటే పౌరుషం వచ్చింది! మా అమ్మాయి ప్రాణంకంటె తన పిల్లనాగరం ఎక్కువఅయిందా? చల్లనిమాటలతో సవతితల్లిప్రేమ చూపిస్తూ క్రియాశూన్యుడై, విద్యావంతుడై సాటిమానవునికి ఆపదలో సాయంచేయకపోతే సామాన్యప్రజలమాట చెప్ప వలెనా!!!"

అని; అనుకుంటూ, ప్రొద్దున్న కనుపించని తండ్రు లఇంటికివెళ్ళేడు. కాని ప్రయోజనం లేకపోయింది. షాపులోకివెళ్ళి అరువు అడుగుదామనుకొన్నాడు. ఊరుపేరులేని ఉపాధ్యాయుడికి అరువుఇచ్చేవా డెవరు? ఇక తిరిగిన లాభంలేదనుకొని, భగవంతుడి మీద భారంవేసి తిన్నగా ఇంటికివచ్చేడు. ఇంటి గుమ్మంలో కాలుపెట్టేటప్పటికి రెండు అశ్రుబిందువులు వంటిమీదపడి భగ్గుమంది. టంగుటంగున ఆరు గంటలుకొట్టేరు. "అయ్యో ఎంతసేపైంది ఇల్లువిడిచి! ఎల్లాఉందో" అని గుండెఝల్లుమంది. తలుపుతీసి ఇం ట్లోకివెళ్ళేడు. మంచంమీదపిల్లలేదు. వాకిట్లోకి వెళ్ళేడు. తనకళ్ళని తాను నమ్మలేకపోయేడు. తన అమ్మణ్ణి, వాకిట్లో తులసిచెట్టుక్రింద పడకకుర్చీలో పడుకుని "అమ్మా నాన్నవచ్చేడే" అంది.

"ఎల్లావుందిపిల్లకు," అన్నాడు వెంకట్రావు.

"జ్వరం దిగజారింది."

"ఎల్లాతగ్గింది"

"మీరువెళ్ళిన కొంచంసేపటికి పిల్ల దాహంఅని ఏడ్చింది. తులసిఆకు రసంతీసియిచ్చేను. ఆపళంగా నిద్రపోయింది. మూడుగంటలకు లేచింది. ఒకవిరే చనంఅయింది. వంటినిండా ముచ్చెమటలుపోసేయి. కొంచంసేపటికి ఆకలి అవుతోందని, గిలగిల్లాడిపో యింది. ఆయింటివారి ముసలమ్మవచ్చిచూసి, జావ యిమ్మంది. కాస్తజావఇచ్చి, నిద్రపోకుండా ఇక్కడ కూర్చున్నాను. ఇంతమంది పిల్లలకు చదువుచెప్పి వృద్ధిలోకి తీసుకవస్తోంటే ఒక్కళ్లూ సహాయంచెయ్య లేకపోయారా?—కృతఘ్నులు!"

"నాన్నా! ఆపిల్లల్ని ఏమీఅనకండి. వాళ్లుమంచి వాళ్ళే" "దిక్కులేనివారికి దేవుడేదిక్కునుమీ!! ఈ తులసిలోఉన్న విష్ణుడే మన పిల్లని రక్షించేడు"— అన్నాడు వెంకట్రావు అమ్మణ్ణిని అక్కునచేరుస్తూ, ముద్దుపెట్టుకొని.

# ప్రతిబింబము

సంతుల విశ్వనాథముగారు

మందిర ప్రాంగణమున నుద్యానవన మున్నది. కొలఁదిదూరమున పుష్కరిణీతీరమున శిలాఫలకముపై నొకబాలికకూర్చుండెను. అంతటను సూర్యకాంతి తేజరిల్లుచున్నది. ఆమనోజ్ఞకాంతివలన నాతటాకసలిలంబులు రుచిరతేజోవిలసితములై యుండెను. అకస్మికముగ నాబాలికామణి తరళనయనము లొక్కసారి నిర్మలసలిలగతమైన తన ప్రతిబింబముపైఁ బ్రసరింపఁజేసెను. ఆప్రతిబింబమందలి తనమనోజ్ఞసౌందర్యము తన్మయహృదయముతోఁ దిలకించి వేఱొకబాలికయని భావించి ప్రేమపూర్వకముగ నీరంబుల తొంగిచూచి యాబాలికతో కలిసి యాడుకొనఁదలచి యాతటాకజలంబుల దిగుచుండెను. ఆప్రతిబింబము గూడ మెల్లన కదలిపోవుట గాంచి యవ్యక్తమధురకంఠస్వరమున నిట్లనియెను. "బాలికా! నేను నిన్ను సమీపింపఁదలచుకొలఁది నీవు దూరమగుచుంటివి. పోనిమ్ము—యిచ్చటనుండియే నిన్ను చూచుచుండెదను." అని యాబాలిక తిరిగి తన శిలాఫలకముపై నాసీనయై స్వస్వరూపమును దదేకదృష్టి నీక్షించుచు హృదయానందముద్రితముగ జేయుచుండెను. సూర్యుఁడ స్తమించెను. విశ్వప్రపంచమంతట చీకటి క్రమక్రమముగ వ్యాపించుచుండెను. నీలజలసమంచితమగు నాపుష్కరిణియందిక నాబాలికామూర్తి మనోమోహనకరమగు ప్రతిబింబమగుపడుట లేదు. బాలిక సంశయదృష్టులతో తటాకజలములవంక దిలకించుచు విచారహృదయముతో "బాలికా! నిన్నత్యంతానురాగమున చూచుచున్న నన్ను నీవేల మోసము చేసి నాకగపడుట మానినావు? ఎట్లైన నిన్ను వెదకి పట్టుకొనెదను." అని యాదివ్యప్రేమమూర్తియగు బాలికయు నిబిడాంధకారబంధురమగు విశ్వధాత్రిని "బాలికా!" యను వజ్రస్తంభిత తీక్ష్ణకంఠస్వరముతో ననంతవినీలాకాశమ్మునందు ప్రతిధ్వనింపఁజేసి యదృశ్యయయ్యెను.

# పెద్దక్కాయి

బొడ్డు బాపిరాజుగారు

౧

ఏమహనీయపుణ్యఫలమిచ్చి పరాత్పరుఁ దృప్తుఁ జేయుచున్
గోమలమూర్తి,నిన్ పిలిచికొంటిమొ కోరికదీర; విశ్వశో
భామలమైన నీదుహృదయమ్మునఁ జిందు సుధాకణంబులే
మామక దేహవృద్ధి కసమానములై చిలికించు మాధురుల్.

౨

వగపనుమాటయే మదికిఁ బట్టనిరోజులలోన దేవుఁడే
పగయయి మాతృదేవత నపారదయానిధిఁ గంటికింపుగా
నగపడకుండఁ జేసె, బ్రదుకంతయు శూన్యముగాఁగ గుండెలో
రగులు దురంతవేదనభరంబు——అణువేని శమింపదింతకున్.

౩

అది,మునుజేసినట్టి యఘమై యనుభూతికివచ్చె; బాల్యమున్
వదలనిముద్దరాలి నిను వంచనఁబుచ్చి యనూహ్యభూమికిన్
గదలెను నింకఁజన్వసమునన్ బ్రియుఁడు;——ఆదినమాదిగా మమున్
సదమలవృత్తివై జననిచాడ్పునఁ బెంచితి తమ్ముగుజ్జలన్.

౪

అతిసుకుమారమైనహృదయంబున వేడిసెగల్ వెలార్చి యు
ద్ధృతమగు వేదనానిల ముదీర్ణత లోఁదిగ్రమింగి,నిత్యసం
స్తుతగతి దేహయాత్రఁ బరిశుద్ధముగాఁ గయిసేసి మాయెడం
గుతుకమునిండ సేమమొనఁగూర్చు తలంపులఁ బుత్తు కాలమున్.

౫

"అరయన్ భారమునీదిగా"యనుచుఁ గొండంతాశతో నుండి తన్
దరిఁజేర్పంగలవాఁడ వెన్నటికినై నన్ 'నీవె'యన్ ధైర్యమే
స్థిరమైయుండెను; నిష్కళంకయగు నా దేవీసమానన్ సదా
గురుదృష్టింగని-రక్షసేయఁదగునీకున్ రాజరాజేశ్వరా!

# క్రొత్తగాజులు

శ్రీమతి లీలాసరోజినిగారు

బిహారీలాల్ సేనుఁడు సద్వంశసంభూతుఁడు కులీను డగుటచే స్వాతంత్ర్యకాంక్ష గలవాడు. అతని పూర్వీకు లదృష్టవంతులు. వారు మంచిదినములను జూచి యుండిరి. కొన్ని పరిస్థితులవల్ల సేనుమాత్రము గుమాస్తాపని కొప్పుకొనవలసి వచ్చినది. అతనిగొప్ప పుట్టుకకును తెలివి తేటలకును, ఇట్టిపని కొడంబడుట యవమానకరమే కాని ఏమిచేయగలడు? అతడీ యవమానము సహింపలేకపోవుటచే జీవితమే భారముగ నుండెడిది. అతని కొకకోరికమాత్ర ముండెను. తనపుత్రుఁడగు నళినీకాంతుని తనవంశీయుల కర్హమగు గొప్ప స్థితిలోనికి తేవలెనని. ఈయూహతో నళినుని ఇంగ్లండునకు దేశములోనికెల్ల నుత్కృష్టమును గౌరవనీయమునగు ఐ.సి.యస్. పరీక్షచదువుటకు బంపెను. కాని ఈకార్యమునకు ధనమెక్కువకావలెను.

అతఁడీదివరకు దాచికొనిన దంతయు కొడుకు విద్యాభ్యాసమునకు వినియోగింపబడెను. ఇంకను అతనికి వేయిరూప్యములు బంపవలెను. నళిన్ కృతార్థుడైన తండ్రిపడిన శ్రమకు అనుభవించినఆందోళనకు ప్రతిఫలము లభింపగలదు. అట్లుకానిచో నేమున్నది? విధినిర్ణీతములకు ఆయనతలనొగ్గవలసినదే. పాపమాయన కొన్నిదినములనుండియు అప్పులిప్పించుటయందు సాయము జేయుడని తనస్నేహితులయిండ్లకు దిరిగి యడుగుచుండెను. ఏకోవిధమున అయిదువందల రూప్యములు మాత్రము ప్రోగుచేయగలిగినాడు. కాని మిగిలిన దెచట లభించునో యాతనికే తెలియదు. అదియే పెద్దసమస్య! దీనికి సమాధానమతనికి లభింపలేదు. వారియిల్లు, నగలుగూడ ఇదివరకే వినియమము చేయబడినవి. సేను నిరాశాపూరిత హృదయముతో ఇంటికి వచ్చునప్పటికి చీకటిపడెను. అతనియిల్లా లాతురతతో నాతనికై నిరీక్షించుచు యాతనిజూచి "మన హేమదుర్బలత ఇంకను తగ్గలేదు. ఒకవైద్యుని పిలువవలదా?" యనెను.

పాపము! వైద్యుని పిలుచుటకు ధనమైనను లేదు. కొంతతడవాలోచించి సేనిట్లనెను. "కొంచెము కషాయమిమ్ము. కొద్దిగా జ్వరము తగిలినది. వైద్యుని పిలువనవసరము లేదు," పాపమామె భర్తృహృదయ మందేముండెనో గ్రహించినది. ఒక్కనిట్టూర్పువిడిచి ఆవిషయ మిక ప్రస్తావించలేదు. "మాణిక్ వద్దనుండి నాకీదినమొక జాబువచ్చినది." అనుచుచీర చెఱగుముడి విప్పి ఒకయుత్తరము భర్తకందిచ్చెను. అందిట్లుండెను.

అక్కగారికి నమస్కారములు;

మీకు పెద్దతనమున కొంతబాధ నబ్బినట్లున్నది. మీయొద్ద తగిన ధనములేక యితరులపై నాధారపడి యున్నతేడ మీపుత్రుని నింగ్లండుకేల యంపితిరో నా కర్థమగుటలేదు. నేను వానికుటుంబమును పోషింపవలెను. మీకేవిధమగు సాయముచేయజాలనని చెప్పుచున్నాను. ఏమైన నేమి! మాబావగారు తనధనము వెచ్చించి నాకు విద్యచెప్పించుటచే నాతనిఋణము దీర్చుటకు నేను బాధ్యుఁడను కనుక నే నీరెండువందలు పంపుచున్నాను. ఇంతకన్న నధికముగ నొసగుటకు నాకిష్టముగాని, శక్తిగాని, బాధ్యతగాని లేదు. కావున అమదినము నన్ను డబ్బుకై బాధ పెట్టవలదని కోరుచున్నాను.

సేనుభార్యకు మాణిక్ కనిష్ఠసోదరుఁడు. సేనాతని తనపుత్రునివలె పెంచి చదువు చెప్పించి వివాహము జేసెను. అతడు సంపాదన మొదలుపెట్టి గూడ కొలది వత్సరములైనది. సేని నిర్దాక్షిణ్యపూరితమగు లేఖను జూచి నిలువున నీరైనాడు. తానంత సాయము చేసిన వానియొద్దనుండియా ఇట్టి కృతఘ్నత! ఎంతటి యవమానము! తనకు మాత్రమే గాదు! తన యర్ధాంగికి గూడ! ఇట్టి యవమానముల నెందఱికడనుండియో సే నీవఱ కనుభవించెను. ముందనుభవించుటకు గూడ సంసిద్ధుడై యుండెను. కాని తన ప్రేమపాత్రుడగు పుత్రసమానుడగు మాణిక్ వలని యవమానమును ప్రశాంతముగ ననుభవింపలేక పోయెను. "డబ్బు తిరిగి పంపివేయుము. నాకది యవసరము లే" దని యభిమానముతో నుడివెను. అతని భార్య యాతని నీకార్యమునుండి విముఖుని జేసెను. ఆమె శాంతముతో "ఇట్టి చిన్న విషయముకొఱకై మన కుమారుని భవిష్యత్తునెల్ల పాడు చేయుదుమా! వాని నెంతవఱకో పోషించినాము. తుదివఱకు పోషింపవలదా! మాణిక్ కఠినముగ మాటలాడవచ్చును. కాలము తప్పి వచ్చినప్పుడు ఓర్పు వహించుట యుక్తము" భార్య నుడివినది సత్యమని తెలిసి యాతడొప్పుకొనెను. ఆమెయొక్క ఆశాపూరితప్రవర్తన మాతని కానందము గొల్పెను.

"నళినా, కృతార్థుడైన ఈశ్వరునికి వందనములు. మన కష్టములు గట్టెక్కినవి. స్థైర్యముతో నింక కొంతకాల మోర్చుకొనుడు" అని యాయిల్లాలు నుడివెను.

నిరాశాంధకారముతో నిండిన హృదయమునకు ఇదియొక యాశాకిరణము. కాని యాతనికి భవిష్యత్తు తిమిరావృతముగ తోచెను. చివఱ కాతనిభవ్యవాక్యములకు దేవతలు తథాస్తు వాక్యములు బల్కిరి.

కొన్నిదినములకు నళినా ఉత్తీర్ణుడైన శుభవార్త వచ్చెను. చాలకాలమునుండి ఆగృహము నావరించియుండిన దుఃఖము ఆనందమునకు దావొసంగెను. ఈ వార్త విని సంతసముతోను, గర్వముతోను నేను హృదయము ముప్పొంగిపోయెను. ఇక నాతని భార్య విషయము జెప్పవలెనా? ఆమె యాతృణమందు గల్గిన యుద్వేగముతో వ్యాధిగ్రస్తయగు తనయ గదిలోనికేగి "హేమా! మీయన్నయ్య కృతార్థుడైనాడు" అనెను.

పాపము! హేమప్రభ పదమూడువత్సరముల బాలిక. తల్లి వచ్చినప్పటి కామె స్మృతిలేక శయ్యపై బడియుండెను. కొంతతడవునకు తెలివి దెచ్చుకొని చలించుచున్న చూపుల తల్లివైపు నిలిపి ముఖము వికసింప "అమ్మా! అన్నయ్య ఇంటి కెప్పుడువచ్చును?" అని హీనస్వరముతో నడిగెను. "త్వరలోనే" యని తల్లి భయముతో ప్రత్యుత్తర మిచ్చెను. "అమ్మ అతని నేను చూడగలనా?" ఆహా! ఆపిల్లకంఠ మెంతి దుఃఖపూరితమై యుండెను. తల్లి ఆనందమువలన కల్గిన తడబాటులో బిడ్డ వ్యాధివిషయము మఱచెను. కాని ఆపిల్లయొక్క వాక్యములు ఆమెకీ విషయమును స్ఫురణకు దెచ్చెను. "తల్లీ! ఏల ఇట్టి దుశ్శకునములు పలికెదవు! ఈశ్వరేచ్ఛ యున్న నీవు నీయన్నను తప్పక చూతువు" అని పల్కుచు హేమప్రభ తల నిమిరెను. ఆమె అనుదినము పుత్రికకు స్వాస్థ్య మొసంగు మని పరమేశ్వరుని ప్రార్థించెడిది. ఈమారా తల్లి ప్రార్థనలకు సమాధానము రాలేదు, చిట్టి హేమప్రభ తన యన్నను చూడనేలేదు. నళినా ఉత్తీర్ణుడైనాడను శుభవార్త వచ్చి చాల దినములు గాక పూర్వమే హేమప్రభ జీవితము పరిసమాప్తి నొందినది. ఆనందపారావారములో హాలాహలమువలె నీ దుఃఖము వారిని దహించివైచినది. తల్లి మంచము పట్టినది. భగవాను డామె కిరువురు బిడ్డలనిచ్చినాడు. అందొకరిని దనయొద్దకు పిలుచుకొనినాడు. ఇక మిగిలిన దొక్కడే! ఆమె కొడుకు, ఆమె ఆశాపుంజము, ఆమె భవిష్యత్ జీవితనౌకాకర్ణధారుడు. పుత్రికావియోగ విదళితయై యామె పుత్రాగమనదినమునకై నిరీక్షించుచుండెను. అతని వివాహవిషయమై యాలోచింపసాగెను. తన కొమారుడు ఒక సంసారి యైనపిదప మనుమల ముద్దు గాను చనిపోవుదు ననుకొనెను.

ఆమె మిత్రు లామె నోదార్చుటకు ఆమెతో కలిసి యేడ్చుటకు వచ్చుచుండిరి. దుఃఖసమయమందు స్నేహితులతో తెంచిన తమ విషాదగాథల నుడువుచు గొంత శాంతిని పొందుట మానవసహజము. అట్లే ఆమె యనుదినము వారితో తన దుఃఖ గాథను నుడువుచుండెడిది. ఆమె నోదార్చుటకు వచ్చు వారిలో భామిని, ఆమెతల్లిగూడ నుండిరి. హేమప్రభ జీవించియున్నపు డామె చెలిమికత్తె భామిని. సమవయస్కులగు నీబాలిక లిద్దఱు ఒకరినొకరు విడబాయకుండెడివారు. భామినిని జూడగనే హేమప్రభతల్లిదుఃఖము పొంగి, అగ్రస్థాన మాక్రమించెను. ఆమె భామినిని కౌగలించుకొని బిగ్గరగా నేడ్చుచు "అయ్యో బిడ్డా! నీవెవరిని జూచుటకై వచ్చితివో, ఆమె మనల విడనాడి చనినది. ఆమెనిక నెన్నటికిని జూడజాలము కదా!" అని విలపించెను. భామిని గూడ ఏడ్వ మొదలిడెను. హేమతల్లి భామినిని తన యక్కున జేర్చుకొని "చిట్టి తల్లీ! నన్ను గట్టిగ కౌగలించుకొమ్మ. ఈవిషాదములో నీవే నా యోదార్పువు. నిన్ను మా నళినికి పెండ్లి చేసికొనెదను" అనెను.

చాలకాలమునుండి ఈతల్లు లిరువురు స్నేహితురాండ్రు. ఒకరినొకరు "వదినా" యని పిలుచుకొనుచుండెడి వారు. నేటివఱకు వారి కీవరుస కేవలము ప్రేమాతిశయమునే వెల్లడించుచుండెడిది. ఇకముందది సార్థకము కానున్నట్లు వారికి తోచెను. భామిని తల్లిదండ్రులు అల్లునికై వెదకుచుండిరి. కాని వారికి నచ్చిన వరుడు లభింపక పోవుటచే భామిని యింతవరకవివాహితగా నుండవలసివచ్చెను. నేను భార్య తనంతట దానే భామినిని కోడలిగా చేసికొందునన భామినితలిదండ్రుల యానందమునకు మేర యుండునా? వారు సంతసముతో నొప్పుకొనిరి. అయితే నేనుకు మాత్ర మీవిషయమై సందేహము లుండెను,

"నీ పల్కు లెవరికో అకే..."



జుబేదా కన్య

[సుతా సాగర్ మూవీటోనువారి "జరీనా" అను హిందీటాకీ ఫిల్ములో నాయకురాలి పాత్రను ధరించినది.]





డి కె న్స క న్య

ఒక సుప్రసిద్ధమగు యూరోపీయ నాట్యాంగన.
ప్రస్తుతము మద్రాసుకు వచ్చియున్నది.





నృత్యము
సేయుచున్న
నైన్ షాజాడీ

కాన నాతడు పుత్రుని భవిష్యత్తునుగూర్చి తా మేదియు స్వతంత్రించి చేయుట తగదని భార్యతో ముచ్చటించెను. కాని యామాటలు నిష్ప్రయోజనము లాయెను. తన ప్రియ కుమారుడు వినయాన్వితుండని మాతాపితరుల యాజ్ఞ నుల్లంఘింపడని, ప్రథమ దర్శనమునందే భామినియెడ నాతని కనురాగ ముదయించుననని యామె యూహ.

సామాన్యముగ వివాహ విషయములో ఇంటి యజమానికే యేవిధమగు నధికారముండదు. సమ్మతి నొసగుట మాత్రమే యాతని పని. కాన సేను తన భార్యయూహతో నేకీభవించెను. అది దుఃఖసమయము. సేను తన మనస్తాపమునుబట్టి ఆమె యెంత బాధ పడుచుండెనో యూహించుకొనగలిగెను. అందుచే నామెయిచ్ఛకు వ్యతిరేకముగ బోయి యామె నింకను బాధించు టాతని కిష్టము లేక పోయెను.

వివాహ మింకను కాలేదు. కాని భామినికి కోడలితన మప్పుడే వచ్చినది. భామిని, ఆమె తల్లి అనేకమార్లు సేనుగారింటికి ఆహ్వానింప బడెడివారు. భామినిని తల్లితో నెడలిపోనీయక, నళినితల్లి తన యొద్ద కొన్ని దినము లుంచుకొనెడిది. భామిని సన్నిధిని ఆతల్లి హేమప్రభమరణమును, కొడుకు వియోగమును మఱచియుండెడిది. భామినిని తన ప్రేమాస్పదము జేసెను. భామిని తన సమీపమందు లేనప్పుడు ఆమె రాబోవువిషయములగూర్చి యాలోచింపకుండ నుండలేక పోయెడిది. గాజులవాడు, చీరలమ్మ నామె, జలతారుగిన్నెలవాడు, వారి యింటికి వచ్చి ఆశాభంగముతో పోలేదు. వింతవస్తువులను గాంచినప్పుడెల్ల భామినికై వానిని కొన ప్రయత్నించెడిది. ఒక చీర, ఒక నగ, ఒక కంచుకము; వింతగ గాన్పించిన "ఆహా! ఇది మా భామిని కెంత బాగుండును?" అను మాట లామె నోటినుండి వెడలుచుండెడివి. ఆమె భర్త యీ వ్యయము నెదుర్కొనలేక పోయెడివాడు. ఒక దిన మామె స్నేహితురాలొకర్తుక తన కూతుతో వీరింటికి వచ్చెను. ఆపిల్ల కురులు చక్కగ నలంకరింపబడి యుండెను. అది గాంచి భామిని తల్లి "అక్కా! నీవు రేపు మీ అమ్మాయితో నిటకు రావలెనుమా! భామినియు నేపిచట నుండును. ఆమె నీలాలకముల నీవిధముగ నలంకరించుటకు నాకు నేర్పవలె. మానలిన్ ఇంగ్లండునుండి దిగుచున్నాడు. మాతోడలిని క్రొత్తక్రొత్త విధములుగ నలంకరింప వలదా?"

నలిన్ నియమిత దినమునందే వచ్చెను. కాని ఈ లోపల దిన మొక విధమున భామిని నలంకరించుట యామె సంతృప్తి కొఱకే. భామిని యింటలేనపుడు తాంబూలములో సుగంధద్రవ్యములు వాడబడెడివి కావు. శుచికరమగు పదార్థము లేవియు నింటికి దీసికొని రాకూడదు. ఒకవేళ పరిచారిక ఆపతిని లక్ష్యము చేయక నేమైన దెచ్చిన వెంటనే భామిని యింటికొక యాహ్వానముతో పరుగెత్తవలసినదే. ఇట్టి దయార్ద్రహృదయగు అత్తగారు లభించుననని భామినితల్లి యానందించుచుండెడిది. అట్టికత్తె పుత్రికను పంపకుండ నెట్లుండగలదు? దయాప్రేమలచేత నెవరి హృదయములు వశీకృతములు గావు? భామినికి గూడ తనకు కాబోవునత్తగారింటికి వెళ్లుటకు పంత మే! ఆమె యాయింటిని తన స్వగృహముగనే భావించుచుండెడిది. ఆమె లోక మెఱుంగని పసిపాప గాదు. భామిని కిపుడు పదునైదు సంవత్సరములు. హేమప్రభ గతించి రెండేండ్లు కడచెను. భామినీ హేమప్రభల నెచ్చెలు లందరు వివాహితలైరి. వారు తమ ప్రియులగూర్చి ముచ్చటించునపుడు తమ వలపుకథల నొండొరులతో చెప్పుకొనునపుడు భామినిభావములు నలిన్ యొద్దకు పరుగెత్తెడివి. నవలలలో కాముకీకాముకుల గూర్చి చదువునప్పుడు తన జీవితమే చదువుచున్నట్లామెకు దోచెడిది. తాను చిన్నపిల్లగానున్నపుడు నలిన్ ఇచటనుండెడివాడు. ఆమె వారింటికి వేగినపు డెంతో దయతో బొమ్మల చూపుచుండెడివాడు. ఒక దిన మొక గులాబీపూవు దెచ్చి తనసిగలో తురిమినాడు. ఇంకొకమారు యువరాజు వచ్చినపుడు, నలి నెంతో ప్రేమతో యుత్సాహముతో భామినికి యుత్సవమును చూపెను. ఆమె ఈవిషయము లన్నిటిని స్మరణకు దెచ్చుకొనినపుడు ఆమె హృదయ మవ్యక్తానందముతో నిండి పోయెడిది. దీనికి తోడింకొక యూహ సిగ్గుతో ఆమె హృదయమున బ్రవేశించెడిది. ఈ నలిన్ తన జీవితేశ్వరుడు కానున్నాడు. అతనియొద్ద కేగు టెట్లు? అత డీమెను పూర్వమువలెనే యాదరించునా? నలిన్ ఆగమనము నాతురతతో నిరీక్షించుచుండెడిది. నిరీక్షణలో గూడ యానంద మున్నది కదా!

చివరకు దినములు లెక్కపెట్టుట పూర్తియైనది. సివిలు సర్వీసు పరీక్షానంతరము జరుపుట కేర్పడిన రెండు సంవత్సరములు పరిసమాప్తినొందినవి. ఈదినము నలిన్ ఇంటికివచ్చుచున్నాడు. పుత్రునాహ్వానించుటకు సేను ఓడరేవుద్దకేగెను. అతనిభార్య భామిని నలంకరించి పిండివంటలు చేయుటకు తీరుబడిలేక యింటిలోనున్నది. భామినిమాత్రము నిలువుటద్దముకడ నిలువబడి తన వేణి యెట్లమర్చబడినదో చూచుకొనుచుండెను. ఇప్పుడామెహృదయమున నేమియూహలు పరుగులిడుచున్నవో యెవరికెఱుక ! కాలిచప్పుడు వినబడినట్లు తోచగనే ఆమెహృదయము కొట్టుకొనుచున్నది. ఆమె ఇటునటు భయకంపితయై యేలచూచుచున్నది. ఒకపరి యామె ఉలికిపడి కిటికీలోనుండిచూచి తన భయమకారణమని తెలిసికొనుచుండెడిది. నెమ్మదిగ తలను గవాక్షమునకానిచ్చి ముందున్న ప్రకృతిని చూచుటకారంభించినది. ముందు రమ్యమగుతోట అస్తంగతుడగుచున్న దినకరుని కిరణములుబడుటచే చెట్లు మెఱిసిపోవుచున్నవి. మనోజ్ఞమగు లేబచ్చికబిగురు జొంపములు సాయంసమయపు పిల్లగాలులకు కదలుచున్నవి. సూర్యరశ్మి యానందముతో చలించుచున్నట్లు మందమారుతము సంతసముతో నిండినట్లామెకుతోచెను. హఠాత్తుగ రామప్రసాద్, భామినియన్న – వచ్చి యామెనుపిల్చెను. "భామినీ! నలిన్ వచ్చినాడు; నీవిచట యేమిచేయుచున్నావు? క్రిందికి రమ్మా!" ఆమె నుదురంతయు ఘర్మబిందువులతో నిండిపోయినది. ఆమె కదలలేకపోయినది. రామప్రసాదామెను సమీపించి చిఱునవ్వు నవ్వెను. సిగ్గుతో నామెముఖ మెఱ్ఱబడెను. తన యలంకారమును జూచి యన్న హాస్యమొనర్చుచున్నాడని యామె గ్రహించి చేతులతో ముఖము కప్పుకొనెను. రామప్రసాద్ దయతో "సోదరీ, రమ్మా" అనుచు చేయిపట్టుకొని క్రిందిగదిలోనికి దీసికొనిపోయెను.

నలిన్‌తల్లి ఆమెను చూచినతోడనే గర్వముతో "నలిన్! నీవీమె నెఱుగుదువా? నీవు వెడలినపుడీమె చిన్నపిల్ల. చూడు మిప్పుడెట్లున్నదో!" నలిన్ కామె యెవరో జ్ఞాపకములేదు. ఆమెవైపు చూచి "ఆమె యెవ్వ"రన రామప్రసాద్ సమాధానమిచ్చినాడు. నలిన్ ఇప్పుడామెను గుర్తుపట్టి ఆమెను సమీపించి పాశ్చాత్యాచారానుసారముగా తన చేతిని చాపి "Hullo Bhamini! How you have grown up! How do you do?" అనెను. భామిని కాంగ్లభాషాజ్ఞానము చాలకొద్ది. నలిన్‌ను వివాహమాడుదువని తెలిసినప్పటినుండియు ఆంగ్లభాష నేర్చుకొనవలెనని యుత్సాహమున్నను వీలులేదు. కాని ఆమెకు చెప్పువారెవరు? ఆమె మిక్కుటమగు కోర్కె, యుత్సాహము, రామప్రసాదును ఈరెండుసంవత్సరములలో మొదటిపుస్తకమునైనను చెప్పునట్లు చేయలేకపోయినవి. నలిన్, తనకాంగ్లమురాదు గనుక గేలిచేయుచున్నాడనుకొని లజ్జావివశయై కోపమంతయు అన్నపై త్రిప్పెను. సిగ్గువిడనాటు ఆమెసౌందర్యమునకు క్రొత్తదనమును సంతరించినది. ఇది నలిన్ తల్లి కనిపెట్టకపోలేదు. ఆమె యిట్లు తన యూహల వెల్లడించెను.

"అబ్బాయీ! ఇంత చక్కనిపిల్లను నీవింగ్లండులో చూచితివా! నీవు ముందీమెను వివాహమాడి తరువాత నుద్యోగములో జేరవచ్చును." నలిన్ చిఱునవ్వునవ్వి యొకటిరెండుమార్లు నెమ్మదిగా దగ్గెను. "వివాహమునకు కావలసినవన్నియు సిద్ధముగనున్నవి. లగ్నమేర్పఱచి శుభలేఖలనంపవలెను. వచ్చే యాదివారమునాడు మంగళస్నానము సుమా!" అని నలిన్ తల్లి యనెను. మొదట తనతల్లి తనతో మేలమాడుచున్నదని నలిన్ యనుకొనెను. కాని నిజపరిస్థితి తెలిసి కలతనొందెను. తనతల్లి ఇదివఱకు తన కావిషయమై వ్రాసినట్లు స్ఫురణకువచ్చెను. కాని యాతడది యంత ముఖ్యవిషయ మనుకొనలేదు. అప్పటి యాతని మౌన మంగీకారముగా నెంచబడినదని నలిన్ గ్రహించెను.

పుత్రునిస్థితి జూచి సేను "మనము తొందరపడుటేల?" అనెను. "అది పనికిరా"దని అతనిభార్య కోపముతో నన్నది. "త్వరలో వివాహము గావలసినదే! కాని నలిన్, నీవామెను వివాహమాడగనే నీతో దీసికొనిపోగూడదుసుమా! రేపాదివారము నాడే మంగళస్నానము. ఏమందువు నాయనా?" నలిన్ యేమియు ననలేదు. నెమ్మదిగా గొంతుసవరించుకొనుచుండెను. అతడు నుడువవలసినమాటల వెలువడనీయకుండ కంఠములో నేదో అడ్డుపడినట్లుండెను. అతని తల్లి భర్తవైపు చూచి, "తగిన యేర్పాట్లన్నియు చేయుట యుక్త"మనుచుండగనే నలిన్

గాద్గదికముతో "వద్దు! అమ్మా! కాదు! కాదు! ఇప్పుడు వద్దు!" అనెను. అతని అయిష్టమును చూచి రామప్రసాదు, "ఏమి నలిన్! అప్పుడే ఒకభార్యను సంపాదించినావా!" అనెను. నలిన్ ముఖము పాలిపోయినది. "ఇదేమి హాస్యము నాయనా! అట్టి మాట లనరాదు" అని నలిన్ తల్లి రామప్రసాదును మందలించెను. నలిన్‌తో "భామిని తల్లిదండ్రులు అనేక క్రొత్తవిధములగు నాభరణముల నామె కిత్తురట. మన మెంక క్రొత్తవస్తువైనను నీయకుండుట బాగుండునా? కనుక మూడువందలప్పటివిలోని చక్కని గాజులజత చేయించినాను. వానిని నీవే నాచిట్టి తల్లి చేతులకు తొడుగవలెను." అని వానిని దెచ్చుటకు లోనికేగెను. కాని నేనుమాత్రము కొడుకు తడబాటు చూచి విచారముతో "ఇప్పుడు వివాహమాడుట కిష్టము లేదా? నలిన్!" అనెను. నలిన్ అటునిటుచూచి ఏమోగొణుగుకొనుచు "వద్దు!" అనెను. రామప్రసాదు నవ్వుచు మెల్లగా "ఏమి నలిన్! పెండ్లాడి ఇంటికివచ్చినావా?" అని యడిగినాడు. నలిన్ అతనిని తట్టి రహస్యముగా "ఇప్పుడేమీ అన వద్దు బాబూ! నీపుణ్యము." అన్నాడు. దూరమున నున్న నేను కీమాటలు వినబడలేదు, గాని రామప్రసాదూరకుండుటకు బదులు "ఏమీ! నిజముగా వివాహ మాడినావా? ఎప్పుడు? ఎచట? ఎవరిని? పాశ్చాత్యయువతిని కాదుగదా?" అని గట్టిగా ననినాడు. ఒకమారు నేస్ హృదయమునుండి రక్తము పైకుబికినది. నీరవుడై పుత్రుని చూచినాడు. ఏమి సమాధానమువచ్చునో అని. నలిన్ ఏమి చేయుచున్నది తెలియకుండగనే "అవును" అని తలనూపెను. నేను నిరాశతో సోఫాపై వ్రాలెను. ఒకక్షణములో నాకళ్యాణగృహము దుఃఖగృహముగ మారిపోయెను. ఆక్షణమున తల్లి క్రొత్తగాజులతో, నవ్వుమొగముతో, ఆగదిలో ప్రవేశించెను. "నాయనా! చూచినావా! యీగాజు లెంత మనోజ్ఞముగనున్నవో! భామిని లేతచేతులకు వీని నలంకరింపుము." అని భామినికై అటునిటు చూచెను.

పాప మాపిల్ల యేదీ? ఎచ్చటకేగినది? తన కన్నీటిని, అవమానమును, ఆశాభంగమును, ఏమూలనో దాచుకొనుటకు పోయినది. గాజులు కొంతకాల మాసారుగులోనే మూసిపెట్టబడినవి.

భామినివిషయముగాని, గాజుల విషయముగాని చివరకు బాగుగనే పరిణమించినది.

కాని నలిన్ తలిదండ్రుల స్థితి యేమి? వారి యాశాపుంజముపై నొక తెర వేయవలెను. పాశ్చాత్య స్త్రీ హిందూగృహిణి యెన్నటికిని కాజాలదు. హిందూత్వము జన్మతః సంక్రమింపవలెగాని చేసి పెట్టిన వచ్చునది కాదు.

# స్వగృహోన్ముఖపాంథుఁడు

మహా శ్రీ కట్టు కోటయ్యగారు బి. ఏ.

౧

ఉషఃసమయప్రయాణికు హృదయమునకు
మిసుకుమిసుకంచు మంచులో మెఱసిపోయి
ఆశసముఁజేల్పుకొనివచ్చు నాభరతఖ
గేంద్రు గానమాధుర్యము నించిమించె.

౨

అలతమధ్యాహ్నసమయ ప్రయాణమందు
నలసి కాళ్ళీడ్చుకొను చేగునపుడు చుట్టు
పట్టుల విలాసముగ నాటపాటలాడు
వాయువులు వాని కెక్కుడుహాయిఁగూర్చె.

౩

మేఘవిరహితాకాశాన మిత్రుఁడెండఁ
గాయఁగాఁగాల్లదల్పనే కష్టముపడు
సమధికాయాసయుతపాంథజనవరునకు
జలజలను సెలయేటినిస్వనచయమ్మొ
తాపమెడలించు దివ్యౌషధమ్మనయ్యె.

౪

సంజవెలుతురు క్షీణింపసాగెఁజీమ
చిటుకుమనని ప్రశాంతనిశీథమొదవె
పాంథజనకర్ణపేయమై పరగెనపుడు
దూరమేషాగళస్థఘంటారవంబు.

౫

కాని యన్ని హృదయరంజకస్వనముల
కంటె సువిశేష మాధుర్యకలనఁగ్రాలె
తనదురాకకు స్వాగతమ్మును దెలిపిన
ప్రణయినీమృదుముగ్ధగళస్వరంబు.

# వేదవతి—రావణునితో

కొండపల్లి గోపాలరావు, వాకెరామలింగశాస్త్రి గార్లు

ఓరి దురాత్మ బాహుబలోద్ధతచిత్తుఁడవై సుధీజనా
చారపరంపరాస్థితివిచారవిహీనుఁడవయ్యు దోఁగని
ష్ఠారతి నయ్యనంతుని రసజ్ఞుని బెండిలియాడఁగోరు న
న్నారట పెట్టినాఁడ వకటా నినుఁబోలెడి పాపులుందురే?
పుట్టితివగ్నిహోత్రమునుబోలు పులస్త్యుని వంశమందు, చే
పట్టితిబత్తితో హరునిపాద సరోజముఁన్, వరించి త
య్యిట్టులపున్ సొబంగు గలయిందుముఖిన్ మయుఁగూఁతు నట్టి నీ
కిట్టితలంపుగల్గె, తగవే? అఘమియ్యది నిన్నుగాల్పదే.
శ్రితభక్తేప్సితసంచయప్రదులు, నిశ్శేషప్రభావాఢ్యు ల
చ్చ్యుతురాస్యేందుకళావతంసులు, త్వదిచ్ఛాపూర్తిగావించి; రా
శ్రితులందార్యజనుల్ గుణాగుణములన్ జింతింప రట్లాట నీ
గతిదౌష్ట్యంబునుఁబూని జేసితివి దుష్కార్యంబు నెట్లోర్చెదన్?
నినుదుష్టాత్మునిగా నెఱింగితిని మున్నే కాని నీతండ్రి న
య్యనఘున్ విశ్రవసుం దలంచికొని నీ కాతిథ్యసత్కార మి
చ్చిన నన్నెవ్వతెఁగా దలంచితివొ ఛీఛీదుర్మతీ యిష్టె మ
ద్ఘనవేణీపరికర్షణాఘము నినుం గావింపదే నీరుగాన్.

అతిభయదమహామకీన క్రోధాగ్నిశిఖల
నిన్నిట దహింపఁజాలియు మిన్నకుంటి
ఘనతపోధనలోభంబు కలుగుకతన
కాకయుండిన రూపంబె లేకయుండు.

అతినిష్ఠన్ నిగమాంతవేద్యుఁడగు న య్యబ్జాక్షుపాదాంబుజ
ద్వితయంబున్ మదిలోననిల్పుట పవిత్రీభూత మీదేహమీ
గతిఁబాపాచరణప్రవీణకరసంఘర్షంబు నొందెన్ కటా
యితరం బేటికి దీనినొల్ల నిపుడే యీవహ్నిలో వ్రేల్చెదన్.

సద్గతికిఁబోయి నిన్ జంపు జతనమునను
మహి నయోనిజత్వమున జన్మంబుదాల్చి
పుత్రపౌత్రాదికముగ నిన్ బాలియఁజేతు
అస్మదుక్తశాపంబు భోగ్యంబు మూఢ॥

# తల్లికన్నను దైవము ధరణికలదె?

శ్రీమతి ఆచంట సత్యవతమ్మ గారు

"నా స్త్రీమాతృసమోగురుః" అని "గృహలక్ష్మి" సంపాదకీయమొకటి ప్రకటించినది. అది చదివినవారికి తల్లియెట్టిదో విదితమయ్యేయుండును. తల్లిఅనగా భూదేవితో సమానము. భూమి సమస్తము కడునోర్పున ధరించును. ఓర్పునకు నుపమానముగా నొకటి చెప్పబూనినవారు భూమినే గైకొందురు. భూదేవివలెనే, తల్లి తనసంతానముయొక్క అశుచులన్నిటిని, కించిత్తైన ఏవగించుకొనక ధరించును. అజ్ఞానదశలోనున్న బిడ్డలకు వారి అశుచులు దేహమునకు సోకకుండ సకాలమున బాగుపరచుచుండును. ఆకలిదప్పులరసి కాపాడును. జిహ్వాచాపల్యముచే నేది తినిన బిడ్డలకు జబ్బుచేయునోయని భయపడి తననోటిని కట్టిపెట్టుకొనును. వారి కేనుమంత నొప్పికలిగినను తపించి, తనప్రాణమైన నొసగుటకు సిద్ధపడి, బిడ్డబాధ నివారింప పాటుపడును. దరిద్రస్థితిలోనున్న తల్లియైన తాను మాడి పిల్లల పోషించుకొనును. కడుపుతీపి యట్టిది.

"నాసెబిడ్డ నూరువరహాలొసగినను రాదన్నట్లు పసినినుగును చూచుకొనుటలో మహానందము పొందును. తదుపరి, సంవత్సరము నిండుపర్యంతము శిశువొనరించు అవ్యక్తచేష్టల నీక్షించుటలో యొక విధమైన ఆనందము పొందును. రకరకముల జోలలపాడి బాలలనిదురింపజేయుటలో, మానసికానందము తానే పొందును. కాని, జోలపాటలసాంపాదాల తెలుగరుకదా? మాతృదేవత జోకొట్టుచు పాడు గానధ్వనికే, వారు, నాగస్వరమువిని యాడెడి పామువలె, శ్రీకృష్ణుని వేణుధ్వని విని, తన్మయులై నిలచిన, గోగణ, గోపికలవలె, తన్మయులై నిద్రింతురు. అనిమిషుల నారడింపజేయుశక్తి తల్లికేకాని యన్యహస్తమున కున్నదా? లేదు.

"ఊరికూరని ఊరుగాయయు వచ్చీరాని ముద్దుపల్కులు నతిరుచి" యని సామెత. పిల్లల ముద్దుమాట లాడెకే ముద్దు. ఈముద్దు లైదుసంవత్సరములు నిండువఱకే యుండును. తదుపరి బిడ్డలవిద్యాకృషి. దానిలో తల్లిపడుపాటు లనంతములు. తనమెడలోని పుస్తె పూసలమ్మికూడ బిడ్డని విద్యాభిలాషకు పాటుపడును.

ప్రస్తుతపాశ్చాత్య విద్యాభిలాష పెరుగుకొలంది దాస్యశృంఖలము లెక్కుడుగా బిగింపబడెడి యువకుల విలువలేని విద్యకొఱకై యావదాస్తులు తెగనమ్మి ఫకీరులైయుండెడి తలిదండ్రులు, తమకొడుకులేమో గణించి తెచ్చి తమకెత్తినున్న గంప దింపుదురని మురియుచుందురు. ఎంత పెద్దయుద్యోగమైన యంతఖ్యాతి గడించునాడెడి వెర్రివ్యామోహమున బడి, కన్నతీపిచే చాటుమాటున తెచ్చిపోయు తల్లి వాత్సల్యమెట్టిదో యెఱిగిన వివేకవంతునకామె ఋణమెట్లు తీర్చుకొందునా యని తోచకమానదు. అట్టిమాతయందు దభిమానశూన్యుడగువాడు మానవజాతిమున కనర్హుడగును. వాని కిహపరములు లేవు. వానికి జయముకలుగదు. తల్లిఋణము తీర్చుకొనలేని తనయునికి తరణోపాయమే లేదు!!

అసలు నిజమైన ఆనందఫలమె శిశురూపము. వారు పెరిగి పెద్దవారై, నీతిమంతులై, మంచివారని, వివేకశాలురని, సుగుణశీలురని పరులచే కీర్తింపబడునపుడే తలిదండ్రుల ఆనందము సంపూర్ణమగును. ఇట్టి బ్రహ్మానందమనుభవించుటకొఱకే తల్లి అష్టకష్టముల బడును. మంచితనయుండై తమ్ముసుఖపెట్టుటే వారి అంతిమకోరిక. వారికోరిక నెఱిగి తల్లిదండ్రుల దుఃఖము లణచువాడే సత్పుత్రుండు. అట్టివా రిప్పు డరుదు.

కుంతీదేవి కోర్కెయగు గజగౌరీవ్రతమును సాగింప, ఇంద్రలోకమునుండి ఐరావతమునే తెచ్చిన, కుమారరత్నములగు భీమార్జును లిప్పుడుండిరా? "అమ్మా భిక్ష తెచ్చితి" మనగా, మామూలురీతిగా మీరైదుగురు పంచుకొనుడనగా, తల్లివాక్యము తప్పరాదని, ఒక్కద్రౌపదినే ఐదుగురన్నదమ్ములును వివాహమైన పాండవరత్నము లిప్పుడెక్కడ? తనకెత్తిని బడనున్న కిరీటమును, సార్వభౌమత్వమును, పితృవాక్యానుసారము, తృణప్రాయముగా సర్వభోగ్యములను వర్జించి, కాయకసపులభక్షించుచు, అరణ్యవాసక్లేశమనుభవింప సంతోషపూర్వకముగా నామోదించిన విధేయపుత్రరత్నమగు నా శ్రీరామచంద్రునివంటి పుత్రుం డేడీ!!?

పురాణపురుషుఁడగు శ్రీకృష్ణుని, పదునాల్గుభువనములు భరించినపొట్ట నొకమారెదు త్రాటిచే యశోద రోటికికట్టి బంధించెను. ఎట్లు? తల్లియందుండెడి పవిత్రప్రేమభావముచే బ్రహ్మాండముల నిమిడినకడుపు కన్నతల్లి చేతికి సంకుచితమయ్యెను. ఆహా! మాతృప్రేమలో నెంతమాధుర్యమున్నది! మాతృశబ్దములో నెంత మహిమ కలదు! "అమ్మా" అను పిలుపులో నెంతయర్థమున్నది! తల్లిచుట్టును ముమ్మారుప్రదక్షిణ మొనర్చిన సర్వప్రపంచమును చుట్టివచ్చినట్లే యని పురాణగాథ కలదు.

చారిత్రకపురుషుఁడును, స్వరాజ్యస్థాపనాధురంధరుఁడును, మహారాష్ట్రవీరనాయకశిఖామణియు నగు శ్రీఛత్రపతి శివాజీమహారాజు, తన యున్నతస్థితి కాతని మాతృప్రబోధమే కారణమని చాటిచెప్పెను. మాతృవందన మొనరించి తల్లిదీవనల బడయనిదే, యాతఁడే దండయాత్రకును వెడలలేదని చరిత్రవిదితము. తల్లి యెంతటిదో, తన తనయులభావిస్థితుల కామె బోధన లెంత పనిచేయునో, అట్టి మాతృఋణ మెట్లుగా కుమారుఁడు తీర్చుకొనవలెనో తెలిసికొనవలెనన్న, శివాజీ, జీజాబాయిల చరిత్రలే సాక్ష్యమిచ్చును.

అట్టి సుపుత్రులకాలము కాదిది. ప్రస్తుతసంతానము పట్టి గులకరాలు; మనమిప్పు డీప్రపంచమున గాంచుచున్నది అనుభవించుచున్నది యిట్టి సంతానమే. కాస్తడబ్బు చేతిలోపడగనే, తమ్ము నాయుద్యోగమున కర్హులగావించినవారలు తమ తల్లిదండ్రులే యనుట మరచి, అవివేకప్రవర్తులై, భార్య కాపురమునకు రాగనే తల్లిని దాసివలెను, తండ్రిని నౌకరువలెను చూచుచు, "అమ్మా" యని పిలుచుటకే అభిమానపడు కుమారులెందరినో మనము నిత్యము చూచుచున్నాము. తమ చిన్నతనమున ఆడిఆడివచ్చిన సుతు నెత్తుకొని, ధూళిధూసరిత శరీరము దులిపి తమ అంకతలమున నిడికొని, అతిప్రేమతోడ పవిత్రక్షీరామృతమిచ్చినతల్లి ఋణమాజన్మకృతజ్ఞులైనను సుతులుదీర్చుకొనలేరన్న ఆజన్మాంత మామె యొనరించిన యుపకృతుల కన్ని చేసినయెడల ఋణవిముక్తులగుదురో అరయుదురుగాక!! తలిదండ్రుల గొట్టి తిట్టి పొగడ్రోలకున్న మాతృపూజ చేసినంతఫల మిప్పటివారల కబ్బును. "మాతృభ్యోన్నమః" అని ఆదినే గురువు చెప్పును. కాన నోపుత్రనామ ధారులారా! "తల్లికన్నను దైవము ధరణి కలఁడె?" అని నమ్మి, మాతృసేవాపరాయణులై, మీజన్మకారకులగు మాతాపితల చల్లనిదీవనలచేఁదనియుచు, మీచిన్ననాటి సకలాసహ్యముల సేవగించుకొనక భరించిన తల్లి కడు రాడక, మాతృఋణవిముక్తులై, తల్లిని సంతసపరచిన, సుపుత్రరత్నములని పేరు వడసి వంశోద్ధారకులై వర్ధిల్లుదురు గాక! మీకట్టి సద్బుద్ధి నా భగవంతుఁ డనుగ్రహించుగాక!

తెల్లవారగలేచి। తల్లిదండ్రులకిల
దండంబుపెట్టిన। తనయుఁడతఁడె!
వంశరత్నంబనగ। వర్ధిల్లగలుగుచు
పున్నామనరకంబు। బోవఁజేయు.

## సందేహము

కందుకూరి రామభద్రరావుగారు

ఎచటికీయానమో
ఎందుకీయానమో
ఎటనుండియానమో
ఎఱుగనో సామి!
కులుకుచంద్రికలలో
కుసుమసౌరభములో
సెలయేటిపాటలో
చెలియచిఱునవ్వులో ఎచటి...

జలదసంకులములో
జగ ములియు గర్జలో
కటికచీకటులలో
కన్నీటిధారలలో ఎచటి...
పాషాణతలములో
భయదకాననములో
ఆయాసభరములో
నడలుస్వేదాంబులో ఎచటి...

# బ్రహ్మరథము

దివాకర్ల వేంకటావధానిగారు

[దేవరాజ్యశ్రీమోహితుండగు నహుషుండు పౌలోమీసందర్శనమునకుం బోవువాండై సప్తర్షిముఖ సహస్రబ్రాహ్మణకృతమైన బ్రహ్మరథమెక్కి వారల నవమానించినందున నం దగస్త్యుండలిగి వాని కత్యుగ్రాహి వగుమని శాపమిచ్చెను. శాపభీతుండై రక్షింపుమని వేడుకొనిన ధరాపాలున కమ్ముని సమాధానము]

తే॥గీ॥ అగ్రజాతినిం బుట్టిన యథముండైన
మాన్యుండని నీవెఱుంగవో మనుజనాథ?
గౌరవార్హుండు లేడె యొక్కరుండు? నీకు
స్యందనము లాగువార లీసచ్చరితులె?

ఉ॥ ఇంద్రత్వమ్ము ఘటించె, దానికి ఫలం బీసర్వలోకమ్ము ని
స్తంద్రప్రక్రియం బ్రోచుటేకద! మునీంద్రశ్రేణి కుద్యత్క్షమా
సాంద్రజ్యేష్ఠుల కెగ్గుసల్పుట మనస్సా! అంత్యకాలంబె? భూ
మీంద్రా! దూరముగాం దొలంగి చను, నిన్నీక్షించుటే పాపమా.

సీ॥ బ్రహ్మహత్యానేక భయదపాపమ్ముల
మాయింద్రు నెత్తిపైం ద్రోయుటొకటి
ఏగంగలోపల నెవరు మున్గిన నేమి
యని ముక్కుమూసికోం గనుట యొకటి
మాలోన మాకైకమత్యమ్ము లేమి మే
మనిశమ్ముం గొట్లాడుకొనుట యొకటి
అన్యలోకమువాండ వనుభీతిం దిగంద్రావి
యెలమి నీకాశ్రయం బిచ్చుటొకటి

తే॥గీ॥ మాస్వయంకృత దోషము లుచ్చరింప
వేని మా శతమన్యునకే నిరూఢ
మైన యీస్వర్గసామ్రాజ్య మేలునట్టి
భాగ్యమబ్బునె నీకు స్వప్నమునం గూడ?

ఉ॥ ఆలమునేయంబోని దురహంకృతిదూరుల ధీరులన్ గృపా
శీలుర ధర్మమూర్తులం బ్రసిద్ధతపోవిభవాభిరాములన్
గాలము దాపురించి ములుగఱ్ఱలగ్రుచ్చి పరాభవించున
ప్లేలవమైన లేని బెదరేటికి? నీకిపు డోనృపాలకా!

ఉ॥ మారాజ్యమ్మును జేరి యేపగిదినో మాయింద్రసింహాసన
శ్రీరాగమ్మును సంగ్రహించితివి వాసింగాంచి సౌఖ్యాంబువుల్
పారంపర్యము గ్రోలంగాం గలుగు సౌభాగ్యమ్ము లేదేమొ! దు
ర్వైరంబేల ఘటింతు మాపయి నృపాలా! ధర్మవిద్వేషివై.

ఉ॥ బ్రాహ్మణులన్న నెవ్వరని భావమునం దలపోసినాఁడవో
బ్రాహ్మికిఁ గూర్మిబిడ్డలు, కృపానిధు లుజ్జ్వలసర్వసంస్తుతా
జిహ్మయశోవిభూషితు లజేయులు; వారల నిగ్రహించుటల్
జిహ్మగమున్ గ్రహించి యొడిఁ జేర్చుటకాదె? ధరాపురందరా!

ఉ॥ చేసినవాఁడవే క్రతువిశేషము లన్నియు, భూసురార్చనా
భ్యాసము పూర్వమున్నదియె, పాపము ధర్మపరుండవే విప
ర్యాసము సంఘటించె ననయమ్మును గన్నులు నెత్తికెక్కె, నీ
చేసినపాప మిప్పగిదిఁ జేటొనఁగూర్చిన దేమిసేయుదున్?

ఉ॥ ఎంతటి శాంతమూర్తియు వహింపకపోడు దురాగ్రహంబు, దు
శ్చింతన! నీవొనర్చిన కుచేష్టితముల్సహియించుటన్న లో
కాంతము దారిచూపుటయె యౌనని నిన్ను శపించినార మా
ద్యంతము లారయంగలుగుమయ్య! నృపాలక మాదిదోషమే?

చ॥ హరిహరపద్మగర్భులకునైనఁ దరింప వశమ్ముగాదు మ
ద్గురుతరశాపశిక్ష!! చెనుత్రోవలఁ ద్రొక్కిన నీకుఁదప్పునే!!!
పరిచితసర్వధర్మగుణబంధురబుద్ధి యొకప్డు, కావునన్
దిరిగి వచింతు విన్ము నృపతీ! భవదీయ విముక్తిమార్గమున్.

తే॥గీ॥ కొంతకాల మేగినవెన్క కోవిదుండు
ధరణినాయకుఁడొకఁడు నీదరికి వచ్చి
యుత్తరము లిచ్చి పోవు నీ వొసఁగునట్టి
ప్రశ్నలకు నాఁడు నీకు శాపమ్ము వీడు.

ఉ॥ ఆగ్రహమేగుదెంచిన సమస్తజగత్ప్రళయమ్ము గల్గుఁ బా
పగ్రహబాధ వీడును గృపామతిఁ జూచెదరేని; నిగ్రహా
నుగ్రహశక్తియుక్తులు కనుంగొనఁగా ద్విజు; లందుచేతనే
విగ్రహమూనఁగాఁదగదు విప్రులపై నని చాటుచుండుమా!

## విరుద్ధప్రకృతి

కొ మ ఱ్ఱా జు వి నా య క రా వు గా రు

సీ॥ గంభీరతరఘనాఘనగర్జనములేమి?
మిఱు మిట్లు గొల్పుఁ గ్రొమ్మించులేమి?
ప్రళయమహావాత భయద ఘాతములేమి?
పులకించు తెమ్మెరపూతలేమి?
రణసాంధ్యరాగోష్ణ రక్తరక్తిమమేమి?
ప్రణయమంజుల యుషారాగమేమి?
కలకంఠకులకలగాన మాధురులేమి?
క్షుద్రశకుంత సంక్షోభమేమి?
శోకబాష్పాంబువుల నించి స్రుక్కకనులు,
పరగ నెట్లగు నతులిత ప్రణయఖనులు?
ఎట్టులధర మసంతృప్తి నిపుడ బూను?
ఇంతలో సుందరస్మిత మెట్టులీను?

# నటుడు

సామవేదం జానకిరామశర్మగారు

ప్రేమతరంగములు ఆలింగనము చేయుచుండెను. ఆతడు తనచిరునగవు జగదానందకరమని తలచుచుండెను. ఆచిరునగవునందు సామ్రాజ్యవిజయాభిమానముండెను. ఆతని కీజీవితమందు మిక్కిలి యాదరముండెను. ఇదియే తగు సమయమని చూచెను. సుందరి పుష్పహారమును గ్రుచ్చుటయందు మగ్నయయి యుండెను. గర్వయుక్తముగ నాతడు బిగ్గరగ నవ్వి యిట్లనెను.

"జీవనమం దిది యమూల్యసమయముగాదా?" సుందరి తేరిపార జూచుచుండెను.

"ఊరకుండెద వేల?"

"ఇంత సుఖమును మన మిరువురమే పంచుకొని యీప్రపంచమున సుఖముగ నుండ గలమా యని యాలోచించుచుంటిని"

"దీనియందింత సందేహము నీ కేల కలుగవలెను?"

"ప్రపంచమును జూచి"

"ప్రపంచముతో సంబంధమేమి?"

"ఏల లేదు?"

ఆతడు— "నేను నీవే నాసర్వస్వమని తలచుచున్నాను"

"నాహృదయముయొక్క అంతరతమప్రదేశమందలి యంధకారమువద్ద ప్రకాశించుజ్యోతియని నమ్మ నెంచుచున్నాను."

"భార్యా! నాజీవనసుఖము నీ ప్రేమోద్దీపకములగు నేత్రములయం దిమిడియున్నది. ప్రపంచము మిక్కిలి మనోహరమయినది"

2

రాత్రింబవళ్లు కేవల మొక యావులింతతో సమాప్తమగుచుండెను. ప్రకృతియందలి సుందరదృశ్యములతోగూడ కోరికలు నిశ్శబ్దముగ కర్ణములయందు ప్రవేశించి, శూన్యప్రదేశమందలి స్వప్నములవలె తమ అనుభవమాకృతిని చూపించుచుండెను.

జీవనమను అభినయశాల కది ప్రథమదృశ్యమై యుండెను.

నిర్భీతితో నాతడు ప్రపంచమెదుట తన నేత్రములను తెరచెను.

జను లుచ్చైస్స్వరమున "ప్రపంచము పాపభూయిష్టము. దుఃఖోపేత"మని యరచిరి.

"ఏ చింతయు లేదు; ఆనందమే ప్రపంచ"మని నిర్భీతితో యతడనెను.

రణక్షేత్రమందలి ఫిరంగులవలె ప్రపంచమంతయు, దుష్టభూయిష్టమని యాతడెఱుగడు.

3

భార్యా! ఆదినము జ్ఞప్తియందున్నదా?

"ఏదీ?"

"ఏదినమున మన ప్రథమపరిచయ మాయెనో అది"

"ఆ పవిత్రదినమును నేను మరువగలనా"?

"ఆసమయమున కోరబడకయే సుఖములు తండోపతండములుగ వచ్చుచుండెడివి. నీనామశ్రవణమాత్రమున పులకితుడ నగుచుండెడి వాడను. పవిత్రవంతమగు గంగానదికి యావలి యొడ్డున యిసుక తిన్నెలపై, నీనామము స్వర్ణాక్షరములతో లిఖించి యానందమొందుచుండెడివాడను."

"ప్రియా! అరమూతలకన్నులతో చంద్రుని యందు మీచిత్రమును జూచి నన్ను నేను మరచుదానను"

"భార్యా! స్వార్థాభిలాషియగు నీప్రపంచమున యీజీవనమునందాశ లేనివాడనై నిన్నే ప్రేమించుచుంటిని."

"ప్రపంచమున నేమి? మన మిట కెందులకు వచ్చితిమి? ఇది యొక రహస్యము."

"ప్రపంచమున నొక అగాధసాగరము. మనమా సాగరమున తరంగముల మగుదుము. చివరకు దానియందే గంతులు వైచుచు లీనమయ్యెదము."

"ప్రపంచ మొక రంగభూమి. మన మందరము నటులము. మన పాత్రనిర్వహణ మొనర్చిన పిదప యవనిక మరుగున కేగెదము"

యువతి యేభావముననో తన్మయురాలై ఆకసమువంక జూచుచుండెను.

౪

మొన్న వర్షములు గడచినవి. ఏదియో గొణుగు కొనుచు ప్రతిదినము పరివర్తన మగుచుండెను. నిత్య మొకటే దృశ్యము ఒకటే రాగము ఒకస్వరమునే వినుటవలన యామె హృదయ మొక తీరాయెను.

ఆ దినమున ఛాయ ఉదాసీనతతో కూర్చొని యుండెను. ఆమె తన రకరకముల పెంపుడుపక్షులకు బంధమోచన మొనరించుచుండెను.

ఆకసమున నెగురుచు ప్రకృతియొక్క చిరునగవుపై నాట్యము సేయుచు, స్వేచ్ఛాసంచార మొనర్చు పక్షులను పంజరములలో బంధించుటయెంతయు అన్యాయమని తలపోయుచుండెను. రెక్కల యసమర్థతచే శక్తిహీనమైన పక్షిగణము మెల్లగ వృక్ష కోటరములలో చేరి ఛాయ యొనర్చు కార్యమును తిలకించుచుండెను. ఇదియొక నూతన సమస్య.

యువకుడు కార్యసమాప్తి కాగానే యిల్లుచేరెను. ఇంటియందలి దృశ్యము గాంచి యాశ్చర్యము జెంది యాతడు మిక్కిలి ఆదరముతో

"ఛాయా! పంజరములందలి పక్షులేవి? నీ ముఖము కాంతిహీన మయినదే! కన్ను లశ్రుపూరితము లగుట కేమి కారణ" మని ప్రశ్నించెను.

ఛాయయొక్క నేత్రములు స్వేచ్ఛాదాహములో నిండియుండెను. ఆమె వ్యాకులస్వరమున "పరాధీనత పంజరమందు వ్యాకులపడుచుండెను. వర్షఋతువందలి యీ మేఘములు వాటి కేదియో సంకేత మిచ్చుచుండెను. ప్రేమబిందువులతో దాహము నివారించుకొనుటకు నేనే వాటిని వదలితిని"

"ఛాయా! ఇది యెట్టి నూతన మార్గము? నీభావములు కార్యములవలెనే పరివర్తన మందుట కేమి కారణము? నీ వొంటరిగా కూర్చొని యేడ్చుచుంటివేల?"

"ఏమియు లేదు. నూతన బాధ నొకదాని ననుభవించు చున్నదానను."

"ఎటువంటిది?"

"దానిని వ్యక్త పరుపజాలను"

"దానికి ఔషధము లేదా?"

ఛాయ మాటలాడక యుండెను. యువకుడు ఛాయపై యేకదీక్షతో దృష్టి ప్రసరింపజేసెను. నేత్రములు పరస్పరము తమ సాంకేతికభాషలో కొంత మాటాడినవి.

యువకునకు మాటాడు సాహసము లేకపోయెను. ఇదియొక విషమసమస్య.

రెండవదినమున ఆతడు వచ్చి చూచుసరికి ఛాయ లేకుండెను. హృదయ పటముపై యింద్ర ధనస్సువలె ఛాయ తన చిరునగవును విడచిపోయెను.

యువకుడు, ఛాయ యీజీవనమున సంతుష్టిజెంది యుండలేదని తలచెను.

ఆ శూన్యగృహమున అంధకారమందు నిరాశ తన నాట్యమును జూపుచుండెను.

యువకుడును గృహము వీడి మార్గహీనుడై తిరుగ నారంభించెను.

౫

మానసము విచారగ్రస్తమాయెను. హృదయమం దెద్దియో వచింపరాని బాధయుండెను. ప్రపంచమందలి మనోహరత్వము నిన్నటిరేయికలవలె నష్టమాయెను. ఏఛాయయొక్క క్రీగంటిప్రసారముచే తనకు ప్రపంచములో సంబంధము కలిగియుండెనో ఆమెయే తన్ను విడనాడెను. ఆతని కీ జీవితమున అన్యులెవరును లేరు. జీవనమందాతని కిసుమంతయు సుఖములేకుండెను. తాను మృతినొందుట కిచ్ఛయున్నను, ఎట్టి యీర్ష్యయులేక నిష్కళంకమగు మనోద్రఢిమ గలవాడగుటచే వీలు కలుగకుండెను.

ఉబుసుపోకకై యాతడొకనాటకమును జూచుట కేగెను. ఆసమయమున, ఒకదినమున ఛాయ ప్రపంచమను రంగభూమియందు మన మందరమును నటుల

మని నుడివినది జ్ఞప్తికివచ్చెను. అటులయిన కృత్రిమముగ నీనాటకమునందు అభినయ మేల చేయకలేను?

ఆపైన కొన్నిదినములైనపిదప ఒకానొక సుప్రసిద్ధ నాటకసమాజమం దాతనికి స్థానముదొరకెను. అతని రసపూర్ణ నేత్రములును, నల్లని కేశములును, పొడవగు హస్తములును, స్థూలముగాక తనుమాత్రముగ నున్న యాతని దేహమును నటునిగా నొనర్చెను.

అతడు తన సమాజమం దతికౌశలముతో అభినయించుచుండెను. అతని యభినయము గాంచినపుడు జనులు చమకితులగుచుండిరి. వహ్వా!! వహ్వా!! యను ధ్వనులచే నాటకశాల మారుమ్రోగుచుండెను. దైనందిన మాతనికి సమ్మానమెక్కువ కాజొచ్చెను. ఆదర మాతని సమ్ముఖమున హస్తము దిమిడియుండెను. కొలదిరోజులకే యాతడు నాటకమున ప్రధాన పాత్రధారిగా జొచ్చెను.

* * *

ఆర్యనాటకమండలి భారతీయుల ప్రాచీననాటకముల నభినయించుటలో ప్రసిద్ధికెక్కియుండెను. పండితులగువారలు ప్రత్యేకముగ నాటకమును జూచుటకై దూరమునుండి వ్యయప్రయాసలకోర్చి వచ్చుచుండిరి.

* * *

ఆదినమున "వసంతసేన" నాటక మాడబడునని ప్రకటింపబడెను. చారుదత్తుని పాత్రధారణ మీతనిదై యుండెను. నాటకశాల జనులచే క్రిక్కిరిసి యుండెను.

అతడు రంగపుమంచ మధిరోహించెను. సుప్రసిద్ధ నటుడగు కారణమున కరతాళధ్వనులు చెలరేగెను. ప్రేక్షకగణమునందలి ప్రథమశ్రేణిలో నొకతెను ఛాయ యనుభ్రమచే యాతడు ఆశ్చర్యముతో జూచెను. నేడాత డధికోత్సాహముతో పాత్రనిర్వహణ మొనర్పజొచ్చెను. జనులు ముగ్ధులయి చూడసాగిరి. వేలకొలది నేత్రము లేకపర్యాయ మాతని పైబడుచుండెను.

ఛాయ తన నూతన పురుషునితో ప్రథమమున గూర్చుండియా యద్భుతదృశ్యమును తిలకించుచుండెను.

చారుదత్తుని కొరతవేయు దృశ్య మేతెంచెను. చారుదత్తుడు హంతకులమధ్య కొలముప్రక్క కేతెంచెను. హంతకుడు ప్రాచీనపద్ధతిననుసరించి వధ్యుని యపరాధ మేకరువుపెట్టసాగెను.

"ఈచారుదత్తుడు తన్ను మిక్కిలి ప్రేమించు వసంతసేన యను వేశ్యను హత్యయొనర్చెను. న్యాయాలయమందీతనికి మరణదండన విధింపబడెను. ఈనగరవాసులందరికీ దండనవలన నీతిని నేర్చుకొనవలయును."

ప్రేక్షకగణమునకు ముందుకూర్చొనియున్న ఛాయ తనప్రియునితో "చూడుడు; ప్రపంచమున వేశ్యలు పురుషులను మోసగింతు రనునది సర్వమసత్యము. ప్రణయశాలినియగు వసంతసేన తాను ప్రేమించిన నిర్దయుడగు చారుదత్తునిచే వధింపబడెను. నిజముగా పురుషులే మిక్కిలి నిర్దయులు."

ఛాయకు వసంతసేనపై సానుభూతి యుండెను. ఆమె చారుదత్తుని కొరతపై నుండగ చూడగోరుచుండెను.

ఛాయనూతనప్రియునకు వేశ్యాసంసర్గమువలన నొకవిధమగు భయ ముత్పన్నమగుచుండెను. అతడా భీషణపరిణామముచే శంకితుడగుచుండెను.

ఛాయ:—వేశ్యలపై యీ చెడువాడుక లేదా?

అతడు:—మాటాడలేదు.

రంగభూమియందభినయమగుచుండెను. శకార పాత్రధారుడు వచ్చి చారుదత్తుని కొరతవేయుటకై తొందరపెట్టసాగెను. చారుదత్తుడు ఆధునిక పద్ధతిగా కల్పింపబడిన యురిత్రాడు మెడకు తగుల్చుకొన జూచుచుండెను, ఛాయ యీభీభత్సదృశ్యమును గాంచలేక తన కోమలత్వమును చూపుటకై, భయవికృతయై ప్రియుని దరిజేరి హస్తమును స్పృశించియుండెను.

హంతకుడు చారుదత్తుని ఉరిత్రాడు తగుల్చుకొనుమని తొందరపెట్టుచుండెను.

చారుదత్తపాత్రధారి "సత్యము. వసంతసేన లేనిచో జీవించి చేయగలదేమియు లేదు. జీవచ్ఛవము

వలె బ్రతుకుటకన్న మరణమే మే"లని వచించుచుండెను.

ఇంతలో వసంతసేన ఆతురతతో అటకు వచ్చెను. రెండవప్రక్కనుండి "చారుదత్తుని విడువుడు" "చారుదత్తుని విడువు"డని బిగ్గరగ నరచుచు శర్విలకుడు ప్రవేశించెను. ఇచ్చట చారుదత్తుని కొరతనుండి తప్పించుటకు శర్విలకుడు యత్నించుచుండెను. నాటకమున చేయవలసిన విధానమిదియే. కాని ఇది యేమి? చారుదత్తపాత్రధారి నిజముగా నారోపించిన బల్ల నావలికి పాదములతో తన్నెను. ఆతడు వ్రేలాడదొడగెను.

కేకలధికమాయెను. నాటకసమాజాధ్యక్షుడు తత్తరపడజొచ్చెను. నాటకము విశృంఖలమాయెను. ఆతడు వ్రేలాడుచుండుటచే తప్పించుటకెవరికిని సాధ్యము గాకయుండెను. అంతయు నిశ్శేషమాయెను. నాటకసమాప్తి తలచబడెను. నాటకసమాజాధిపతి పైకివచ్చి దీనముగ నిట్లని పల్కెను.

"కాశీవాసుడగు కిశోరుడను సుప్రసిద్ధనటుడు తన జీవమును స్వయముగా నేటినాటకమున గోల్పోయెను. ఆతడు మాసమాజమునకు రత్నసముడు. ఈవిధ శీఘ్రపుచర్యవలన మేమందరము దుఃఖితుల మగుచున్నాము." భార్య కిశోరనామమును విని యులికిపడెను. పూర్వపు స్మృతులన్నియు నామె నొకపరి ముందునకు లాగెను. ఆమె నేత్రములనుండి కండ్రబిందువులు రాలెను.

## వికృతి

హారి రాధాకృష్ణమూర్తిగారు

కడు కఠినాత్ములం బడిన కాయము క్లేశము నోర్వజాలకే
బడలగ గన్నుదమ్ములను బర్వగ రక్తిమ క్రోధరోషముల్
దొడరినకంత మెంతయును లుబ్ధత దాల్పగ క్రేవలందునన్
బడి జనితాశ్రుబిందువులు వాగులుగా గెడపంగ నేటికో॥

నిరహంకారము నిస్పృహత్వమును సుస్నేహంబు మీపట్ల నె
త్తరినైనన్ విడరానివే యయిన నేతత్కార్యదీక్షావిధిన్
మరువం బోలు; మనీషులెవ్వరును దుర్మార్గంబనన్ జెల్ల రో
తరుణీ, కార్యము తప్పివచ్చిన బ్రశస్తంబౌనె యీయశ్రువుల్॥

నీకును గ్రొత్త కాదు తరుణీ, యధికారమదాంధనైజ మ
జ్ఞాకల చెట్టుగాని కననౌనె త్వదీయదురంతచింత ని
ర్మోకమెడల్చు పాపుక్రియ ముక్తపరార్థవు కమ్ము వెంటనే
చేకొనుమైంద్రభోగముల జెప్పగ నేమదిగల్గు నింతకున్॥

తెరలోనుండగ నోము పండునటె యుత్తేజంబునన్ నీవు స
త్వరమే తెంచి విరించికృత్యములకుం వ్యత్యాసముం గూర్పగా
నరుదెంచెన్ సమయంబు; భీతిమెయి నన్యాయంబుపాలైన మె
ప్పరునన్ నల్వుర నీకు చోటొసగ దీపర్వంబు లోలేక్షణా॥

# భామాముఖల భీమా వెఱ్ఱి

గరిమెళ్ల సత్యనారాయణగారు, బి. ఎ.

"క్షణంచిత్తం క్షణంవిత్తం క్షణంజీవిత మాయురోః." విత్తమునకుగాని ప్రాణమునకుగాని యెప్పు డెట్లు నాశనము వచ్చునో చెప్పజాలము. ముందు అపాయము రావచ్చునని నిశ్చయించుకొని కాస్తపచ్చగానుబలముగాను ఉన్నప్పుడే మనము చనిపోయినచో మన తరువాతివారికిగాని బ్రతికియున్నచో ముసలితనములోగాని, నష్టము వచ్చినచో పూర్తిచేసుకొనుటకుగాని కొంతధనమును ప్రత్యేకించి దాచుకొనుట వివేకపథము. ఇట్లు చేసుకొనుచున్నను ఈకీడులు మార్గమధ్యము ననే మూడినప్పు డిట్టిమనకు ఇతరులు సాయము చేయుటయు, ఇట్టి యితరులకు మనము సాయముచేయుటయు లోకధర్మము. దీనినే భీమావ్యాపారసరణియందురు. ఇది పాశ్చాత్యదేశములలో బాగా వ్యాపించినది. మనదేశములో ఇంకాప్రారంభావస్థలోనే యున్నది. ఇంకను ఎంతయో విస్తరించవలసిన ఆవశ్యకత కలదు. ఇది మానవజీవితమునకు, మోటారులకు, అగ్నిప్రమాదముల వలన నష్టమురాకుండా వర్తకపుదినుసులకు, పడవలకు అనేకములకు చేసుకొనవచ్చును; చేసుకొనుచున్నారు. కాని పాశ్చాత్యస్త్రీపురుషులు ధనసౌందర్యపిపాసాయత్తచిత్తులు, సినీమానటీనటులు మొదలగువారు చేయించుకొనుచున్న భీమాలు మిక్కిలి వేలమువెఱ్ఱిగానున్నవి. వానిలో కొన్నిటి నీదిగువను "ఇండియను పాలసీహోల్డర్సు" అను పత్రికనుండి తీసి యెత్తి వ్రాయుచున్నాను:

కన్నుదగ్గఱిపన్నుకు భీమా:—మిసు డోరెను అటకు అనుపేరు గల పదునైదేండ్ల బాలిక చక్కగా యీలకొట్టగలదు. కన్నుదగ్గరనుండు పన్ను బాగుండనిదే యిట్లు చేయుట చాలకష్టము. ఈవృత్తివలన యీమె నాటకరంగముమీద నెలకు రు2,400/లు సంపాదించుచున్నది. ఈపన్నుకు ప్రమాదమువచ్చినయెడల నష్టమునుండి కాపాడుకొనుటకు దీనినామె రు 22,500లకు భీమా చేయించుకొన్నది.

వీపుపైపున నంసములకు భీమా:— లీలుడాగోవరు అనుకన్య కీభాగము మిగుల అందముగ నుండును. అయిరోపాఖండమున నింతచక్కనియంసభాగ మింకొక తెకు లేదట. ఈమె సినీమానటి. ఇందువలన నీమె మిక్కిలి రొక్కము నార్జించుచున్నది. దీని నీమె అత్యధికమైన మొత్తమునకు భీమాచేయించుకొన్నది.

పెదవులకు భీమా:—ఒక జపానుకన్య యొక్క పెదవులు గులాబిరంగుచే ప్రకాశించుచు మిగులవన్నె కెక్కినవి. ఆయంద మెప్పుడు మందమగునోయని ఆమె రు. 15,000లకు భీమాచేయించుకొన్నది.

చెక్కిళ్ల మీఁద సుడులకు భీమా:—అమెరికాలో ఫిలుములను తయారుచేయు ఒక సాహుకారు తనకొలువులోనుండి తాను మోహించిన యొక యువతియొక్క చెక్కిళ్ల సుళ్లయొక్క అందము మాసినచో తాను జీవించుటయే దుర్భరమని తలచి ఆసుళ్లను

రు. 3,00,000లకు భీమా చేయించెను. కాని వారి వివాహమైన అనతికాలములోనే వారు విడాకులిచ్చుకొనిరి. కనుక భీమా రద్దయినది.

కేశపాశమునకు భీమా:—మిస్ లూసీ కేటను అను పేరు గల ఇరువదిరెండేండ్ల యువతికి లోచనమోహనంబులైన బంగరువన్నె కురులున్నవి. ఆమెది దుస్తులు కుట్టువృత్తి. లండను ప్యారిసునగరములందలి విలాసపురుషులును స్త్రీలును ఆమెకురులను మెచ్చియే ఆమెచే తమ దుస్తులను కుట్టించుకొందురు. ఏరుగ్మతవలనకాని అవి వర్ణము చెడినచో వారందఱును తనవద్దకురారని భయపడి ఆమె తనకురులను రు. 15,000లకు భీమా చేయించుకొనినది.

అందము కలుగకుండా భీమా:- "నాట్య రంగమున నాడు నటీ మణులలో" కెల్ల కురూపి "పోలేరు" అనుకన్య. ఈ కురూపి తనము వలన నామె లెస్సగా ధనమును సంపాదించుచున్నది. కర్మముచాలక ఆమె కెక్కడనైన నంద మంటుకొన్నచోట ఈరాబడికి స్వస్తి చెప్పి చెడిపోవలసి వచ్చునని ఆమె తనకు సొగసు కలుగకుండా పెద్ద మొత్తమునకు భీమా చేయించుకొన్నది.

ఆఘ్రాణశక్తికి భీమా:— ప్యారిసులో ఒక యువతి వాసన పదార్థములను చక్కగ కనిపెట్టగలదు. సకలవాసనలను చెప్పగలదు. ఇందువలన నామె అమితమగు ధనమార్జించుచున్నది. దీని నామె పెద్దమొత్తమునకు భీమా చేయించుకొన్నది.

కవలపిల్లలకు భీమా:—అనేకస్త్రీలు ఇద్దరుముగ్గురేసిపిల్లలొకేసారి పుట్టకుండా భీమా చేయించుకొనుచున్నారు.

విడాకులురాకుండాభీమా:— అనేకస్త్రీలు తాము పెండ్లాడినట్టియు పెండ్లాడబోవునట్టియు భర్తలకును తమకును వివాహవిచ్ఛేదములుకలుగకుండా భీమాలుచేయించుకుంటూమంటున్నారు. కాని ఏకంపెనీవారికిని ఇంతటిసాహసము కలుగకుండుటచే ఇట్టి భీమాలు జరుగకున్నవి.

కళ్లకుభీమా:—మిసుజీనుకోవిను అను ఒకనటి డాలీథియేటరు అనుకంపెనీలో వేషములువేసి ధనముసంపాదించును. ఆమెకళ్లు త్రిప్పుటపు చమత్కృతివల్లనే ఆమెకంత ధనము కలుగుచున్నది. ఆమెకళ్లను 20,000 పౌనులకు భీమాచేయించుకొన్నది.

ప్రధానపుటుంగరమునకు భీమా:— క్రొత్తగా ఒక విలాసిని తాను ప్రేమించుచున్న ప్రధానపుటుంగర మెక్కడపోవునో అని పెద్ద మొత్తమునకు భీమా చేయించినది.



# అనుగమనము

ఆనందుడు

అది కృష్ణపక్షము.

సాయంసమయ మయినది. నిర్గమించు సూర్యుని కాంతులు నెమ్మదిగా తగ్గుచున్నవి. కనుచీకటులు అలముకొన జొచ్చినవి. ఆకసమున కాసంత మబ్బైన కన్పించుటలేదు. ఒకటి రెండు చుక్కలు తొంగి చూచుచున్నవి.

ఆపల్లెటూరివారందఱు దేవ-ఆలయమున సాయం దేవ-పూజకై వేచియుండిరి. అర్ధనగ్నులును, ఆటల నుండి క్రమ్మరువారును, ఆగుపిల్లలు ఆటకు రాదొడగిరి. పిల్లలు కొందరు ఢంకా కొట్టు కఱ్ఱ కొఱకు పోరాడదొడగిరి; కొందరుపిల్లలు కే గంట కొఱకు—. పూజ అయిన పిదప కొబ్బరి, బెల్లము, తీర్థము దొరకు ననుసంతసమున గంతు లిడదొడగిరి. పూజారి ఇంకను నూతికడ స్నానము చేయుచుండెను. కావున గర్భగుడి మూయబడియుండెను. పెద్దలు పిల్లలతో దేవదర్శనమునకై వేచియుండిరి. బయట ప్రశాంతముగ నుండెను. చీకటి పడుచుండెను.

"ఈ సాయంకాలము చాల మందముగా నున్నదే!" అని ఒకడు ఆప్రశాంతతను ఛేదించుచు నుడివెను.

"సూర్య బింబము తేజోహీనముగా నున్నదే!" అని మఱియొకడనెను.

"కలి, కలియుగము" అని ఇంకొకడనెను.

"..........ఇప్పు డీ విగ్రహము కాంతిరహితము! పది సంవత్సరముల క్రింద విగ్రహ పరివేషము దీప్తుల నుండెడిది!" అని మఱియొకడనెను.

ఇటులసంభాషణము మందముగా నడచుచుండెను. అప్పు డొకపురుషు డామార్గమున వచ్చుచుండెను. అతని నొక స్త్రీ అనుగమించుచుండెను. అతని మొల నొక కత్తి యుండెను; చేత నొక కఱ్ఱ. ఆమె నెత్తి నొక మూట యుండెను. చూచిన తోడనే అతడెవడైనది గ్రహించుట కష్టము. కాని, ఆమె రాజపుత్ర స్త్రీ యని నడకను బట్టి, వేషమును బట్టి గ్రహింప వచ్చును.

ఆ గుంపతనిని సమాకర్షింప లేదు. వారి నడక సాగుచునే యుండెను. ఔదార్యమున ఆయూరివా రాతని నాపి అభివందనముల నర్పించిరి, వాని నతడు మానముననే గ్రహించి ముందుకు సాగెను. ఆ స్త్రీ, అతని ననుగమించెను. దేవాలయమున నున్న "గ్రామ - పెద్దలు" హాస్యమున్న కౌతుకముతో డను, ఆదరమునను, మఱియొకసారి ఆ నూతనుని పలకరించి "ఎంతవఱ" కని యడిగిరి.

"చాలదూరము వఱ" కని జవాబు.

"అయిన ఈరాత్రి ఇక్కడ ఆగరాదా"?

"నన్నెందులకు బలవంత పఱచెదరు?"

అని అతడు కోపముతోడను, అనుమానముతోడను అడిగెను.

"ఏమియు లేదు. చీకటి పడుచున్నది. కూడ నున్నది ఆడది. సాహస మెందులకు? మేము నీతోడి వారము. ఇక్కడ ఆగి భుజింపుడు" అని ఆ ఉదారు లడిగిరి. కాని అతని గర్వసముద్రమున వారి ఉదార వాక్కులు మునకవైచినవి. "నా భుజ బలమును ఎఱిగియే నే నరుగుచుంటిని. చీకటియా? అది శౌర్య వంతుని నేమియు చేయజాలదు. ఇంతవఱకు నాకు తగిన వా రెవరును దొరకలేదు" అని ప్రత్యుత్తరము.

"వాని కర్మము వానిది పోనిండు" అని గుంపు లోనుండి మెల్లగా నొక డనెను. ఆరాజపుత్రుడు దండ కత్తె యును తన సహచారిణితో త్రోవ బట్టెను.

౨

వారా పల్లెను వీడిరి. నిర్మానుష్యము. అంధకారావృతము. ఆ చీకటిని ఛేదించుకొని రాజ పుత్రుడు ముందరుగుచుండెను. సాయం పూజానంతర ఘంటాధ్వనులు దూరముననుండి వినవచ్చుచుండెను. దూరపు గుడిసెల నున్న దీపములు "మినుకు మినుకు" మనుచుండెను. చీకటిలో నొక దయ్యమును కనుగొన్నట్లు కుక్కలు మొఱుగసాగెను.

హఠాత్తుగా వారికి ఠింగు ఠింగు మను చిఱు మువ్వల ధ్వని వినబడెను. రాజపుత్రుడు దానిని లక్ష్యింపలేదు. ఆయువతి తిరిగి చూడకుండ నుండలేక పోయెను. చూచిన తోడనే ఆమె కాశ్చర్యానందములు గలుగ జేయుచు 'హానోవారగ్రామ'—మరి ఆయువ పుట్టిల్లు—"పోస్టల్ రన్నర్" అగపడెను. అతని నెత్తిన మూట యుండెను. చేత చిఱు మువ్వలు నినుప కోన యున్న కఱ్ఱను పుచ్చుకొని యుండెను. భుజమున చినిగిన ఒరలోనున్న కత్తి ఒకటి వ్రేలుచుండెను. జాటో— అతని నట్లు పిలిచెడివారు— విధిని క్రమబద్ధుడు; ఊరివారికి వారి బంధుగుల కడనుండి వచ్చు ఉత్తరముల తొందరగా నందజేయ వలెనని కాదు. అలసించిన జీతమున కోత. అంత, అతడు, రాజపుత్ర స్త్రీని కలసికొనెను. పరస్పర కుశల ప్రశ్నము లయినవి. పిదప తన తల్లి దండ్రుల క్షేమము నడిగినది. పుట్టిన మెట్టనుండి వచ్చిన నూతనుడుగూడ స్త్రీకి సోదర తుల్యుడు. కాన వారు మాటలాడుచు నడుచుండిరి.

వెనుకబడుచున్న భార్యను కనుగొని నాతడు వెనుకకు దిరిగెను.— అనుమానమున అదేమి! ఆమె నూతనునితో మాటలాడుచున్నది! సిగ్గు లేమి— ఆమెను కోపమున కొట్టి తిట్ట సాగెను.

"మఱి..... అతడు సోదర సమానుడు. పోస్టల్ రన్నరు. నాపుట్టిన ఊరగు హానో..." అని ఆమె గొణిగెను. 'నోరు మూసుకొనుము. నాకు తెలును' అని అతడు పలికి జాటో నిట్లు బెదిరించెను. ఇది ఎవరితోడనో తెలిసికొనుము"

"నీయిష్టము" అని పలికి జాటో వడి తగ్గించెను. వెనుబడెను. రాజపుత్రదంపతులు పోసాగిరి.

## 3

వా రరిగి ఒక యిరుకుపుంతను జేరుకొనిరి. పుంతకు రెండుప్రక్కల చొరవీలులేని ముళ్లపొదలు. అచ్చట చీకటి భీకరత్వమునకు సాయమొనగెను. ధైర్యమున రాజపుత్రుడు ముందునకు సాగెను. పుంత మధ్యను చేరుకొను సరికి పన్నిద్దరు చోరులు పొద నుండి వచ్చి రాజపుత్రునితో "కత్తి క్రిందనుంచుము" మనిరి. రాజపుత్రుడు కోపమున వారిని తిట్టెను. అతడు చేయగలిగిన దంతియె. దొంగలు కత్తిని లాగుకొనిరి. దూరమునకు గొనిపోయి కాలుసేతుల గట్టి వైచిరి.

"నీనగలను తీసి ఇమ్ము" అని ఆ యువ నడిగిరి. ఒకటొకటిగా ఆమె నగలను తీయజొచ్చెను. సుందర తరములగు ఆరమణీమణి శరీర భాగములు వారికి కనవజొచ్చినవి. యౌవన ప్రోజ్జ్వలము ఆయువ సౌందర్య మాతమమును భేదించెను. వారి మనస్సులు వివశములయినవి. వదర జొచ్చిరి. ఒక అడుగు ముందరకు వైచి రామెను ముట్టి. ఆమె నిగ్రహించి ధైర్యమున నిలబడెను.

"దానిని........."అని వా రరచిరి.

ఆమె నిస్సహాయురాలు. వస్త్రముద్రితనభమున దనవిలోకనముల బరపెను. సాయ మపేక్షించుచున్న ఆమె కానందము కలుగ జాటో మువ్వల సవ్వడి— "జాటో సాయము సాయము"అని ఆయువ అరచెను. "ఎవరు" అనుచు ఒర తీసిన కత్తితో జాటో ప్రవేశించెను. వారి ప్రయత్నమునకు భంగము వాటిల్లినది. కఱ్ఱలను దొంగలు ప్రయోగించిరి. వారిని కత్తి త్రిప్పుచు ఎదుర్కొనెను జాటో. సాహసము! అత డొక్కడు! వారిలో కొందరిని మట్టు పెట్టెను. దెబ్బలు నెత్తిన పడుచుండెను. కాని వాని నతడు లక్ష్యించుట లేదు. ఆమె బిగ్గరగా నరవజొచ్చెను. ప్రాణభయమున మిగిలినవారు పాఱ జొచ్చిరి. జాటో అలసిపోయెను. భరింపరాని బాధ. అతడు నేల గూలెను. ప్రాణము లాతని వీడెను.

ఆయువ తనభర్తను బంధమునుండి విడిపించెను. "అరుగుదము రమ్ము" అని ఆత డనెను.

"ఎక్కడకు, పిరికిపందా! సిగ్గులేదా? అతడు ఒక నిమేష మాత్ర పరిచయమునకే నాకొఱకు ప్రాణత్యాగ మొనర్చినాడు. నీవో— నాభర్తవు— నీ

ప్రాణ రక్షణయే చూచుకొంటివి. రాజపుత్రా! పొమ్ము. కాకికిని అంచకును సఖ్యమా? నా రక్షకుని నే ననుగమించెదను." ఈమాటల నామె కాదు పలి నది. చలించిన ఆయమ హృదంతరము.

"నీకంటె అందకత్తె యగు తరుణిని పెండ్లి యాడెదను" అని వివేక హీనుడగు ఆరాజపుత్రుడు పలికి కటికచీకటిలో నొంటిగ ఆమెను వీడి యేగెను.

ఆరాత్రి అంతయు, ఒంటిగా ఆనిర్జన ప్రదేశమున గూర్చుండి జాటోతల తొడ నిడికొని కడపెను. ఉదయ మగుటతోడనే చితి నొకదానిని తయారు చేసి జాటోనిడి ప్రక్కన తాను పరుండెను. ప్రాయంకాల మగు సరికి ఏమియు మిగులలేదు. బూడిదయు కణకణ లాడు నిప్పులును.

* * * * *

ఇప్పటికిగూడ, జాటో, ఒకస్త్రీ మానసంరక్షణ సేయ ప్రాణముల కోల్పోయిన ప్రదేశమున, కృతజ్ఞతాసూచకముగా ఆయమ తన జీవితమును మానరక్షకుని కర్పించిన ప్రదేశమున, జాటో స్మృతికి చిహ్నముగా నొక రాతికట్టడమును, ఆతరుణీమణి స్మృతికి చిహ్నముగా నొక రాతితో చెక్కబడిన చేయియును నిలచియున్నవి.

—సౌరాష్ట్రదేశీయకథానువాదము.

# వసంతాలాట

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి.ఏ.బి.ఎల్.,

నాతో వసంతంబు
లాడెనే, సీత,
నాతో వసంతంబు
లాడెనే॥
చిన్ని చేతులలోన
గిన్నె నొక్కటి పూని
లేతచూపులతోడ
నాతో వసంతంబు। నాతో వసంతంబు॥
కంటె కాసులపేరు
ఘల్లుఘలుమనుచుండ
చేతుల విసరుచు
నాతో వసంతంబు ॥నాతో॥
మధుపర్కము రైక
మరి మరి తడియుంగ
నగవు మోమున నిల్పి
నాతో వసంతంబు ॥నాతో॥
వలపు చెక్కుల పైని
పడిన బిందువు లూర్చి
నడుము బిగించుచు
నాతో వసంతంబు॥ నాతో॥
ఎరుపు వలువల తోడ
నరుణరాగము జల్లు
నూతన రవి వోలె
నాతో వసంతంబు ॥నాతో॥
వసంత మెగయంగ
వలపు పెరుబుకంగ
చేతితో, మనసుతో,
నాతో వసంతంబు॥ నాతో॥

# సిరిమరపు

శ్రీమతి పాకల చంద్రకాంతామణిగారు

పిల్లలందఱును గలిసి చిలిపిజాలను, చిల్లపెంకులను బెట్టి బొమ్మపెండ్లి చేయుచుండిరి. అలంకృతములయిన కొటియాకులబొమ్మల నొకచో నుంచి పెండ్లివారందఱును భోజనములకొఱకు చిక్కుడాకులయందా జాలను, పెంకులను బెట్టి వడ్డనలుచేయుచుండిరి. వట్టివట్టినీళ్ళతో వారందఱు గాలుసేతులు గడిగికొని పంక్తులు దీరి భోజనమునకు గూరుచుండిరి.

వియ్యపువారలతో వికటములాడుచు, వికావికానవ్వుచు వారుత్సాహముతోనుండ నందులో నొక్కబాలిక "ఈగారె బాగుగ వేగలే"దని యొకచిల్లపెంకును నోటవైచికొని నమలజొచ్చెను.

ఇంతవఱకు బాలికలకు గానరాకుండ గవాక్షమునుండి చూచుచున్న రాజారావు తనకొమరిత చిల్లపెంకు నమలుచున్నదికదా అని పరుగున వచ్చి ఆబాలిక నెత్తి చిల్లపెంకు నుమియునట్లు జేసి నోటిని బాగుగగడిగి "అమ్మాయీ! ఆటలోని గారెలను నోటిలో వేసికొనదగునా?" అని మందలించెను. ఆట ముగిసిపోయెను.

అసత్యములగు నాహారపదార్థములతో వారందఱు విందు నారగించుచున్నప్పుడు తాను వారి కంటబడిన వారివినోదమునకు భంగము కలుగవచ్చునని రాజారావు చాటుననే యుండి చూచుచుండెను. చిన్నబాలిక చిల్లపెంకును నమలుచున్నప్పుడీ యసత్యజనితవినోద మపాయకరముగ గానవచ్చెను. తోడనే యాతండ్రి పరుగున వచ్చి బాలికను గాపాడ నెంచెను.

ఓజగజ్జనకా! మానవు లసత్యములగు సంపదలతో నీబాలకులవలెనే వినోదించుచుందురుగదా! వారి వినోదమునకు భంగము నేలకలిగింపవలయునను నుద్దేశమునన, నీవానంపన్నులమనములకు గానరావు. నీయునికిని వారీసమయములలో సంపూర్ణముగ మరచిపోదురనుట వారినేరమా? నీవిలాసమా?

ఐశ్వర్యమదోన్మత్తులయి ప్రజలు ప్రవర్తించుచు నాపదలబడియుండు సమయముల నోదయామయా! నీవును, రాజారావువలె పరుగునవచ్చి కాపాడుదువు కదా! ఎంతసుకృతము!

లేకున్న చిలిపిజాలవంటి ఈసంపదలే సంతోషప్రదములని యనుకొనుచు సిరిమరపున నిన్ను విస్మరించు నీయజ్ఞానప్రపంచమంతయు నాపత్కూపంబున బడి యుడుగంటవలసినదియేకదా!

ఆటయందలి సంపద లాత్మానుభవమునకు బనికిరావని మందలింతువా?

# సౌందర్యపోషణ

డాక్టరు వా. మల్లిఖార్జునగారు

ప్రకృతి మహా సౌందర్యవతికదా! మనము ప్రకృతిచే బుట్టి ప్రకృతిచే నావరింపబడి ప్రకృతి యొడిలో జోలలాడింపబడుచు, ప్రకృతికి లోనై యున్న సౌందర్యమును తల్లినడిగియే కనుగొనకుంటిమే? ప్రకృతి - మాత - మహాద్భుత శక్తి, తనబిడ్డలకు తన గుట్టులలో నొక గుట్టగు సౌందర్యమును విప్పిచూపక నింకెరికి జూపును! తల్లియిచ్చుయాజ్ఞల ననుసరించు పుత్రునందే గదా తల్లి కెక్కువ ప్రేమ. ఓహో! ప్రకృతి తన నియమమములు పాటించమనియూ చెప్పునది. ఏది తల్లీ, ఒక్కపరి నీహృదయమును విప్పి సౌందర్యమునకై పరితపించు యువతులకు జూపింపుము. మన యాంతర్యమందున అంతర్యామియై విచిత్రచర్యల గల్గియున్న శక్తికి అనగా ప్రకృతిలో దాగి ప్రకృతియైన సర్వప్రపంచమును తానై తనశక్తితో నడిపించుచున్న శక్తికి—జయము చెల్లియు. హిందూయువతీమతల్లులారా! ఎన్నడేని మీామృదువైన నోటనుండి "శక్తి లేదు. చేతగాదు" అని యుచ్చరింపకుడు. అది పిరికితనము. అది నిశ్చయముగా అపజయమును ఆపాదించును. "చేయగల్గుదు - చేయగల్గుదుగాదు_చేతును. జయము గొందు. శక్తికి మించినది లేదు" అని ప్రతికార్యము చేయబోవునపుడు ఉచ్చరింపుడు. దృఢనమ్మకమే శక్తి. అట్టి నమ్మకయూ శక్తితోడనే సావిత్రి తన భర్తను తిరిగి బ్రతికించుకొనగల్గెను. మహాశక్తియా ప్రకృతికి నీవు లోబడక అట్టిశక్తిని లోబఱచుక అందలి యానందము గ్రోలుము. ఇటు సల్పునెడ నీ జీవితము మహాతేజస్సుతో నిండి నీ వెనుక యాత్మ ప్రతిబింబమును నిలిపియుంచును. స్త్రీలు గోరునది మిక్కుటముగ సౌందర్యమే కదా! ప్రకృతి తన నియమము పాటించిన తనతోగూడిన తేజస్సగు సౌందర్యమును ప్రసాదింతునని చెప్పుచున్నది. అది యెద్దియో చూతము— సౌందర్యము మానవనిర్మితమగు ధనమువల్ల తన హృదయమును బయలుపెట్టునది కాదు. ధనముచే బొందిన సౌందర్యము మొగ్గవలె నుండును. ప్రకృతిని లోబఱచుక నిరాడంబరముగా బొందిన సౌందర్యము చిఱునవ్వుల చిమ్ముచు వికసించిన పుష్పరాజమై తేజస్సుతో గూడియుండును. సౌందర్యము

ప్రకృతియొక్క హృదయము. ఆరోగ్యమే మహాభాగ్యము. సక్రమజీవితమే బారుగల జీవితమిచ్చును. స్త్రీ రజస్వలయగువఱకు అవయవములన్నియు తమస్థానముల దృఢపఱచుకొనును. అటుతరువాత నలుబదియేండ్లపర్యంతము సౌందర్యవతియై యుండును. తరువాత స్త్రీచర్మము ఆరోగ్యనియమముల సరిగ పాటింపమిచే ముడుతలుపడియుండును. ఇక్కాలమునను ప్రకృతి నియమముల బాటించిన నవసౌందర్యము గలుగునని కొందఱియభిప్రాయము. సౌందర్యమునకు ముఖము ప్రధానము. ఎట్టి సౌందర్య మేముఖమునం దుండును? మోము— మనసులోని యాలోచనల ప్రతిబింబమైయున్నది. ఆలోచన పవిత్రమై సంతోష - ఉల్లాస- ఉత్సాహదాయకంబైనచో, ముఖము తేజస్సుతో ప్రకృతి సౌందర్యమునే వెక్కిరింప సాహసించును. భూతకాలమునంతయు మఱచి నిన్నటి యాశల పోనాడి నూత్నయాశతో రేపటి దినమున ఆధారపడుచునున్న మనస్సు స్ఫటికసమానమై హృదయమున నెట్టి చింతల కలతల జొరనీయబోదు. ఎల్లకాలము తృప్తితోఁగూడిన మనస్సుతో నుండిన మనుజునకు ప్రతి దినము పండుగయే. ఇట్టి మధురతరమైన నియమములు సౌందర్యమునకు మూలాధారములు. సౌందర్య మెప్పుడును ఆరోగ్యమును ఊతగాఁగొనియుండును. ఆరోగ్యము నశించిన సౌందర్యము క్రమేణ నశించును. ఆరోగ్యకరమైన ఆత్మ - మనసు - శరీరమునుండియే తేజోవంతమైన సౌందర్యమంకురించుచున్నది. వ్యాధి కురూపితనము; ఆరోగ్యము అందము. మన శరీరములు తోటలుగాఁగ ఇచ్ఛలు తోటకాపరులై యుండవలెను. మనము ప్రతి రోజు గ్రహించు ఆహారపానీయములమీఁదనే మన యారోగ్యసౌందర్యము లాధారపడియుండును. ఆహార గుణములబట్టియే మన శరీరముల స్థితి యుండునని శంకరాచార్య, రామానుజులు సైతము వ్రాక్రుచ్చియున్నారు. తేలిక యాహారము మనోభారమును తగ్గించి మనసును తేలికగా నుంచును. సౌందర్యమునకు చర్మము నునుపు మెఱుపు, లోకమెట్టు. చర్మమున అనేక సూక్ష్మరంధ్రము లుండును. శరీరమందలి చెడు నీరంతయు యీరంధ్రములద్వారా ప్రవహించి పోవలెను. అవయవములకు తగిన పనిని కల్పించిననేగాని యిట్టికార్యము కానేరదు. చెడునీరు వెడలిన చర్మము ప్రకాశమానమైయుండును. ఇటుల జరుపకున్న శరీరము సౌందర్యమును గోల్పోవును. వ్యాకులత, శీతగాలి, ఎక్కువ వ్యాయామము, బద్ధకము,కోపము, అసూయ, ఎక్కువ వేడిగాలి మొదలైనవి చర్మమును పాలిపోవునట్లుగాను, అనేక రంగులుగాను, వికారముగాను మార్చును. అజీర్ణకర వస్తువులను వర్జింపవలెను. లేకున్న చర్మము మొద్దువారును. టీ, కాఫీలను ముఖ్యముగా మానవలెను. టీ అజీర్ణమును, కాఫీ చర్మమును పాలిపోవునట్లుగాను జేయును. ఇక్కాలమున యువతులు టీ, కాఫీలుద్రావుట నవనాగరకమని భ్రాంతిపోవుచున్నారు. టీ, కాఫీ, నల్లమందు'మత్తు పానీయములు, ఆకుబీడీలు, పొగద్రాగుడులు నివియన్నియు శరీర సౌందర్యమును పీల్చుటయేగాక శరీరమును రోగముల కుటీరముగా మార్చివైచును. ఇందుగూర్చి చెప్ప నిది సమయము గాదు. ఎవరైతే ప్రకాశ

మానులై, తేజోవంతులై చర్మమును శుభ్రముగా గలిగియుండి మంచి రక్తకండరముల గల్గి చిన్న ఎముకల గల్గినవారు వ్యాధులచే ఎక్కువగా పీడింపబడరు.

ఆహారము:—ఫలములు తినుట చాల శ్రేయోదాయకము.

చర్మము చక్కగా నుండగలందులకు:— స్నానము; శుభ్రమౌ గాలిని పూర్తిగా బీల్చుట: ప్రతిదినము వ్యాయామమునుదీసికొనుట. మంటలకడ నెక్కువగాకూర్చుండవలదు. సాధారణముగా సబ్బులను వాడుట మంచిదికాదు. సబ్బులలో ఎక్కువ వాసన, ఎక్కువ కాంతి గలవంత మంచివి కావు. వీటిలో గ్లిజరిన్, కర్డు మొదలైనవి కొంతవఱకు మంచివి. లైంజ్యూస్, గ్లిజరిన్ గలిపి స్నానముజేసిన తరువాత చర్మమునకు రుద్దిన చర్మము నును పుగా నుండగలదు.

# నిరీక్షణ

జనమంచి రామేశ్వరమ్మ గారు

నీహాసితసిత వదనంబుశోభకై
విశ్వమోహన లోచనుడనై
వెదకివచ్చినపథము లెవియో
స్మృతిని మెరసినవి.
ప్రేమతలపులు స్మృతికి రాగా
ఉరులు కన్నీ రొలికిపోగా
కలకదేరిన కన్నుగవతో
నిలచితిని నేను.
తొగరుపువ్వుల సౌరభములో
మెరుపుకన్నెల కులుకుసడిలో
గంజుకోయిల ఈల'గో'లో
నీరాకయే తోచెన్.
ఇరులు రేగిన రేయి ఛాయను
గొంతు కొసరిన విరహగీతిలో
వేచియుంటిని సఖి! నీకొరకే!
నీకొరకే! హారతెత్తిన ఎడదతో.
నాపాటసందడి అడగిపోయెను
నానిరీక్షణ కూర్కుపొందెను
వెక్కవడ్చిన బిడ్డ పగిదిని.—
ప్రకృతియంత సుషుప్తి పొందెను.

చంద్రవంకయు సన్నగిల్లెను
ఘూకమెచటో వంతనేడ్చెను
కూర్కుపొందని ఎడద నాలో
భీకరముగా కలవరించెను.
మలయకొమరుని సౌరభములూ
మాటిమాటికి కూయుకోయిల
నీస్వప్నస్నాపిత పెన్నెరులెదై
నన్ను స్పృశియించెన్.
అంత దిగ్గున మేలు కాంచితి
విసువునొందితి విరతిచెందితి
కలయజూచిన కన్నుగవలో
బాష్పములు నిలిచెన్.
పొఁకుపుములపయి కెంపులొలికెను
గండుకోయిల గొంతుకెత్తెను
చిమ్మచీకటి మాపుచీల్చుకు
కమ్మతావుల రేపివచ్చెను.
విరతిచెందిన నిరీక్షణలో
కలతనిద్దురకన్నుగవతో
నివాళుంచిన ఎడదతోనే
నిలచితిని నేను.

# స్త్రీలకు ఋషులిచ్చిన హక్కులు:మధ్యవారలు మార్చినవి

బం॥ మల్లయ్యశాస్త్రిగారు

స్త్రీల విషయమున ధర్మశాస్త్రములలోను ఆచారమందును వ్యవహారమందును ప్రాయశ్చిత్త విషయమునను మధ్యనున్న నేకమార్పులు పురుషుల స్వార్థపరత్వమువల్ల గలిగినవనుటకు జాల నిదర్శనములుగలవు. అవన్నియు నొక్క వ్యాసమున జూపుట దుర్ఘటము. కావున క్రమక్రమమున వేఱు వేఱు వ్యాసములలో జూపబడును.

అందు ముఖ్యమయినది ఉపనయము. ఇవన్నిటిలో నేల ముఖ్యమంటే. ఉపనయము ఎందుకంటే విద్య జదువుకొనుటకు. విద్యయంటే పూర్వము వేదమే. జ్ఞానము నభివృద్ధిపఱచునట్టి విద్యాధికారమే లేనపుడు పశు సమానులుగా నుంచుటకే యుపనయనము తీసివేయుట కుద్దేశము. పూర్వము స్త్రీల కుపనయనమున్నట్లు "పురాకల్పేతు నారీణాం మౌంజీబంధనమిష్యతే "అధ్యాపనంచ వేదానాం సావిత్రీ వచనంతథా". వేదములు చదువుట గాయత్రీ జపము పూర్వకాలమున స్త్రీలకుగూడ గలవు. ఇచట "కల్ప" అనుపదమునకు "సృష్టి"యని అర్థము చెప్పి యీసృష్టిలోకాదు పూర్వసృష్టిలో స్త్రీల కుపనయనముండేది. ఇప్పటి సృష్టిలో లేదని కొందఱు మోస గాండ్రు అర్థములు వ్రాసినారు. అది శుద్ధతప్పు. గ్రంథములలో నన్ని విషయములును ఈసృష్టిలోనివేయయి యుండగా నీయొక్క యుపనయనము మాత్రము పూర్వ సృష్టిలోనిదిపుడు చెప్పవలసి జరుగుటేమి? పురాకల్పము అనగా ఈసృష్టిలోనే కొంతకాలము ఆచారములోనుండి ప్రస్తుతము ఆచారములోనుండి పోయినది యను విషయమునకు చేరు. మఱియు పూర్వకాలమున ననియే యర్థము. ఆపూర్వకాలము ఈసృష్టిలోనిదే యని కూడ తెలియవలెను. ఇందుకు మనుస్మృతిలో 9 అధ్యా. "ద్యూతమేతత్పురాకల్పే దృష్టం వైరకరం మహత్" ఇత్యాది శ్లోకములో జూదము పూర్వము చాల వైరమును గలిగించినది. ధర్మరాజు అందువల్లనే చెడినాడు అని భారత కథను టంకించుట జూడగా పురాకల్పశబ్దమున కర్థము ఈసృష్టిలో పూర్వకాలమనక తప్పదు. భారత యుద్ధ మీకల్పమునందే పూర్వయుగమున గలదు.

గోభిల గృహ్య సూత్రమున "ప్రావృతాంయజ్ఞోపవీతినీం అభ్యుదానయన్"ఇత్యాదిగా బ్రహ్మసూత్రము కలట్లున్న వేదము చెప్పవలెననిన్నియున్నది. దానికి ఆచారమునుబట్టి రెండువందల యేండ్ల క్రిందటి పండితుడు "యజ్ఞోపవీతమంటే జందెమని యిచట అర్థముకాదు. జందెమువలె వస్త్రమునే పయ్యెదగా ధరించునది యని యర్థము" అని వ్రాసినాడు. కాలానికితగినట్లు వ్యాఖ్యానములు వ్రాయువారె చాలమంది వ్యాఖ్యాతలు. అసలు గ్రంథ తాత్పర్యమును జూపువారుకారు. అట్లుపనయము ఎనిమిదవయేటనే చేసి జ్ఞానులే చదువు చెప్పుదురు అనగా పుట్టింటివారే. "ప్రాప్తొరజసస్సమావర్తనం" రజస్వల కాగానే స్నాతకము చేయవలెను. స్త్రీలకు గూడ స్నాతకమున్నది. ఉపనయనము లేనపుడు స్నాతకముండదు. ఆశ్వలాయన గృహ్యసూత్రమందు స్నాతకమున చందన సంస్కారము చెప్పుచు "ఆయాయీవర్ణములవారు ఆయాయీయుపయనములకు ముందుగా సంస్కరించవలయును" అనుచోట స్త్రీలు ఫలానా అంగమున చందనము సంస్కరించుకొనవలెను అని స్నాతక విషయమున చెప్పబడియుండుట నేజెప్పినదానికి నిదర్శనం. ఉపనయనము లేనివారు ద్విజులుగారుకదా. ఇప్పటి స్త్రీలందఱు శూద్రస్త్రీలే యనవలెను. వారి సంతానము శూద్రులే కావలెను.

ఇందుమీద కొందఱందఱు; "ఉపనయనము లేకపోయినా వివాహములో స్త్రీలకు ద్విజత్వము వచ్చిన దని. నేనంటాను; శూద్రులకు కడజాతివారికి గూడ వివాహము కలదు; కావున వారికిని ద్విజత్వము కల దందురా అని.

రామాయణములో—సుందరకాండ 14 వ సర్గలో

శ్లో॥ సంధ్యాకాలమనాశ్శ్యామా ధ్రువమేష్యతి జానకీ
నదీంచేమాం శివజలాం। సంధ్యార్థే వరవర్ణినీ॥

అని "సీత సంధ్యావందనమున కిపుడు ఈనదికి రావచ్చును" అని హనుమాను దూహించెను. ఉపనయన మేలేకుంటే సంధ్యావందన మెట్లు? ఇప్పటి స్త్రీలు సంధ్యావందనము చేయలేదుగా!

పరాశరమాధవీయ వివాహ ప్రకరణమున ఈహారీతుడు చెప్పిన "పురాకల్పే"యన్న వచన మెత్తుకొని "సద్యోవధూనాముపస్థితే వివాహేయథాకథంచిదుపనయనం కృత్వాకుర్వంతి" అన్నాడు. "వివాహకాలము నందు ఏదో యొకలాగున నుపనయము చేసి వివాహము చేయుచున్నారు." అని తనకాలమునగూడ (ఏడువందల యేళ్ల క్రింద) ఏకో ఉపనయనవిధాన మున్నట్లు చెప్పినాడు.

ఇపుడు రానురాను అదీ కనబడదు. ఇప్పటికి గూడ ఉత్కళ బ్రాహ్మణులలో వివాహమునకు ముందు వరుని ప్రాతజంద్యము వధువుకు వేయుట ఆచారముగా నున్నది. ఆవేసిన జంద్యము పెళ్లి నాకబలియయ్యేవఱ కుండును. తరువాత తీసివేయుదురు.

మన ఆంధ్రులలో దారమునకు పుస్తెగట్టి మెడలో వ్రేలగట్టుచున్నారు. వివాహవిధులల్లో పుస్తెకట్టు మని విధిలేదు. కావున నది యుపనయనమని యెవరికీ తెలియకుండ సూత్రము మాత్రము ధరింపించి కర్మాధి కారము కలుగజేసినారేమో యని యూహింపవచ్చును. ఇది ఫలావాదానికని తెలియనందున శూద్రులు కూడ నిది వివాహవిధి యనుకొని యారంభించియుందురు. ఉత్కళ బ్రాహ్మణులలో పుస్తె కట్టుట లేనేలేదు.

• కావున స్త్రీలకు వేదోక్తమయిన ఉపనయనము చేసిలే వివాహము కాకుండ రజస్వలయయినను అసంస్కృత రజస్వలాదోషము రాదు. అట్లనిపోతారని బాలికా వివాహావశ్యకత కొఱకు ఉపనయనము మానివేసినారు అని నాతాత్పర్యము.

## శ్రీ ముఖా!

శిరోమణి వారణాశి గంగాధర శాస్త్రి గారు

శ్రీ నెదఁ దాల్చి, వైభవవిశేష సమన్వితుఁ డయ్యె విష్ణు, వా
శ్రీని గళంబునందున ధరించి దిగంబరుఁ డయ్యె శంభుఁ డీ
పై నిను గన్గొనన్వలె, విభాసుర వక్త్ర ముఖపద్మమందుఁ ద
చ్ఛ్రీని ధరించి తెల్లు దయసేయునొ నీకు శుభంబు శ్రీముఖా!
శ్రీముఖ మాచు నేది విలసిల్లెఁడు, నయ్యది యుత్తమోత్తమం
బై, మహి మించునంచు బుధవర్యులు ప్రస్తుతి సేతు రెంతయుఁ
శ్రీముఖ! ఈవు కేవలము శ్రీముఖవే మటికాక యా పరం
ధాముని సత్కృపక్ మొదల మధ్యఁ దుదక్ సిరి గల్గి వెల్గుమా!
శ్రీముఖ! లోకులకధికా
యుర్ముఖ సౌఖ్యముల నొసగుచుండుము సతముఁ
గోముఖవ్యాఘ్ర మ్మనిమోడి
నామము బడయకుము ప్రజలు నగుదురు నిన్నున్.

# అతడు—ఆమె

అతడు విచారంతో నేలవంక చూస్తూ కూర్చొన్నాడు.

ఆమె లోపలినుంచి బయటికి వస్తూ వివర్ణుడైన అతణ్ణి చూసి నిర్ఘాంత పోయి తలుపుప్రక్కగా నిలుచున్నది.

అతని ముఖమండలము విషాదావృతమైంది. ఉష్ణములైన రెండు కన్నీటి బిందువులు నేత్రాంచలముల్లో చిప్పిలినవి. ఆమెహృదయము వీటిని చూడగానే తరుక్కుపోయింది. చీరెచెంగును నోటిలోకొరుకుతూ వెనుకభాగానికి వచ్చి తన మృదుపాణియుగ్మంతో అతని దీర్ఘకేశాల్ని స్పృశించింది.

అతని ఊహాప్రవాహం ఆగిపోయినది. స్పర్శమాత్రాన వెనుకకు తిరిగాడు.

ఆమె విశాలనయనములు ఓర్పును శాంతిని ప్రకటిస్తూఉన్నవి. సౌందర్య రసస్ఫూర్జితమైన ఆసౌమ్యమూర్తి కళావిహీనమైనట్లు కనుపించినది.

అతని హృదయంలోనుంచి పొంగివచ్చే దుఃఖవాహినులు పైకి ఉబుకుతూయున్నవి. మనోవ్యథలను అణచుకోలేకపోయాడు.

ఆమెశీతల దృక్స్నానములను అతనిపై బరపింది.

అతని హృదయ కోలాహలము ఒక్కమారుగ మిన్ను ముట్టింది.

ఆమె చూపుల్లోని ఆదరణా, అనిర్వాచ్యానురాగమూ, అతని హృదయంలో ప్రవేశించినవి.

అతని మనస్సంక్షోభము శాంతించినది. హృదయోద్వేగము మంత్రించినట్లుగా స్తంభించిపోయినది.

ఆమెప్రకృతిదేవతోపాసకురాలివలె నిశ్చలంగా నిలచుని ఆపురుషమూర్తి వైపు మరల నొకసారి చూచింది.

అతడు వివర్ణుడైనాడు. ముఖబింబము పాలిపోయింది. నేత్రకాసారములలో బాష్పము లుబుకుతూ ఉన్నవి.

——ఆమె ఆర్తముతో అతని పాదాలమీద వ్రాలింది.— అతనికి ధైర్యంకూడ సడలిపోయింది. కంపితకరములతో ఆమెను లేవనెత్తి అధరచుంబనముతో నాశ్వాసించాడు. ఆయానందంలో వారు ఊపొంగారు.

ఒక సూక్ష్మజ్యోతిబహిర్గతమై వారి హృదయాలకు గాఢతరానురాగమూ, వారి ఆత్మలకు ఒక మహోత్కృష్ట పూజ్యభావమూ వ్యక్తీకరించినది.

—తుమ్మలపల్లి వేంకటసీతారామారావు

# అంబ

సీకిపి ఆంజనేయులు గారు

(రంగము: ఆదిశేషయ్య యింటిముంగిలి;
ప్రవేశము: భిక్షుణి-బిడ్డలతో చేతులు జోడించి)

శ్రీలు పెంపొంద, నగతికుల్ శ్రేయమంద,
భువి సురాపానవైరి నిర్మూలమంద,
నెందు దీనులా గేస్తు లానందమంద,
నంబ! సంతతి కభయభిక్షంబు నిమ్ము.

(ఆదిశేషయ్యభార్య యనంతమ్మ
లోపలనుండి వచ్చి, భిక్షుణి నుద్దేశించి)

ఎవ్వ రీయింటిముంగిలి నింత దైన్య
వృత్తిఁ గన్నీరు గార్చుచు, వేఁగుఁబోక
నిలిచి, చినిఁగిన మైలవల్వలను గట్టి,
యిట్లు కేల్మోడ్చి బిచ్చ మర్థించువారు?

భిక్షుణి

మఱచితే తల్లి నన్ను? నీమాతృభూమి
యంద తొల్దొల్తఁ బుట్టి, యందందుఁ దిరిగి,
యడవులను జీల్చి, యూళ్ల గుడుల నిల్పి
నట్టి యాది జాతికిఁ జెందినట్టిదాన.

అనంతమ్మ

అయినఁ జాల్పొమ్ము; నీరాఁక నంటుఁ బీడ;
నిన్నుఁ గన రోఁత, విన రోఁత నీచరిత్ర
మాటలాడంగ రోఁత, నీమత మెఱుంగఁ
దలఁచు టది పాతకముల నగ్గలము నెలఁత.

భిక్షుణి

ఏల నాతల్లి యిటులాడ? నెల్లతఱుల
మేలుకీడులలో మేము మిమ్ముఁ జుట్టి,
పనులఁ దోడ్పడునెడ రాని పాపమిపుడు
మాత్ర మెటులంటునమ్మ? యమ్మవుగదమ్మ!

అనంతమ్మ

కలిమి గలవారు దివ్యమూర్తులును నిలువఁ
దగిన యీచోట, నీపాడుమొగము చూప
వచ్చితివె? మేటిపెద్దమ్మ యచ్చుదోఁప
దుడ్డ! యెఱుఁగవా మాయింటి దొడ్డతనము?

భిక్షుణి

బిడ్డనగు నాకు మీయింటి దొడ్డతనముఁ
గలిమి గలవారి విలువయుఁ దెలియకున్నె?
దేహ మలయించు మావంటి దీనజనుల
చెమటచుక్కలె ప్రాపు మీసిరులకనుచు.

అనంతమ్మ (ఆగ్రహమునఁ దనలో-)

ఓరి! యియ్యది యింతగయ్యాళియగునె?
మాటమాటకు నిటు నూటిమాటలాడు

(ఇంటిలోనికిఁ జూచి)

ఎవ్వఁడుర లోన? వచ్చి యీయెమ్మెలాఁడి
వెంటనే గెంటు మావీథి నంటి దొరల.

భిక్షుణి (తనలో)

ఏలకో నంతుపై తల్లి కింత కినుక?
యవని నిజమాడ నిష్ఠురం బనెడుపల్కు
తథ్య;మిటనుండి నన్నుఁ ద్రోయఁదలఁచి యెవఁడో
వచ్చుచున్నాఁడు తప్పికోవలయు నింక.

(అటనుండి మరలును)

(ప్రవేశము: భటుఁడు. తనలో)

పడక వీడుటమొదల్ ప్రొద్దువడెడిదాఁక
నోలయుచుందురు తిరిపెగాండ్రొక్క రీతి.

(ముందునకు దృష్టిసారించి, బిడ్డలతో
బిరబిర బోవుచున్న బిత్తరిపైఁ జూడ్కి నిలిపి,
ప్రకాశముగా గంభీరధ్వనితో)

ఎవ్వరాగోల—!

(భిక్షురాలు తిరిగి చూచి, చనవునను
సంతసమునను మరలివచ్చును. భటుఁ
డామెను గుర్తించి, లజ్జతోఁ దనలో)

......అరెయ్యొ! నాయింతి! యెట్టి
భంగపాటహా! నాకుటుంబమున కొకట.

(భటుఁ డట నిలువనోపక విచారభారమున వెంటనే
లోనికిఁ బోవును. అనంతమ్మ యాశ్చర్య విషాద

కరుణార్ద్రదృష్టులతో భిక్షుణి వారసి)
రమ్మ నాతల్లి! వినుము సత్యమ్ము నాకు;
నెవ్వతెవు నీవు? నీదుపేరేమి? యిటకు
వచ్చినమనుష్యుఁ డేమి కావలయు నీకు?
దాఁపక వచింపుగాథ సాంతముగ నిప్డు.

భిక్షుణి (కన్నీరు తుడిచికొని-)
వందనము దేవి! నావింతచందమరయ
నక్కఱ జనించె మీకు; ధన్యాత్మ నేను;
ప్రజలు న'న్నంబ' యంద్రు; నాపల్లె యిద్ది;
వచ్చిపోయిన ఘనుఁడు నాప్రాణవిభుఁడు.
'అరయ లంకంత యిల్లు, బాగైన నడత,
కంచెయంత కాఁపురమును, గాటిపసులు
తవిలి తిన్నను దఱుగని ధాన్యరాశి,
యాత్మబాంధవకోటియు నతని కొసరు'.
అనుచుఁ దలపోసి తండ్రి యాతనికి నొసఁగె;
నాకృపామూర్తి నన్ను నవ్యాజకరుణఁ
గాంచె; మూఁడుపూవులు నాఱు కాయలగుచు
నింటఁ బాఁడియుఁ బంటయు నెసఁగఁ దొడఁగె.
అంతఁ దనివండఁబోక నాయనుఁగుభర్త
కోరి మీప్రాణవిభుకడఁ గొలువు సేరి
నిత్య మీఁదులు గీఁచెడు నియతివలన
నింపుమై నల్పె పానభూతంపుఁజెల్మి.
కాచె నాలుగుకాయలుగాని, మగఁడు
మానఁడయ్యెను త్రాగుడు; దానఁ దాను
గొనెడు కూలితో గృహవస్తుకోటిగూడఁ
బోయె; సంసారమును మొక్కమొలచిపోయె.
నాయొడలియందుఁ బెండిలినాఁడు తల్లి-
బందె, కమ్మలు, బుగడలు, బావురీలు,
సరిపెణయు, బండసరమును, చంద్రవంక,
ముంగఱయు, జోడుకడియాలు, నుంగరములు,
గట్టికుప్పెయు, నల్లలకట్లు, బిళ్ల,
సందిటికడెంబు, డాబును, సన్నతీఁగె,
మించు, లందెలు, పిల్లెండ్లు, మెట్టియలును
బెట్టెఁ, బుట్టింటిసొత్తంచుఁ బ్రేముడించి.
కూలి యెందును దొరకని వేళలందు
నొక్కటొక్కటిగ సొమ్ముల నొలిచి తెచ్చి
చేర్చె మీయిల్లు; పిల్లలు చెడిరి; కూడు
గుడ్డలకు మోమువాఁచి యెక్కుడుగ జనని!
పోయె గుణగౌరవంబును; పోయె నెనరు;
పోయె విశ్వాసగరిమయు; పోయెఁదాల్మి;
పోయె సాధువర్తనమును; పోయెఁగీర్తి;
పోయె సిరి; అంతదూరమైపోయె విభుఁడు.
ఆడికొనరాదు మగనికార్యములఁ గూర్చి
పడఁతి కిహలోకదైవము పతియ యగుట
నడఁచుకొనరాదు బుడుతల యారటంబు
వారు తండ్రిరూపొందినవార లగుట.
మూఁడునాళ్ళయ్యె ప్రొయిరాచ మొనయలేదు
కొంప-గింజలుఁ-బసువులుఁగూడఁ బోవ,
నిలువనీడయుఁ ద్రావ గంజియును లేక,
తిరిగివచ్చితి మెందు నాదరువు లేమి.
కంటివే తల్లి! పీఁపున కంటుకడుపు;
కరఁగిపోయినకన్ను; లాఁకటికిఁ జిక్కి—
తూలిపడు కాయముల నొప్పు బాలకులను
నెటుల భరియింతు? నింక నాకేదిదారి?

అనంతమ్మ (జాలియెడందను దనలో)
అకట! యెట్టి నిష్పచ్చరం బలమె నీమె
నెందఱు పురంధ్రు లీప్రోల నివ్విధమున
నమిత దారిద్ర్యజలధి దోఁగాడువారొ
ఘనసురాపాన భూత శోధనము వలన?
ఇట్టి ఘోరదుఃఖమ్ముల కిక్కయయిన
యాసవపిశాచము నడంప నాత్మవిభుని
నేఁ బ్రబోధింతు; భటుఁడిక నెప్డు మద్య
మంటకయయుండఁ గట్టడ యాచరింతు.

అనంతమ్మ (లోని కరిగి, కొంతపడికిఁ
దిరిగి వచ్చి యంబను జూచి)
సకియ! కొనుమిదె నీదుభూషల నొసంగు
దాన, గృహమును బశువులు ధాన్యరాశి
యన్నియును నీక ప్రాప్తించు; నార్తివలదు;
కడచె నడ లిఁకఁ గనుమేలుఁ గాంచఁగలవు.
(సొమ్ము లిచ్చును. అంబ కృతజ్ఞతతోఁ
బుచ్చుకొనును.) అనంతమ్మ.
తన్వి! నీకోరు నభయప్రదానభిక్ష
కొనుము; జనహితమునకుఁగా యనుఁగునాథుఁ
డెట్టి మద్యవిక్రయముఁ జేఁ బట్టబోఁడు;
అరుగు మిఁక నీదుపతి సుర నంటఁబోఁడు
(అనంతమ్మ లోనికిఁబోవును.)
అంబ (నయనముల నానందవారి కురియఁ దనలో)
మద్యపాన పిశాచంబు మాయుఁగాక
సిరులు నింటింటఁ గరము భాసిల్లుఁగాక
ధర్మవత్సలతను రాజు తనరుఁగాక
భరతమాత సుఖోన్నతిఁ బ్రబలుఁగాక.

---

# మాయామూర్తి

రాళ్లబండి సత్యనారాయణగారు

ఆకాశసౌధాన్కి అంతరంగంలో గవాక్షం తెరుచుకు కూర్చున్నాను. నాకేమి తోచలే. ఆనందగీతాలనేకం పాడుకుంటూ వాహ్యాళికై బయలుదేరి ఊరిబయట కానన మొకటి ప్రవేశించాను. అనిలుని గిలిగింతల కలగి చలించి పుష్పపల్లవ సముదాయమంతా స్వాగతమొసగినాయి. రానురాను నట్టడవి ప్రవేశించాను. ఇంతలోకే యిరులు క్రమ్మాయి. ఏదో భీకరనాదం వినిపించింది. కాని కొంతసేపటికి కాధ్వని ఉపశమించింది. సుందరమైన తేజోమూర్త్యొకరుక నాయెదుట ప్రత్యక్షమైంది. పూర్వపుస్మృతి చిహ్నాలు కొంచెము పరిచయ మున్నట్టు తెలిపాయి. ఎవరా అని ఆలోచించాను. నాకేమి తెలియలా. ఎవరో అని పల్కరించి చూశాను. ఇలాగే సంభాషణ ప్రారంభించాము.

నీ వెవరు?

నేనొక యబలను.

ఎక్కడనుండి వస్తున్నావు?

(మౌనం)

ఎక్కడకుపోతున్నావు?

(మౌనం)

ఎక్కడుంటావు?

లోకమంతాను.

ఏమిచేస్తుంటావు?

దృగసహ్యమగు భీకరచూడ్కుల మానవుని కంపీభూత మొనరించుచుంటాను.

మానవునికి నీకు ఏమిబాంధవ్యం?

నాకుటుంబంలో మానవుడు పెద్దవాడు. అతన్ని చూస్తే నాకు క్షణం కోపం. క్షణం ప్రేమ. క్షణం ఈర్ష్య.

ఎందుకని ?

మానవుని చూస్తే నాకు కోపం. అతడు నావాడయ్యు న న్నపనిందపాలు చేశాడు. పూర్వం నాకుటుంబాని కెప్పుడూ లేమిఅంటే తెలియదు. జబ్బుఅనేదుండేది కాదు. అంతా అన్నదమ్ములకంటె నెక్కువ మైత్రితోనుండే వాళ్లం. ఈర్ష్యంటే తెలియదు. అన్యాయంగా అట్టిదాన్ని మానవుడు పాడుచేశాడు. నే నవస్థపడి నిర్మించిన రాజ్యమంతా స్వలాభం

కోసం శిథిలీకృతం చేస్తున్నాడు......... యింతగా అబలనైన నన్నవస్థపెట్టిన మానవునికి నిజంగా నా ఉసురు తగులకపోదు.

మళ్లా అతన్ని చూస్తే నాకమితమగు ప్రేమ. అతడు నాపుత్రులలోనొకడు. నేనతని మాతను. ఇది సహజమగు మాతృప్రేమ.

యితన్ని చూస్తే నాకొకవిధమైన ఈర్ష్య. నన్ను నెమ్మదిగా జయింప సాహసించి కొంత వరకు సాధించాడు. దీన్ని చూస్తె నాకతి ఈర్ష్య.

అట్లయిన మానవునికి నీమీద ప్రేమ లేదా?

ఉన్నది. అది కుటిలప్రేమ. దొంగ దొంగచూపులతో నన్ను ప్రేమిస్తూవుంటాడు. నన్ను తెలుసుకోనలేని-చోటల్లా పొగడుతాడు. ఇదంతా పైపైమెరుగు. అంతరంగాన్ని నేనేమాత్రం చిక్కినా హస్తసంగతమైన రేగుపండుచేద్దామని అతనిఅభిప్రాయం.

ఇంతా చూడగా నాకీపడతి ఎవరో పరమయోగ్యమైన మహానుభావురాలుగా కనిపించింది. నా తెలివితక్కువ నే గుర్తించాను. ఆలోచించగానాలోనాకు నేహ్యమనిపించింది. చెప్పుకోటానికిసిగ్గు. మరలమాట్లాడించాను. జవాబు లేదు. ఇలా పావుగంట అనిమిషత్వమంతా ఉపయోగించి చూచా నామహాత్మురాలిని. తనివితీరలా ........
....................................

హృదయవీథిని కారుమబ్బులుక్రమ్మాయి. నామనస్సు నాకు తెలియలా. ఉన్నవాణ్ణున్నట్లె స్తంభీభూతమైపోయినాను. ఏదో భీకర ధ్వని వినిపించింది. శ్రవణాల్ని బధిరీకృతంగా చేసింది. గుండె గుభిల్లుమన్నది. "తల్లీ" అని కేకేశాను. కాని నాకెవరూ కనబడలా. చీకటిపోయింది. బాలభాస్కరప్రభావాన్ని వెదజల్లుతోంది ప్రాగ్దిశ. ఈ ప్రభావంలో లీనమైవెళ్లిపోయిందేమో అని నాకనుమానం ఆమెనుగురించి. ఎటులయినను మాయమైపోయింది. ఆమె మాయామూర్తి.

# సింహగడము

అ. ల. నరసింహంగారు, బి.ఏ.

అవలిదూరాన కన్పించు నదియె సింహ
గడము; నీప్రభ మంటిలో గలిసెకొక్కొ?
ఆకులెల్లను దుల్లిన యడవి మ్రాని
విధము శూన్యశోభల వలపింతె యిపుడు.
బహుళతరంగారవ కలితమై భయంక
ర స్వరూపప్రదర్శన రామణీయ
త కనులు మిఱుమిట్లు గొలిపి ధన్యచరిత
నైయపుడె యడంగితె చరిత్రాంతమందు ?
ఆ శివాజిపంపున నేగి యల్పప్రాణి
బలి యొసంగిన తానాజి కల బలంబు

పురిగొలుపునాదమే శ్రోత్రపుటములందు
ధ్వనులు ప్రతియొసంగుట యింకనణగలేదు.
అరయ సంద్రమందు మహీధరాగ్రమనగ
నిపుడు వాయుప్రపంచము నేలుచుండె?
కలగని సుషుప్తి మేల్కాంచి కలతజెందు
విధము తోచు తలంప నీవిభవములను.
కలదె సుఖము నీకోనల నలతియైన?
బురుజులందు గోడల సువర్ణరచితంపు
టక్కరములె యొసగు హృదయానికొక వి
నూతన వికాలము; కల దనూన తృప్తి!

# స్త్రీలు: గృహపరిశ్రమలు

## గృహలక్ష్ముల గృహపరిశ్రమలు

మన దేశమునందు చిరకాలముగ దంతధావనావసరమున వేపపుల్ల, పొగడ, ఉత్తరేణు, మామిడి మొదలగు పుడకల నుపయోగించుట యాచారమై యొప్పుచుండెడిది. కాలపరివర్తనముతో పాటు మానవలోకము యొక్క యభ్యాసానుభవాదులు గూడ పరివర్తనమందుచున్నట్లే యిటీవల పుడకలను ద్రోసిరాజని వింతవింత దంతధావన చూర్ణము లుద్భవించి నేటికి జనసామాన్యముచే విశేషముగ వాడబడుచున్నవి. నవనాగరకులగు విద్యావంతులు హెచ్చుగ దంతధావన నవనీతముల నుపయోగించుచున్నారు. పారంపర్యముగ వచ్చు నాచారమును విడనాడనొల్లని మతికొందఱు బొగ్గుల పొడి, యిటుకరాలపొడి, యిసుక, కచ్చిక మొదలగువాని నవి యెట్టి యపరిశుద్ధప్రదేశములం దుండినను గైకొని వాడుచున్నారు. ఈకడపటి యభ్యాసము నవలంబించువారలలో విశేషముగ పలువిధములగు దంత వ్యాధులకు లోనై యటమటించుచున్నారు. కాలపు విలువను గడ ద్రోయువారు ముందు పేర్కొనిన రీతిగ పుల్లలచే పలుదోముట సముచితము. తక్కినవారందఱు దంతచూర్ణములనే వాడుట యారోగ్యప్రదము.

ఇప్పట్లు నీ దిగువ కొన్ని దంతచూర్ణములను దయారు చేయు పద్ధతులను వాని యుపయోగములను దెల్పుదుము, వీలైనచో ప్రతివారు తమ గృహములందు తయారు గావించుకొనవలయునని మేము కోరుచున్నాము:—

ముఖ్యముగ స్త్రీలు తమ యిండ్లయందే యీచూర్ణములను తయారుచేసికొని తాము ప్రతినిత్యమును వాడుకొనుచుండుటయేగాక వ్యాపారరీత్యాగూడ కొంత ధనసముపార్జనకు గడంగవచ్చును. అట్టి కుతూహలమును గలిగినవారలకు తద్విషయమై సర్వ విధముల ప్రోత్సాహ ప్రోద్బలముల నొసంగుటకు "గృహలక్ష్మి" సంపాదకుడు సర్వదా సంసిద్ధుడు.

పాశ్చాత్య పద్ధతి ననుసరించి తయారుచేయబడిన దంతచూర్ణములలో ముఖ్యమైనవస్తువు సీమసున్నము (Chalk Powder). ఈసున్నములో మేలురకము మట్టురకము అను రెండు రకములు గలవు. గడ్డసున్నము మనకు సులభముగ లభించును. శుద్ధిచేసి చూర్ణము చేసినదియు లభించును. దాని వెల యధికము. కానిశుద్ధి చేసి చూర్ణముచేసిన సున్నమే దంతచూర్ణములలో నుపయోగించుటకు మేలైనది. గడ్డసున్నము సుమారు 6 అణా లుండిన శుద్ధిచేసినది 1-2-0 వెల గలిగియున్నది. ఈరెండురకముల సున్నములు మందులవ్యాపారము చేయు దుకాణములలో దొఱకును, లేక మాకు వ్రాసిన మేము పంపగలము.

1. సీమ సున్నము పొడి 40 తులములు
2. మంచి కర్పూరం – 2½ తులములు

ముందుగ కర్పూరమును పొడిచేసి సున్నములో కలిపి కల్వములో కొంచెము కొంచెముగ వేసి నూరవలయును. అంతయు నూరినపిదప సన్నని జల్లెడలో జల్లించవలయును. ఈపొడి గులాబిరంగుగ నుండవలయు ననిన నిందులో అయిదు గురిగింజల యెత్తు కార్మైన్ అను(Carmine) రంగుపొడిని మొదటనే చూర్ణమున కలిపి కల్వమున నూరిన గులాబిరంగు వచ్చును.

ఈచూర్ణము తియ్యగ నుండవలెననిన 5 తులముల చక్కెరను మెత్తగా పొడిచేసి కలుపుకొనవలయును. ఉప్పగ నుండగోరువారు 2½ తులముల శుద్ధిచేసిన తెల్లని యుప్పును మెత్తగ చూర్ణము చేసి యీపొడిలో కలుపవలయును.

సువాసనలను కోరువారు వారి కిష్టము వచ్చిన పరిమళద్రవ్యములను కొద్దిగ కలుపుకొనవచ్చును. అవగా యూకలిప్టస్ ఆయిల్ ఓమం తైలం దాల్చిన చెక్కతైలం మొదలగువానిని కావలసినమట్టుకు చేర్చుకొనవచ్చును.

ఈపొడిని గాజుబుడ్డీలో వేసి కార్కుమూసి భద్రపరచుకొనవలయును. మే మాసము గృహలక్ష్మిలో మరి రెండు రోగముల దంతచూర్ణములను వాసన తలనూనెలను గూర్చి వ్రాయుదును.

### పండ్లు తోమునపుడు సలహాలు

1. పండ్లుతోముకొనుటకు ముందుగనువ్వునీళ్లతో పుక్కిలించవలయును.

2. పండ్లను అధికకాలము రుద్దిన పండ్లమీదనుండు ఎనామిల్ అను మెరుగు పదార్థము అరిగిపోవును. ఇందువల్ల పండ్ల పటుత్వము తప్పి గట్టి పదార్థములను పులుసుపదార్థములను భుజించుటకు వీలుపడదు.

3. రాత్రి పరుండుటకు ముందుగూడ పండ్లను తోముకొనుట ఆరోగ్యము. అట్లుకానిచో నువ్వునీళ్లతోనైనను పుక్కిలించుట మంచిది.

4. ఇసుక బొత్తిపొడి మొదలగు గరుకు పదార్థములతో పండ్లనురుద్దిన పండ్లసందులలో పలుకులు చిక్కుకొని హానిని కలుగజేయును. పండ్లు త్వరలో అరిగిపోవును.

—గృహలక్ష్మి సంపాదకుడు

### కాచు చేయు విధము

మనము కాచును చేయవలయుననినచో ఒక చంద్ర మొద్దును తెచ్చి దానిలోపల చేవకలదా లేదా యని విమర్శించి చేవ యున్నచో దానిని చిన్నచిన్న ముక్కలుగా చెక్కి ఆముక్కలను తెచ్చి ఒక పెద్ద పాత్రగంగాళములో గాని లేక బకెట్‌లో గాని నీళ్లు పోసి ఆనీళ్లలో యీచెక్కిన పేళ్లను వేయవలయును. అట్లు చేసి గాలితాకుడు లేనిచోట మనగృహమందెచ్చటనైన పెట్టి ఒక 15 రోజులవఱకు నాననివ్వవలయును. అట్లు నానినపిదప ఆచెక్కలోని ద్రవమును పీల్చిన యీజలము ఎఱ్ఱబడి కొద్దిగా చిక్కబడును. అప్పుడు దానిలోని చెక్కముక్కలను తీసివేయవలయును. తీసిన తరువాత ఆఎఱ్ఱని ద్రవమును ఒక పాత్రలో పోసి పొయ్యిమీద పెట్టవలయును. అట్లు పెట్టి 3 రోజులవఱకు రాత్రింబవళ్లు ఒకే తీరున కాచవలయును. అట్లు కాగిన ఆద్రవము క్రమముగా చిక్కబడి గట్టిగా యగును. ద్రవమును కాచునపుడు మనము ఆద్రవములో వగరుకొఱకు కరక్కాయలను ముక్కలుగాచేసి ద్రవమునుబట్టి ఎన్ని సరిపోవునని మనకు తోచిన అన్నిచేసి ఆద్రవమును మరగ నివ్వవలయును. అప్పుడు ఆద్రవము ముద్దగాను ఎఱ్ఱగాను నుండును. అప్పుడు మనము ఆముద్దనుండి వచ్చిన రసమును ఒక సన్ననిగుడ్డలో పోసి వడియకట్టినయెడల అందులోని నీరు వడియపోయి అది ముద్ద యగును. అప్పుడు మనము దానిని తీసి చిన్నచిన్నముక్కలుగాచేసి ఎండబెట్టుకొనవచ్చును. మనకు అట్లుచేయుట కష్టమని తోచినయెడల, కాగి గట్టిపడ్డ రసమును తీసి ఒక పాత్రలోపోసి అగరుమెరాస్తరుగా 20 రోజులు ఎండబెట్టినయెడల గట్టిపడి ముద్దయగును. అప్పుడు మనము చిన్నచిన్న ముక్కలుగా చేసుకొనవచ్చును.

—మామునూరు లక్ష్మీబాయి

### బొమ్మపాత్రికలతో దుప్పటి

క్రొత్త వస్త్రములలో చించిన పేలికలన్నియు చేర్చిపెట్టి అనగా బొమ్మపాత్రికలవంటివి చొక్కాలలో లాగులలో రవికలలో మిగిలిన తునకలు అన్ని రంగులలోనివి జతపఱచి పడకలమీదికి దుప్పట్లుగాగాని కుర్చీలమీదికి చిన్నదిండ్లుగగాని రంగురంగుల పచ్చీసువలె జాయింటుచేసి కుట్టిన చాల అందముగ నుండును. ఇట్టివి మదనపల్లి ఆనుపత్రిలో కొల్లలుగా నున్నవి.

### కాళ్ల క్రిందికి మెత్త

ప్రాతవి క్రొత్తవి చింపి పేలికలను సన్నగా చించుకొని మూడు పేలికలు పెట్టి జడ అల్లుచు దానికి పేలికలను జాయింటు చేసుకుంటు అల్లుతు ఆజడను బాదంవాటంగా చుట్టుకుంటు సూదికి దారమెక్కించి పేము అల్లకంపవలె దానికి టాకాలువేసుకుంటు పెద్ద విస్తరాకంత చేసి నిలిపివేయవచ్చును. దీనిని పడకగదిలో మంచముకడ వేసిన బాగుండును.

—కంకిపాటి రుక్మిణమ్మ

## జిజ్ఞాస

పిలకా గణపతిగారు

ఒక్క రమణీయ ప్రభాతము
నందు నొకసందిగ్ధహృదయుఁడు
వారిధితీరపు టిసుకతిన్నెల
నిలచి యిటులనియెన్.

పెరిగివిరిగెడి తరగలారా!
మెరసిపోయెడి తారలారా!
ఎగిరిపోయెడి పులుగులారా!
వినుడు నాపలుకుల్.

ఎంతకాలమునుండి యిట్టులు
పెరిగివిరుగుచు తిరిగి పెరుగుచు
నీయనంతసముద్రమున వసి
యించియున్నారో!

రాత్రియుజ్జ్వల గగనతలమున
నీమనోహర జీవలోకము
జూచి యిటులే వెడలిపోయెద
రెచ్చటికి మరలన్.

ఎచటి కెగిరెద రీయనంతవి
హాయసమ్మున నెవరికోఱకై
ఈప్రపంచరహస్య మేమిరియొ
తెలియునే మీకున్.

చిన్ని చుక్కలు చికిలినవ్వెను!
పెద్దవే చింతింప సాగెను
పులుగులన్నియు తెలియదనుచును
వెడలిపోసాగెన్.

తరగలొక్కొక్కటిగ వచ్చెను;
వినుచు నట్టులె వెడలిపోయెను;
ఉన్నతోర్మిక యొకటి యిట్టులు
పలికి మరలిచనెన్.

అక్కలందఱు నాకసంబున
రాత్రి యొకచో గూడి, యిదియే
తలచియేమియు తెలియఁజాలక
వెడలుచున్నారల్.

ఎందుకోఱకీవెఱ్ఱిప్రశ్నలు?
పత్తుమిట్టులె పోదుమిట్టులె
ఎచటినుండియొ? ఎచటికో
యిది తెలియ దెవ్వరికిన్.

మత్స్యమొక్కటి కెరటములతో
వెడలిపోవుచు నవ్వుకొనియెను
అతఁడటులే నిలిచి యేలనో
యుస్సురనుకొనియెన్.

# వ్యాసకర్త్రి

శ్రీమతి సావిత్రీదేవిగారు

ఈశ్వరశరణ్ గొప్పకవీశ్వరుడు. అతనివయస్సు ఎక్కువకాకపోయినా అతని కవిత్వముయొక్క ఘనత చాలాఎక్కువది. అతడు కలం పుచ్చుకున్నాడంటే అపశబ్దంకాదు. అతని వ్యాసములయొక్క చాతుర్యము, వర్ణన, భాష నిరుపమానములైనందున విన్న వారందరూ చాలా ఆహ్లాదపడుతూండేవారు. ఆకాలమందు అతని కవిత్వమును పొగడని పత్రిక లేదు. అతని పద్యములమీద ఏవైనా విమర్శనలు వస్తే అన్నీచక్కగా సమర్థిస్తూ ఉండేవాడు. అతనిని చూసినవారు "అరుగో కవిమండలములో నక్షత్రమై వెలుగుతూన్న కవీశ్వరులు" అనుకుంటూఉంటేవిని ఊర్థ్వమండలములలో విహరించినట్లే ఆనందించేవాడు.

ఈశ్వరశరణ్ భార్యపేరు ఎవరికీ తెలియదు. అతడుమాత్రం భార్యఅంటే ప్రాణ సమానంగా ఎంచుకునేవాడు. ఆమె కంఠస్వరమంటే అతనికి ప్రాణం. ఆమె చిఱునగ వతనికి శాంతిదాయకం. భాగీరథి స్వల్పవిద్యావతి. ఈశ్వరశరణ్ భార్యకికూడా పద్యాలుఅవీ వ్రాయాలని ఉండేది.

"ఎంత అదృష్టం! ఎటువంటి విద్యావతియైన భార్యదొరికింది!"అని స్నేహితులెప్పుడు అంటారా అనుకునేవాడు. అటువంటిరోజులకోసం తనసర్వస్వమూ ధారపోయడానికి సిద్ధంగా ఉండేవాడు.

"చక్కనివ్యాసముంది చూస్తావా?" అన్నాడుఈశ్వరశరణ్,పత్రిక భాగీరథికియిస్తూ.

"ముందీవ్యాసం అయినతరువాత ఆవ్యాసంచూస్తాను. ఏమిటాపత్రిక?"అన్నది భాగీరథి బట్టలు సర్దుతూ.

"వేయి కథలు ఉన్నవి."

"మీవ్యాసం ఇందులోఉన్నదా"

"ఉన్నది; కాని నేనింకొకవ్యాసం నీకు చూపించాలనుకుంటున్నాను. ఆవ్యాసం వజ్రకుమారి అనే యామెది."

"వజ్రకుమారి! ఈమెపేరు ఎప్పుడూ వినలేదే"

"ఔను; అపరిచితయే. కాని వ్యాసం చాలాగొప్పది. ఒకమాటు చదివావంటే ఆనందం పట్టలేవు." అనగానే భాగీరథిభర్తచేతిలోని పత్రిక లాక్కున్నది. ఆభరణములపెట్టె అయినా ఎవరూ అంతతొందరగా తీసుకోరు.

ఆకథ చదువుచున్నప్పుడు ఆమె ముఖమునందు కలుగుచున్న మార్పులనుబట్టి ఆమెకు కూడా ఆనందంగాఉన్నదని గ్రహించి"ఎంత బాగున్న"దనిఅన్నాడు ఈశ్వరశరణ్.

"చాలా బాగుంది. కళ్ళ ఎదుటనున్న ఛాయాచిత్రంలాఉంది" అంది భాగీరథి.

"ఔను నాఅభిప్రాయమూ అంతే. ఇది ఏతరగతిలో చేరుతుందని తలుస్తావు"?

"............................."

"ఏం ఆలోచిస్తున్నావు? ఇది వజ్రకుమారి పరీక్ష కాదు. నీపరీక్ష కూడాను."

"ఈమెను రెండవతరగతిలో చేర్చవచ్చు."

"ఎందుకంత తగ్గించావు?"

"ఈమెను మొదటితరగతిలో చేరుస్తే నేనోడిపోతాను. నాలుగు చమత్కారం మాటలు చూడగానే దీనిబుద్ధి మందగించిం దనుకుంటారు."

"చూశావా; ఆమెనుగురించి పత్రికాసంపాదకుని అభిప్రాయం."

శ్రీమతి వజ్రకుమారి వ్యాసం మాపాఠకులయెదుట పెట్టుచున్నందులకు మేము చాలాసంతోషించుచున్నాము. ఇటువంటి మనోహరమగు వ్యాసము వెల్లడిచేయుగలిగినందుల కెంతయు—

"చాలు పొగడ్తలు; మీరు వ్రాసిన "గంగాతటము" అన్న దానిముందు ఇదియెంత? ఆపత్రికా సంపాదకుడు కనబడితే నే చెబుదును దీనిగొప్పదనం."

"చండికాదేవివై పోయావే" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకు నవ్వడం? ఈపొగడ్తలుచూస్తే నాకు వళ్లుమండుతుంది. వజ్రకుమారి గొప్ప వ్యాసకర్త్రి ఐపోయిందా? ఈమాత్రం అందరూ చెయ్యగలరు."

"సరే గాని, భాగీరథీ, నువ్వుకూడా ఎందుకురాయకూడదూ? నిన్నూ ఇలాగే పొగుడుతారు. నేను సంతోషిస్తాను."

"అక్కర్లేదు. నాకేం పొగడ్త లవసరం లేదు."

"నీవు రాయనంటే ఊరుకుంటానా. నీచేత రాయిస్తాను గాని, నీవు ఉత్తరం రాస్తే ఎంత ఆకర్షణీయంగాను, గంభీరంగాను, చమత్కారంగాను ఉంటుంది. ఉత్తరాల్లో ఉండే సంగతులే వ్యాసంక్రింద రాసి చూడు."

"ఆపని పురుషులదికాని స్త్రీలది కాదు."

"ఎందుకు కాదు? వజ్రకుమారి స్త్రీ కాదా మరి."

"ఆఁ; నాకన్నీ తెలుసును. భర్తచేత రాయించి తనపేర అచ్చువేయించింది. మీరూ రాయండి. నేనూ అలాగే చేస్తాను."

"హాస్యం వదలిపెట్టు. ప్రయత్నం చేస్తావా చెయ్యవా?"

"చెప్పానుగా మీరు రాసిపెట్టండి."

"మాఉపాధ్యాయులు మా కీపాఠం చెప్పలేదు."

"ఆ! వ్రాసిపెడుదురూ. భాగీరథినిగురించి పత్రికలలోపొగడ్తలు పడతాయి. మీరు సంతోషించవచ్చు."

"................"

"మీకోసం అన్ని రాయగలరుగాని నాకోసం ఒకటీ రాయలేరు కాబోలు"

"ఎంత చవకగా పేరు సంపాదిద్దామనుకుంటున్నావు."

అని ఈశ్వరశరణ్ భాగీరథివైపు చూచి నిట్టూర్పు నిగిడ్చి ఊరుకున్నాడు.

"..............................."

భాగీరథి మనస్సులో ఒకటే ఆలోచన. రోజూ భర్తతో "వ్యాసం ఎందుకు రాయరండీ?" అని పోరుతూవుండేది. "పైకిమాత్రం నిన్నెంతో ప్రేమిస్తాననడం. కాస్త రాసి పెట్టమంటే తేలింది సంగతి. నాకే రాయడం వస్తేనా ఇప్పటికెన్ని రాసి మీపేర పంపేదాన్నో" అని సణుగుతూ ఉండేది. ఈశ్వరశరణ్ మాత్రం "నీకేం పిచ్చి! పేరు రావాలని ఉంటే కష్టపడినేర్చుకో. నేనలాంటి పనిచెయ్యను" అనేవాడు. ఆమాటలవల్ల ఆమెసణుగుడు హెచ్చైపోయేది. ఈశ్వరశరణ్ మాట్లాడకుండా ఊరుకుని "ఎంత పని చేసాను. నేను రాయమని ప్రోత్సాహించకపోతే ఈపోరు ఉండకపోను" అనుకునేవాడు. ఈవిధంగా కొన్నిరోజులు గడిచిపోయాయిగాని చివరకి ఈశ్వరశరణ్ లొంగిపోయాడు. పురుషుని అసమ్మతి ప్రేమ గల ప్రేయసివద్ద సాగుతుందా?

ఒక సంవత్సరం గడిచేటప్పటికి భాగీరథి పేరు కవిప్రపంచమందు మ్రోగింది. అందరూ ఆమె కలంనుంచి ఒక్కపంక్తి ఏ పత్రికలోనైనా వెలువడితే దానికోసమే నిరీక్షిస్తున్నారు. "ఈమె ఎవరో కవీశ్వరుల తల దన్నినది. స్త్రీలు కేవలము గృహాంగనలుగానే నిర్మింప బడ్డారని ఇప్పుడెవరైనా అనగలరా?" అని అనుకోడం ప్రారంభించారు. భాగీరథి కాళ్లు భూమ్మీద నిలవడంలేదు. ఏపత్రికలో చూసినా తన నామమే. భర్తమీద ప్రేమ అతిశయించింది. అతనినిఅస్తమానం పొగుడుతూఉండేది. ఈశ్వరశరణ్ కూడా పత్రికలలో తన పత్ని పేరు చూసి పొంగిపోయేవాడు.

భాగీరథి ఎవరో ఈశ్వరశరణ్‌కి తప్ప ఇతరులకు తెలియదు. కీర్తి దాగదు. చివరకి తెలిసింది భాగీరథి ఈశ్వరశరణ్ భార్య అన్న రహస్యం. పత్రికాధిపతులు భార్యాభర్తలిద్దర్నీ అభినందిస్తూ ఉండేవారు. ఈశ్వరశరణ్ మాత్రం భయపడుతూ ఉండేవాడు. రెండవ రహస్యంకూడా బయటపడుతుందేమో నని ... ... ...

హిందూ బాలికా పాఠశాల వార్షికోత్సవము వచ్చింది. ఆపాఠశాల ప్రధానోపాధ్యాయిని వచ్చి భాగీరథిని ఆసభకు అధ్యక్షత వహించమని కోరింది. భాగీరథికి ఇష్టంలేకపోయినా ఆమె బలవంతంవల్ల ఒప్పుకోక తప్పిందికాదు. "ఎంత చెప్పినా వినలేదుకదా. అంతమందిలో నేనెలా మాట్లాడగలను?" అనుకుంది భాగీరథి.

ఈసంగతి ఈశ్వరశరణుతో చెప్పేటప్పటికి "నాలుగు వ్యాసాలు రాస్తే ఎంత పదవి వచ్చిందో చూశావా?" అన్నాడు.

"మీరు చెప్పినది నిజమే. కాని ఈగౌరవమంతా మీదానాదా?"

"నాదేముంది ? నేను ముందుజన్మ స్త్రీజన్మ రావాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. స్త్రీ కోరింది వెంటనే నెఱవేరుతుంది."

"అబ్బా, అందఱూ మీలాంటివాళ్లే ఔతారా? సరేగాని అంతమందిలో ఎలాగండీ మాట్లాడడం?"

"సుఖువుగా సంతకంచేసినట్లే అనుకొన్నావా?"

"మీరెప్పుడూ ఇంతే. మీతో మాట్లాడగూడదు."

"పొఱబాటు జరిగింది, క్షమించవూ?"

మర్నాడే ఈశ్వరశరణ్ ఊరికి వెళ్లవలసివచ్చింది.

"మంచి ఉపన్యాసం రాసి పంపిచాలి; మఱచిపోకూడదు. మఱచిపోతే ఇక్కడ చిక్కువస్తుంది" అని భాగీరథి మఱీమఱీ చెప్పింది. ఈశ్వరశరణ్ వెళ్లగానే వార్షికోత్సవ సందర్భంలో ఆమె చదవడానికి మంచి ఉపన్యాసం వ్రాసి పంపించాడు. భాగీరథి అదిచూసి చాలా సంతోషించింది. "ఇదివఱకు నాపేరుతో చాలా వ్యాసాలు ప్రచురణ అయాయి గాని ఇంత గొప్పవి కావు. నే అధ్యక్షురాలుగా ఉండి ఇది చదువుతే ఎంత మనోహరంగా ఉంటుంది! ఇటువంటి వ్యాసం రాయడానికి ఎంత ఆలోచించవలసివచ్చిందో. అహంభావముతో కూడుకున్న ఈపాడు ప్రపంచంలో ఇతరులెవరైనా ఇలా సహాయం చేస్తారా?" అనుకొని భర్తను తలచి నమస్కరించింది.

సభరోజున హాల్లో ఇసకేస్తే రాలడంలేదు. ఇదివఱకు అటువంటి సభలకు పురుషులు కొద్దిమందే వచ్చేవారు. కాని ఆసభకు స్త్రీలకన్న పురుషులే ఎక్కువమంది వచ్చారు. అందులో భాగీరథి ఎలావుంటుందో చూద్దామని కొందరూ, ఆమె ఉపన్యాసం వినాలని కొందరూ ఆదుర్దాపడి వచ్చారు. కొంతసేపటికి భాగీరథీదేవి వచ్చిందని గంద్రగోళం ప్రారంభమైంది. అందరూ ఆమెను చూడ్డానికని తోసుకుంటూ లేచారు. ఈసందడంతా ఒక్కమాటు నిశ్శబ్దమైపోయింది. ప్రధానోపాధ్యాయినితో కాశ్మీర సిల్కుచీర కట్టుకుని ముఖమందు నమ్రత, గంభీరము తాండవమాడుచుండగా వచ్చిన భాగీరథియే ఆనిశ్శబ్దమునకు కారణము. భాగీరథీదేవి ఆమెయే యను వాక్యము అక్కడనున్న ప్రతివ్యక్తి ముఖమునుండి వెలువడింది. తరువాత ఆమెను సభకు అధ్యక్షురాలినిగా ఎన్నుకొని; బాలికలకు ఆమెచేత బహుమతు లిప్పించారు. బహుమతు లిచ్చునప్పుడు ఆమె ముఖమునందు వెల్లివిరియుచున్న ఆనందం అనుభవించినవారికే తెలుస్తుంది. తరువాత భాగీరథి ఉపన్యాసం చదవడాని కుపక్రమించింది. అందరూ మాటిమాటికీ కరతాళ ధ్వను లొనర్చుచూ అభినందించుచుండగా భాగీరథి ఎక్కువ ఉత్సాహంతో చదువుతోంది. అంతలో భాగీరథి ప్రధానోపాధ్యాయిని తన్నుగుఱించి ఏమి తలుస్తోందో నని ఆమెవైపు చూడగా ఆమె ఒక ఉత్తరం చదువుతూవుండడం కనిపించింది. ఆ ఉత్తరం చూడగనే భాగీరథి గుండెల్లో దడ ప్రారంభమైంది. వ్యాసంతో పాటు "నీవు కోరినప్రకారం వ్యాసంరాసి పంపుతూన్నా" నని ఈశ్వరశరణ్ రాసినఉత్తరమది. పొఱబాటున ఆమె కాగితాల్లోంచి క్రిందపడి ప్రధానోపాధ్యాయిని చేతుల్లో పడింది. అందరూ

చాలా అభినందిస్తున్నా వినిపించుకోక భాగీరథి త్వరగా ఉపన్యాసం ముగింపుచేసి సరళా దేవిని ప్రక్కగదిలోనికి తీసికెళ్లి "ఉత్తరం సంగతి ఎక్కడా వెల్లడిచేయవద్దు. నాగౌరవం, నాప్రాణం కాపాడవలసిం"దని ప్రార్థించింది. ఆమెకూడా భాగీరథి అవస్థ చూసి "ఈఉత్తరం గురించి నానోటినుండి ఒక్క అక్షరమైనా వెలువడ"దని ప్రమాణంచేసి చెప్పింది. తరువాత భాగీరథి వ్యాసం ఒక్కటీ పత్రికలలో ప్రచురింపబడలేదు.

వజ్రకుమారి వ్యాసములు యథాప్రకారంగా ప్రచురణ అవుతూనే ఉన్నాయి గాని భాగీరథి మనస్సులో మునుపటి ఈర్ష్యపోయి, ఒకవిధమైన కాంతి ప్రవేశించింది. ఇలాఉండగా ఒకరోజున భాగీరథి నిమిత్తమై పదునెనిమిదేండ్ల యువతి వచ్చింది. భాగీరథి ఆమెను గౌర వించి కుశల ప్రశ్నలు చేసిన తరువాత ఆమె తన పేరు వజ్రకుమారి అనియు భాగీరథి దర్శనం చేయాలని వచ్చాననియు తెలియపరచింది. భాగీరథి ఆమెతో "మీవ్యాసములు నాకమితా నందం కలుగజేస్తాయి. పురుషులు వ్యాసములు రాయడం తమకేగాని ఇంకెవ్వరికీ రావని గర్వ పడుతూ ఉంటారు. మీవల్ల అలాంటి ఊహలకి అవకాశం లేదు" అన్నది.

"మీవ్యాసముల ముందు నావెంత? మీరిప్పుడు వ్రాయడం ఎందుకు విరమించారు? ఆసంగతి తెలుసుకుందామనే నేను వచ్చాను. మీరిలా అశ్రద్ధ చెయ్యడంవల్ల చాలా నష్టం కలుగుతోంది"

"ఏం చెప్పను?"అనుకుంది భాగీరథి.

"ఈశ్వర శరణ్ గారు పార్వతి ముందు ఈశ్వరుని గౌరవందక్కదని ఆటంకపరిచారా!"

"అలాంటి దేమి లేదు. వారికీ చాలా ఉత్సాహం."

"అవుతే మీరిలా ఊరుకోడం బాగుండలేదు"

'వ్యాసం రాసే శక్తి నాకేముంది? వారు రాసేవారు. నాపేరుతో పంపేదాన్ని'అని చెపుదామా అనుకొని నాయం దీమె కున్న గౌరవమంతా పోయి, 'ఆహా ఎంత మోసకత్తె!' అని అసహ్యపడుతుందేమో నని అంది కదా

"ఏదో పనిపాటలవల్ల తీరుబడిలేక విసుగెత్తి..."

"కవిత్వం మనసును విసిగించే వస్తువు కాదే. ఎప్పుడూ చిగుర్చుతూ ఉండే తోట లాంటిది. చంద్రికలు, పక్షుల కోలాహలము, కవిత్వము ఇవి విసిగించే వస్తువులా? అయినా ఇలాంటివి కారణాలు కాగూడదు. మీరు మరల రాయడం ప్రారంభించండి" అని ఎన్నో విధాలచెప్పి వజ్రకుమారి వెళ్ళిపోయింది. ఇదివఱకు భాగీరథి ఆమెకూడా ఎవరిచేతనో చెప్పిం చుకొని వ్రాసేదని అనుమానపడింది. కాని ఇప్పు డామెను చూచుటవల్ల ఆమె వాగ్ధోరణి వినుటవల్ల ఆ ఊహ తొలగిపోయింది. "వజ్రకుమారి చిన్నది. ఆమె రాసిందికదా! కష్టపడితే నాకుమాత్రం ఎందుకు రాదు. వజ్రకుమారి కృషిచేసి నేర్చుకోలేదూ? నేను ప్రయత్నిస్తే నాకూ వస్తుంది" అనుకుంటూ ఉద్రేకంతో అప్రయత్నంగా "నేను స్వయంగా రాస్తాను" అంది. వెంటనే దగ్గరనే ఉన్న ఈశ్వర శరణ్"తథాస్తు"అన్నాడు. —అనువాదము

# శ్రీ పీఠికాపుర మహారాజ్ఞీస్మృతి తారకావళి

శ్రీమతి వింజమూరి వేంకటరత్నమ్మగారు

ఉ॥ ఎద బరువాయె నాకు వచియింపఁగ మాటలు రావు వ్రాయఁగాఁ
గదలదు లేఖినీముఖ మిఁకనేగవనంబెటు రాజ్ఞిఁగూర్చి చె
ప్పెదుఁ బ్రియమారఁ బెంచెనుఘనుం దనకూఁతులపోల్కిఁ గన్నత
ల్లిదయను శక్యమౌనె చవిలేనిపదంబులఁ గూర్చి పాడఁగా?

తే॥గీ॥ మాటమృదువు, మేనుమృదువు, మనసుమృదువు
చేఁతమృదువు, చర్యమృదువు, చిన్నమాంబ
కనుచు నెఱిఁగియు నేలొకో యగ్ని దేవుఁ
డాహుతిఁగొనెఁ దన్మృదులావయవము లెల్ల?

తే॥గీ॥ తన్నుఁబోలు పవిత్రహృదయ యగుటను
దుర్నిరీక్ష్య తేజంబుతోఁ దూఁగుచుంట
స్వీయవస్తువేయని భ్రమఁజెందెనేమొ?
కానిచో, దహింపఁగలఁడే రాణిమేను?

తే॥గీ॥ కప్పురమువంటి సితకీర్తి గలిగియుండె,
కప్పురముఁ బోలు తెల్లని కాంతిఁ గాంచె,
కప్పురపు సౌరభంబుచే సొప్పియుండె,
కడ కసువును గప్పురానికే విడిచెఁ గాద!

ఉ॥ అమ్మా! చిన్నమదేవి! పీఠపురరాజ్యశ్రీలలామా! దివం
బెమ్మాడ్కిన్ గనఁబోతి వింతబలఁగం బీభూమిపై నీడి? నీ
సమ్మానంబును గాంచి జీవనములన్ సాగించు రాష్ట్రప్రజౌ
ఘమ్ముల్ నీయెడఁబాటు సైఁచి యెటులింకన్ మందు రూహించితే!

అండాళ్లు నాపంచప్రాణములని యెంచు, వృద్ధుఁడౌ జనకుని వెతలముంచి
ముద్దుముచ్చట లెన్నొ పొంది పొందింపనౌ, సోదరత్రయమును శోకముంచి
నీబోధసుధలాన నిరత మెదురుచూచు, సంతానషట్కమున్ వంతముంచి
ఆత్మబంధులు లేక యందఱీవని నమ్మ, ప్రాణేశు దుఃఖవారాశిముంచి
మమ్ముబోంట్ల నాశ్రితనికాయమ్ము నెల్ల
నగతికత్వ ప్రవాహమ్మునందు ముంచి
అమ్మ! చిన్నమదేవి! యెట్లరిగినావు?
మరలిరావ? మాకొఱకేని తరలిరావ?

అజని సాకారనిరాకారవాదంబు, నరయువా? యల జ్ఞానమాంబవచ్చె;
నీకు దివ్యజ్ఞానలోకాంశములఁ జెప్ప, వినవేల రాజమ్మ విదుషీమణులు?
పంతులుగారి యపారప్రతిభఁ జెప్ప, నాలింపవా సీతమాంబ పలుకు?
సద్గ్రంథపఠనంబు సలిపి నిన్నుఁ దనుప, మదినిల్పవా సర్వమాంబచదువు?
పాఠశాలాంశముల్ విన్నపమ్ము సల్ప
నెదురుచూచు కృపమ్మ మాటేల వినవు?
మహిళసమాజపు లెక్క కామమ్మ తెచ్చె
తల్లి! కనుఁదమ్ము తెఱతువా? తరలిరావ?

అదె మహారాజా నీసదుపదేశములకై, వాఁకిట నిలిచి నీరాకఁ గనెదు
అమృతహస్తములతో నమరిచి నీవిచ్చు, ఫలరసాపేక్షమై బాలుంద్రు
అమ్మయే కలదన్న నరుదేరవలెనంచుఁ, గూఁతులు కనుపెట్టుకొనుచునుంద్రు
అత్తమ్మహితబోధ లాప్యాయమొప్పఁగా, విన మొద్దుకోడలు గనుచునుండు
కలఁతచూపులతోఁ జేటికానికాయ
మెదురుచూచు నీయాజ్ఞలనెల్ల జరుప;
ఉన్నపాటున వస్తువులన్నియుండె;
జనని! రావేల? ధర్మముజా సలుపవేల?
మాకు వేడుకగ సీతాకుమారిక పెండ్లి, కోటలో జరిపింప మాటనిడితి
పౌత్రదౌహిత్రుల భవమహోత్సవములు, వైభవంబునఁ జల్పవలచియుంటి
'తమ్ము' వివాహోత్సవమ్ము మహోత్సాహ, గరిమతో నడిపింప నరయుచుంటి
మనమాసపత్రికా ఘనవార్షికోత్సవా, లానర్ఘ్యఘటితిఁ జేయంగనుంటి
పెక్కురీతుల నాశ్రిత బృందములను
దనుపవలెనంచు మనసారఁ దలఁచుచుంటి
విన్నపములున్నవే జనయిత్రి నీకు!
ఏల యీలీల మఱఁగైతి, వెందుఁ బోతి?
వివిధదేశములందు వింతలెన్నియొ గాంచి, యీవు వ్రాసిన లేఖ లెట్లు వెలయు?
పద్మనాయకకుల ప్రఖ్యమణులఁ గూర్చి, యీవు వ్రాసెడిగ్రంథ మెట్లు ముగియు?
'హిందూగృహము' నకై యీవు చేర్చిన బహు, వ్యాససంతతు లెట్లు పడయఁగలము?
ఉపనిషత్తులలోని యుత్తమాంశములెల్ల, నెంచి వ్రాసితి వెట్లు గాంచఁగలము?
హైందవస్త్రీల నుద్ధరింపఁ దలంచి
యెన్నియో సత్కృతులఁ బూని యున్న నీవు
వానిఁ బూర్తి సేయకమున్నె వసుధ విడుట
తల్లి! నీవంటి విదుషికిఁ దగునటమ్మ?
ఉభయపక్షవ్యయపుభర మెల్ల వహించి, యెన్ని పెండ్లిండ్లు చేయించినావు!
అజ్ఞానవశలౌట నాత్మపతుల వీడు, స్త్రీలనెందఱఁ జక్కఁజేసినావు!
పొత్తిళ్ళలోనుండు ముద్దుబిడ్డలకెంద, ఱెందఱ కుడుపుల నిచ్చినావు!
దిక్కుమ్రొక్కునులేని దీనబాలికలకు, నెన్నిరీతుల సాయమొసఁగినావు!
వానఁ దడియనివారలు వసుధ లేరు,
చిన్నమాంబామహారాజ్ఞిచేత నీవు
లందని వనిత లుర్వి లేరనుట నిజము;
అట్టి నీవులేని భువి శూన్యంబుగాదె?
దేశదేశములందుఁ దిరిగినకోలఁదిని, స్వీయదేశముమీఁదఁ బ్రీతి హెచ్చె
బహుగ్రంథపఠనంబుఁ బరఁగినకోలఁదిని, నమ్రభావంబు నానాఁట హెచ్చె
పరమతపద్ధతు లెఱిఁగినకోలఁదిని, దనమతమందుఁ దాత్పర్యమెచ్చె
విభవంబులకు వీలు లభియించుకోలఁదిని, నిర్దంభవృత్తిపై నియతి హెచ్చె
భర్తృహరికవి చెప్పిన పద్యమునకుఁ
బ్రబల దృష్టాంతమై యీమె పరఁగునంచు
నమ్ముచుండెడివారము నెమ్మనముల
అట్టి మామహారాజ్ఞి శక్యంబె మఱవ?

దర్శనంబునుగోరి తలవాల కెవరేని, నిల్చిన వైళంబ నికటమొసఁగు
ఒసఁగుమాత్రమె కాదు వెస వారిఁ బూజించి, వచ్చినకార్యంబుఁ గ్రోచ్చియరయు
అరయుమాత్రమె కాదు సరగునవారలకా, కృతకృత్యులుగఁ జేసి కృపను దనుపు
తనుపుమాత్రమె కాదు తరుచుగా వారలం, బిలిపించి సాయంబు సలుపుచుండు

ఇట్టు లేమహారాజ్ఞికిం బట్టువడని
నిరుపమాన సద్గుణగణ నిలయమైన
చిన్నమాంబామహారాజ్ఞి వన్నెమనక
దైవమా! యెట్లు కొంపోతి దయను వీడి?

దర్శనంబునకేఁగఁ దనపీఠమును డిగ్గి, చాఁపపై మాతోడఁ జదికిలఁబడు,
భాషాప్రసంగముల్ బలుకాడ నేర్తు నే వాస్థానకవిపుత్రి కర్త మనును,
ఇంపుగా మాబిడ్డలేదేనిఁ జదివిన, ముద్దిడి మావంశముల నుతించు
నగలకై యొకయింతి తగవులాడుటఁ గాంచి, యాదర్శముగ నన్ను నరయుఁ దనుసు

అట్టి యవ్యాజవాత్సల్యమంది నన్ను
నాదుబిడ్డల స్వీయసంతానమటుల
నరయు చిన్నమదేవితో నరుగలేక
"బ్రతికి యున్నాను జీవచ్ఛవంబనగుచు"

కదసారికా నినుఁ గూడి రాజగృహాశ్వంగారంపుఁ బూఁదోఁటలో
నడువంగల్గినవేళఁ దల్లి! బహుళానందప్రసంగంబు లే
ర్పడ నందీవు, "మదాప్త లీరలు ననుం బన్నుండఁగాఁజేసి నా
పడకం జుట్టుచు రామనామముఁ బఠింపన్ హాయిగాఁ బ్రాణముల్
విడువంగల్గినయట్లు గెండుతడవల్ భీతావహంబౌ కలల్
నడయుంగంటి" నటంచుఁ బల్కినముడుల్ సత్యంబు లౌ కేలకో?
కడుఁ గల్లల్ కలలంచు మేమనినవాక్యంబుల్ విరుద్ధంబులై
చెడ నేలా? విధి యూరకేల విడఁదీసెకా దల్లినిన్ బిడ్డలకా?
ఇది మీపుట్టినయిల్లు, సోదరులు నమ్మీ మీమహారాజాగా
రు, దయాసింధులు, మిమ్ముఁ గారవమునం బ్రోవం గొఱంతేల" యం
చెదలోనకా మధురామలామృతము జెన్నేసార్లు వర్షించి నా
మదికిం జల్లనిశాంతిఁ గూరిచితి వమ్మా! చిన్నమాంబా సతీ!
అనివార్యంపువేళ మోక్షపదవీజిజ్ఞాసక్తి నీలోని ని
త్యానందంబె స్ఫురింప నీవదనచంద్రజ్యోత్స్న గా వేదనా
మానమ్ముం బ్రదుకుకా ద్వితీయపదయుగ్మంబంటికోఁ జేర్చుచుకా
బోనీ, బాష్పములేని యన్ని విడునకా మున్నో ముఖో లేదుగా?
చుక్కలమధ్యమందుఁ గడు శోభనుగాంచెడు చంద్రబింబమై
పెక్కురు మాదృశాశ్రితలు వేడుకఁ గొల్వఁగ నొప్పు నీముఖం
బెక్కరణిం గవంగల మహీనదయాకిరణంబు లెల్లెడకా
బిక్కటిలంగఁ జిల్కు నవ వెన్నెల యెట్టులు గాంచనేర్తుమో!
అకలంకంబు స్త్రీలపత్రికయొకం డాంధ్రంబునన్నిల్పి దా
నికి హిందూగృహనామముంచి, కడఁకన్ నీతితిహాసంబులున్
సకలాశాయువతీప్రసంగములు నానాశాస్త్రపాఠాంశముల్
ప్రకటింపన్ దలఁబూని, వ్యాసములకున్ గూర్చియున్నావుగా?

మనయాస్థానవిచిత్రకారకుఁడు నీమంబొప్పఁగా వ్రాసి యుం
చిన హిందూగృహచిత్ర మంపినటులే చెన్నొందుచున్ వ్రేలెడున్;
జననీ! నీ పెలవొంది వ్రాసిన సమాజస్త్రీల చట్టంబు లిం
కను మాయింటనె మూల్గుచుండె భవదాఖ్యాతాజ్ఞలం గోరుచున్.

సీతాదేవివియోగమంది యెటు లా శ్రీరామచంద్రుండు ప్ర
ఖ్యాతస్థైర్యముఁగాంచి రాష్ట్రజనసంఘక్షేమముం గోరి ప్రా
(ణాతిక్రాంతిని జెంద కీర్తిని దీర్ఘాయుస్సుతో నుండె నా)
రీతిన్ బుత్రియుగంబుతో మనుత ధాత్రిన్ మామహారాజొగిన్.

నను గన్నతల్లి చిన్నమదేవి సీతమ్మ, మామహారాజు రామయ్యతండ్రి;
ఈయెడఁబాటెంత యోర్చునో తనగుండె, వంతచల్లఁగ నెల నాఁడేలు;
తన ప్రేయసీమూర్తిగన వేమొ యుంకఁగనుల్, బ్రతుకంత యొక్క నేత్రముగవిచ్చి
మున్నె యేలికనంపికొన్నాఁడు లోలోన, దీయతీయని యామె పోయగమ్మ

కాని యెవ్వారు గనని యేకాంతవేళ
వెడలవా జాలుజాలులై వేఁడివేఁడి
యశ్రువులు నిర్ని మేష నేత్రాంచలములఁ
దడియఁగాఁ దనమృదులోపధాన మెల్ల?

ఈయెడఁబాటు జీవికి సహింపఁగ రానిది, యెన్నివాళ్ల దీ
తీయని ప్రేమ? పాయుదుగదే నరపాలు నెదం దనిండి! రా
గాయతరక్తరేఖలు దురంతవిషాదతమోమలీమస
చ్ఛాయలఁ ద్రాఁకు నారని విశాలమనోంబరసాంధ్యవీథులన్.

ఇందుమతీదేవి యెడఁబాటు గనలేక, యజమహారాజు మహార్తిఁ గాంచె
సీతావియోగముం జెందఁజాలక రామసార్వభౌముఁడు స్వర్ణ జానకిఁ గొనె
ప్రియయౌ ప్రమద్వరావిశ్లేషమునఁ గుంది, రురుఁడాయురర్ధంబుఁ దరుణికొసఁగె
అర్ధాంగియౌ సతి యగ్నిదగ్ధముకాఁగ, బరమశివుఁడు తపఃపరతనేఁగె

ప్రేమకుఁ డొకండు, నటేశర్మి జేటొకండు
త్యాగి యింకొకండు, విరాగి యవల నొకఁడు
వారియం దెవ్వరును యోగివరులు గారు;
మామహారాజె యోగిసుత్రాముఁ డగును.

ఇరువదియేడు వత్సరము లేఁగెను సూర్యనృపాలు మానసాం
బురుహమహాసనంబునకుఁ బోల్పగఁ జిన్నమదేవి వచ్చి; యా
యిరవిఁక శాశ్వతంబు; తనువేగతి మాజిన నాత్మ నిత్యమై
పరఁగుట మామహాశుఁ డెడఁబాటు సహింపఁడు ధర్మపత్నితో.

సంతోషంబునఁ జిన్నమాంబ కమలాసారూప్యముంగాంచె, జ
న్మాంతర్భావము నొందదింక, మహనీయానంద ధామంబు నం
దెంతే శాంతిని బొంది స్వీయజన సద్బృందంబులన్ మమ్ము న
శ్రాంతంబున్ గరుణాకటాక్షములచే సంతృప్తి గావించెడున్

అవనిం బాదము పెట్టుటాదిగ నఖండైశ్వర్యముల్ గాంచి సం
స్తవనీయంబగు వర్తనంబున దిగంతక్రాంత విఖ్యాతి యీ
భువినార్జించి చిరస్థపుణ్యనిలయంబున్ జాఱికొన్నట్టి నీ
కివె నక్షత్రమణీ సరంబిడితిఁ దల్లీ! కైకొనన్ వేడెదన్.



"పా మ్యావలకు సంటరాని పిశాచమా......"

*By courtesy of "Gandhi"*









ఒక్క దెబ్బకు రెండు పక్షులు.

# పాకకళ

— పూత రేకులు —

రమారమి రెండుగంటలు నీటిలో నానిన బియ్యమును, కాటుకంత మెత్తగా రుబ్బి, దానినొకపాత్రలో ఉంచవలెను. సున్నని అడుగు గల మట్టికుండకు మూతికి పైభాగమున నాలుగురంధ్రములుంచి, మూతి క్రిందగునట్లు పొయ్యిమీద దానిని బోర్లగించి, పొయ్యిలో సన్నని మంట పెట్టవలెను. తెల్లని నలుచదురం గుడ్డను ఆబియ్యపు పిండిలో తడిపి, దానిని కుండకు పూయవలెను. వెంటనే పలుచని రేకు లేచును. ఆరేకును పళ్లెంలో పెట్టి దానిమీద నెయ్యి పంచదార జల్లవలెను. ఆమాదిరిగ అనేక రేకులు తయారుచేసి, ప్రతి ఒక రేకు మీదను నెయ్యి పంచదార జల్లుచుండవలెను. నెయ్యిచే తడిసి రేకులు మెత్తపడును. పిమ్మట పదిపది పోను రేకులను, రవికలగుడ్డమడతలుగా గాని ఇంకొకరకం మడతలుగాగాని మడచి పెట్టవలెను. ఇవి తినుటకు చాల రుచిగానుండును. పూతరేకులు మదరాసు రాష్ట్రపు రాజులకు ప్రీతైన పిండివంట.

—గంటి రామసుబ్బలక్ష్మి.

— ముంత మామిడి పప్పు వడలు —

1 వీశె ముంతమామిడిపప్పుకు ¼ సేరు బియ్యము నానపోసి ముంతమామిడిపప్పును బియ్యమును రుబ్బి దానిలో ఉప్పు కారము కొంచెముగా వేసి యుంచవలెను.(కొంచెముఉప్పువేసినను చక్కెరచల్లి తినవచ్చును) ఒక బాణలిలో నెయ్యిపోసి పొయ్యిమీద పెట్టి మరగ కాచి రుబ్బిన పిండిని వడలవలెతట్టి చమురులో కాల్చి వేడివేడిగా భుజించినయెడల బహురుచిగా నుండును.

—జి. ఎల్. సావిత్రమ్మ.

— పొట్లకాయ పకోడీలు —

లేత పొట్లకాయలను రెంటిని తెచ్చి పలచగ చక్రములవలె తరుగవలెను. దానికి సరిపడు సెనగపిండిని తీసుకొని కొంచెము పచ్చిమిరపకాయలను, అల్లమును చిన్న చిన్న ముక్కలుగా చేసి యుప్పును ఎండుమిరపకారమును చేర్చిన నీళ్లతో ఆపిండిని పల్చగకలుపవలెను. ఒక బాణలిలో పావుసేరు నెయ్యిగాని నూనెగాని వేసి బాగుగ కాగిన పిదప పొట్లకాయ ముక్కలను సెనగపిండిలో ఏడెనిమిది చొప్పున ముంచి నూనెలో వదలవలెను. అవి ఎరుపురంగురాగనే వేరొక పళ్లెములో తీసుకొనవలెను.

— కందిపప్పు వడ —

ఒక సేరు కందిపప్పును నీళ్లలో నానబెట్టవలెను. నానిన పిదప రుబ్బవలెను. రుబ్బుచున్నప్పుడు దానికి సరిపడు పచ్చిమిరపకాయలు ఉప్పు వేయవలెను. నీరుఉల్లిపాయలను చిన్నచిన్న ముక్కలుగా తరిగి రుబ్బిన పిండిలో వేయవలెను. విస్తారము మెత్తగా పిండిని రుబ్బకూడదు. ఒక బాణలిలో నెయ్యిగాని నూనెగాని కాచి దానిలో రుబ్బిన పిండిని వడలు మాదిరిగ వేయవలెను. బాగుగ వేగిన పిదప వేరొక పళ్లెములో వేయవలెను. వేడిగాయున్నప్పుడే ఉపయోగించుట మంచిది. —గొల్లకోట సుందరదేవి.

— మధుర పాళాలు —

సెనగపప్పును తెచ్చి రెడ్డలులేకుండ వేరి దోరగ వేయించి మెత్తగ విసరిపుంచవలెను. ఒక బాణలిలో తగుమాత్రము నీళ్లుపోసి సలసల మరుగనిచ్చి అందులో కొద్దిగా నెయ్యిపోసి పైనచెప్పిన సెనగపిండిని పోయవలయును. అది ఉడుకుచుండగా చిక్కని పాలుకూడ పోయవలెను. తరువాత చాలినంత చక్కెర, మొక్కజీడిపప్పు, ద్రాక్షపళ్లు, ఏలకుపొడి వేసి బాగుగా కలి

యు పెట్టి ఉడికిన పిమ్మట దించివేసి నిమ్మకాయలంత తీసి వుండలుగా చేసియుంచవలెను. గోధుమపిండిని నీళ్లతోటి నూనెతోటి బాగుగా మర్దించి ముద్దఅగునట్లు చేసి ఆముద్దలోనుంచి కొద్దికొద్దిగా తీసి పైన జెప్పిన ఉండలను గోధుమపిండి మూసవలెజేసి అందులో పెట్టి అరటియాకునకు నేయిరాసి తప్పడగ వత్తవలెను. పెనముపై నేయిరాసి అవత్తిన వాటిని పైన వేసి దోరగ కాల్చవలెను. కాలిన పిదప దించి తినిన బహురుచికరముగా నుండును. బలముకూడ కలుగ జేయును. సెనగపిండికి మారుగ గోధుమ నూకతో గూడ పైన జెప్పిన విధమున జేయవచ్చును.

—తులసి వేంకట సుబ్బలక్ష్మమ్మ.

### — శనగపిండి వంకాయ —

లేత వంకాయలు మంచివిగా ఒక వీశె తీసుకుని వుంచవలెను. సవాపావు ఎండుమిరపకాయలను గిన్నెలో కొంచెముగా నూనెవేసి యీ మెరపకాయలు తీసికొనవలెను; వేయించవలెను. సగము వేగిన తరువాత మినపపప్పు ఆవాలు జీలకర్రమాడూకలసి ఒకగిద్దెడు తెచ్చి యీ మిరపకాయలలో పోసిమాడకుండా ఎర్రగా వేయించవలెను. వేగినతరువాత రోటిలో పోసుకొనవలెను. పొయ్యిమీద గిన్నెపెట్టి కొంచెము నెయ్యి వేసి రెండు గిద్దల శనగపిండిని ఆగిన్నెలో పోసి కొంచెము ఎర్రగా వేయించవలెను. వేగినతరువాత వల్లెంలోని కారపు పొడిలో యీపిండినిపోసి వుండగాకుండా బాగాకలపవలెను. తరువాత వంకాయలు నీటిలో తరుగకుండా ఒక్కొక్కకాయ చొప్పున నాలుగేసి చీలికలుగా తరిగి వెంటనే యీశనగపిండితో కలిపిన కారపు పొడి యీవంకాయలలో పెట్టవలెను. అన్నీ వక్కపారి తరిగినయెడల కసరెక్కును. తరువాత గిన్నెకాని బాణలిగాని పొయ్యిమీదవేసి మూడుసవాపావులు నెయ్యిగాని నూనెగాని పోయవలెను. బాగా కాగినతరువాత కొంచెము యింగువ వేసి వేగిన తరువాత గిన్నె దింపి క్రిందపెట్టవలెను. దానిలో యీకారము కూరిన వంకాయలన్నియు ఒక్కొక్కటిగ వేయవలెను. పొయిమీదపెట్టి మూత పెట్టవలెను. రెండుమూడు సార్లు కాయవిడిబడకుండా అడుగుకాయలు పైకి పైకాయలు అడుగుకువచ్చేటట్లు కుదిలించవలెను. వేగిన తరువాత గిన్నెదింపి కాయలన్నిటిని ఒక పళ్లెములో పెట్టి అన్నములో వేసుకొని భుజించిన చాలా రుచిగా నుండును.

### — సొజ్జ అప్పాలు —

ఒకసేరు మైదారవ్వను కొంచెముఎర్రగావేయించి దానిలో ఒకశేరుపాలు పోసి గట్టిగా ముద్దఅయ్యేవరకు వుడకనియ్యవలెను, దానిలోనె సవాశేరు పంచదారపోసి కలియబెట్టి దింపవలెను. ఒకశేరు మైదాపిండిని గట్టిగాకలిపి యీవుడకబెట్టి వుంచిన సొజ్జను నిమ్మకాయంత ముద్దలుచేసి మైదాపిండి యీముద్దకు సరిపోయినంత తీసి యీముద్ద పొదుపవలెను. ఈ ముద్ద చిన్న అరటియాకులో చేతితో గుండ్రగా వచ్చినంత వెడల్పుగా వత్తవలెను. పొయ్యిమీద బాణలి వేసి అందులో ఒక అరవీశె నెయ్యినిపోసి బాగా కాగిన తరువాత యీవత్తిన అప్పాలు నేతిలోవేసి వుడికిన తర్వాత పళ్లెములో తీసియుంచి వేడి తగ్గిన తరువాత భుజించిన చాలా రుచిగా వుండును.

—వి. అలమేలుమంగసోమిదేవమ్మ.

### — సగ్గుబియ్యం వడియములు —

బియ్యం నీళ్లలో రెండు ఝాములు నాననిచ్చి కొట్టిన పిండి బాగా ఆరినది 2 శేరు నీళ్లు 1 శేరు కొలువవలెను. వకగిన్నెయందు $\frac{1}{4}$ శేరు సగ్గుబియ్యం తగుమాత్రం ఉప్పు, కొద్దిగా కారంవేసి సదరు 2 శేర్ల నీళ్లున్నూ పోసి బాగా మరిగిన తర్వాత పిండివేసి కలిపి ఉడికిన తర్వాత దింపి గుడ్డయందు వడియముల మాదిరిగా చిన్నచిన్నవి ఉంచి బాగా ఎండినతర్వాత నేయినికళాయిలో వేసి కాగిన తర్వాత యీసగ్గుబియ్యం వడియములు వేశినచో పువ్వుముల మాదిరిగా విడును. చాలా గుల్లగా యుండును. బహు రుచిగాయుండును. పథ్యకరమైనదిన్ని అయివుండును.

—బాదంపూడి పార్వతమ్మ.

### — పోకచెక్కలు చేయువిధము —

మనకు కావలసినంత బియ్యమును శుభ్రముగాకడిగి నీళ్ళలో నానబెట్టవలయును. తదుపరి ఆబియ్యము పిండికొట్టి ఆపిండికి సరిపడ్డవుప్పుకారమును, తురిమిన కొబ్బరియున్నూ వేసి కలిసి కొంచెముసేపు వుంచి ఆపిండిని పోకచెక్కలంత బిళ్లలుచేసి వుంచిన తరువాత పొయ్యిమీద కళాయిపెట్టి దానిలో నూనెకాని నెయ్యిగాని పోసి బాగుగ మరిగినవెంటనే యీబిళ్లలను వేసి దోరగావేగించి తినిన చాలారుచికరముగాయుండును. వీటినే పోకచెక్కలందురు.

—ననకా శ్రీదేవమ్మ.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాట

## చెలియెడబాటు

శ్రీమతి చావలి బంగారమ్మగారు

మాతోటియాడేటి
    మాచిన్న చెలియా;
మగనితో అత్తింటి
    కేగుచున్నావ?
మజిల వెప్పుడువచ్చె
    దవె మమ్ముజూడ;
మగని జూచిన కండ్ల
    మము మరవకుండ
మా బొమ్మపెండ్లికి
    మరల వచ్చెదవా
మము జూచు కోర్కెలే
    మరచి యుండెదవా

ముసిముసీ నగవుల
    మురిపెములమూట
మగని సిగ్గునజూచు మనసైనయాట
    మగనితో నొంటరిగ మాటాడుపాట
    మదిపొంగుచూ నాటలాడేటిమాట
ఈపాట చవిజూడగలవె నామాట
    లాపాటునను నీకు ఈపాటదెలుపు
కాంతరో కోపించి కనులెఱ్ఱజేసి
    కఠినముగ జూడకే కాంత నాబొమ్మా
ఘనమైన ఈమాట గమనించి వినుమా!
    కనుకొనను జూడుమా కనకంపుబొమ్మా.

౨. వ్యాకరణశాస్త్రకథలు

## క్రియల ధాతయ్య మనుమరాలి పెండ్లి

శ్రీమతి శ్రీపాద శారదాదేవిగారు

క్రియాకాంతమ్మకు దగిన సంబంధము వెదకి పెండ్లిచేయుటలో క్రియల ధాతయ్య చాల ప్రయాసము పడవలసి వచ్చినది. ఈమె బాల్యమునుండియు వ్యక్తిస్వాతంత్ర్యము గోరు స్వభావము కలదియై యొక్క గడియైన యూరకుండకే నిరంతర కార్యాచరణ మగ్నయై తక్కువ వ్యయములో నెక్కువ పని జెల్లదీసుకొనవలెనను ఆలోచన గలదియై యుండెను. ధాతయ్య మనుమరాండ్రయందెల్ల ఈమెయు ఈమె సంతానమును వ్యాకర్ణ ద్వీపాగ్రహారమునందుండు వారలలో ప్రధానస్థాన మాక్రమింపదగినవారుగా నున్నారు.

ధాతయ్యగారు తక్కిన మనుమరాండ్ర కిచ్చినట్టుగానే ఈమెకును బాల్యమునందు కొన్నిడబ్బులు ఇచ్చి ఆమె కిష్టము వచ్చిన వస్తువులను మిఠాయీలను కొని అనుభవింపుమని చెప్పుచుండెడివారు. తక్కిన వారెప్పటి డబ్బులప్పుడే వ్యయముచేసికొనెడివారు. క్రియా కాంతమ్మమాత్రము తాతగా రిచ్చిన డబ్బులలో ఒకటి రెండు మాత్రము ఖర్చుపెట్టుకొని తక్కినవి మూటకట్టుకొనుచు, ఒక్కొక రూపాయి డబ్బులైనప్పుడు వానిని రూపాయిగా మార్చి ఆ రూపాయిని సేవింగ్సుబ్యాంకులో వేయించుకొనుచుండెడిది. ధాతయ్యగారు తమ తక్కిన మనుమరాండ్రెప్పుడు నేదియో తినుచుండుటయు క్రియా కాంతమ్మకు నెవరు

నేదియు కొని పెట్టినట్లు ఏదియో యొక పని చేసికొనుచు నుండుటయుం కని పెట్టి "దానికి కాస్త పెట్టండర్రా" అని వారు తినుదానిలో నుండి కొంత ఆమెకు పెట్టించెడివారు. కాని తక్కిన పిల్లలు "తన డబ్బులు దాచుకొని క్షేమము కొనుకున్నది తేనకు పెట్టాలంటేయేందుకు పెడ్తాము" అని తాతగారితో తగవులాడుచుండిరి. "నీవెందుకు కొనుక్కొనవే అమ్మాయీ?" అని క్రియాకాంతమ్మ నడిగితే ఆమె "నాకిష్టము వచ్చినంత కొనుక్కున్నాను. ఉన్న డబ్బులన్ని ఖర్చు పెట్టుకోవాలా యేమి?" అని తాతగారికి బదులు చెప్పుచుండెడిది.

ఈమె ఈస్వభావము చూచి క్రియల ధాతయ్యగారొకనాడు బంధువులందరి యెదుట "మన క్రియాకాంతమ్మను లుబ్ధాగ్రేసర చక్రవర్తి అనదగినవాని కొకని కిచ్చి పెండ్లిచేస్తాను. అప్పుడు దీనికి బుద్ధి వస్తుంది. లేకపోతే దీనికి పిసినిగొట్టుతన మెందుకు?" అని పరిహాస గర్భితముగ కోపము నటించిరి. అప్పుడు క్రియాకాంతమ్మకు కోపము వచ్చి వారిమధ్యనుండి లేచిపోయినది. తరువాత పెండ్లీడునకు వచ్చిన ఆమెకెన్ని సంబంధములో తారటస్థించి-పిల్లయును పిల్లవాడును ఒకరి నొకరు మెచ్చుకొను సందర్భమువచ్చి తాతగారు మాట్లాడివచ్చిన యేపెండ్లికొడుకును గూడ క్రియాకాంతమ్మ వరించలేదు. ఆమెను బలవంతపెట్టుటంత శ్రేయస్కరమైన పనిగాదు అని తాతగారామెస్వభావము నెరిగినవారు కావున క్రొత్తక్రొత్త సంబంధములు మాట్లాడుచుండిరి.

క్రియాకాంతమ్మకు పదమూడేండ్లుదాటి పదునాలుగవ యేడు వచ్చినదని లోకులు చెప్పుకొనదొడగిరి. ఆమె చెరువునకు నీళ్లకు పోయి మడి కట్టుకుని నీళ్లబిందె భుజమున పెట్టుకొని ఇంటికి వచ్చుచుండగ ఆమె యవయవ విస్ఫూర్తి కల్హారకోరకములవలె మెరయు గురుకుచయుగ్మమును సన్నని నడుము పిరుదుల గొప్పదనము నడకలోని శృంగార మాంద్యములను జూచిన అమ్మలక్కలెల్ల ముక్కులపై వ్రేళ్లు వేసుకొనుచు తమలో దాము గుసగుసలాడ జొచ్చిరి. పొరుగూరినుండి వచ్చిన పూర్వనువాసిను లొకరిద్దరు ఆయూరి కాంతామతల్లుల వెంట చెరువునకు రాతటస్థపడెను. అప్పుడు వారు క్రియాకాంతమ్మను చూచి ఈమె యెవరి కోడలు? ఎవరింటి యాడపడుచు ఏమిటిది?" అని ప్రశ్న వేసిరి. క్రియాకాంతమ్మ యెదుట ఆప్రశ్నలకు తగిన సమాధానములు ఎవరును చెప్పకుండిరి. కాని ఆమెపరోక్షమున నిజమైన సంగతి తెలిసినప్పుడు వారు "పట్టణాలలోకాకుండా పల్లెటూళ్లలో గూడా ఇట్లాకాలిపోతున్నాయి" అని తమ యాశ్చర్యమును కోపములో వెల్లడించిరి. తల్లిగాని తాతగాని ముత్తవతల్లిగాని "అమ్మాయీ ఇప్పటినుండి నీవు ఇల్లుదాటి వీధిలోనికి పోతే అమ్మా" అని అన్నారు. క్రియాకాంతమ్మ అందునకు బదులుగా నిట్లు చెప్పుచుండెను "నేనింట్లో కూర్చోలేను. చెరువున కెళ్లి నీళ్లు తేకుండా ఉండలేను. ఎవరేమనుకున్నా సరే. తలవంచుకొని నాపని నేను చేసుకుంటూ ఉంటాను."

ఒకనాడొక గృహస్థువచ్చి ధాతయ్యగారితో రహస్యముగ "మీవూళ్లో అవ్వయాలవారి కుటుంబములో ఒక వరుడున్నాడని తెలిసివచ్చినాను. వారిసంబంధమును చేసుకోవడం విషయములో అనుభవజ్ఞులైన మీసలహా కోరి తిన్నగా మీ యింటికే వచ్చినాను. కన్యాదానము చేసిన ఫలము మీకు దక్కుతుంది. నాకీవిషయములో సహాయము చేసి గట్టెక్కించాలని యెంతోసేపు ప్రతిమాలుకొనెను. క్రియల ధాతయ్యగారు దిదియెంతపాటిపని యని చెప్పి అవ్వయాలవారి యింటికి వొక మనుష్యుని చేత కబురంపించి పెండ్లికొడుకును తమ యింటికి రప్పించుకొనిరి. వరాన్వేషణమునకై వచ్చిన క్రొత్త పెద్దమనుష్యుడు ఆపిల్లవానిని పలకరించి తమ కతడు అన్ని విధముల దగినవాడని సమాధానపడి కట్నము విషయమై ఆపిల్లవాని తల్లిదండ్రులతో బేరము నారంభించెను. క్రియల ధాతయ్యగారా వ్యవహారములో జోక్యము కలుగజేసుకొన్నప్పటి నుండియు పెండ్లిపిల్లవాడు వీరి యింటికి పలుసారులు వచ్చుట తటస్థపడినది.

వచ్చినగృహస్థు తనకోమార్తె ఒడలినిండా ఇన్ని నగలు పెట్టుకొనవలయుననియు సుఖముగా తానింత తిని ఇతరులకింత పెట్టునంతటి సంపన్నగృహస్థుని యింట పడవలెనని కోరుచున్నవాడు. కావున ధాతయ్యగారు వారికిట్లు చెప్పివేసిరి. పెండ్లివారు వియ్యన్నాట పదహార్లకు నొక్కచిల్లిగవ్వ తక్కువైన వారొప్పరట. ఆడుబడుచు లాంఛనాలయితే నేమి, వెండిచెంబులు పట్టుపంచలయితే నేమి అలకసామాన్లైతే నేమి యింకొక అయిదువందల రూపాయలు మీరు ఖర్చుపెట్టదలచినట్లయితే మీరు ఈసంబంధం విషయమై ప్రశంసింపవచ్చునే కాని మరొక లాగైతే ఈసంబంధము విషయమై ఆశపెట్టుకొనవద్దని వారు మీతో ఖచితముగా చెప్పివేయమన్నారు.

ఆవచ్చిన బ్రాహ్మణుడు అన్నిటికిని ఒప్పుకొని మూహూర్తనిశ్చయము చేసుకొని వధూవరులొండొరుల చూచుకొనుట మొదలగునవి జరిపి నిశ్చితార్థతాంబూలములు తీసుకొను అవశిష్టముగ నన్నియు మాట్లాడుకొని వెడలిపోయెను. కాని తరువాత నాగృహస్థుడు యేకారణము చేతనో మేము అనుకొన్నవాటికి రాకుండ మొగము తప్పించివేసెను. అంతేకాదు. ఈసంబంధమును గూర్చి అవచనీయము లెన్నియో పలుకుట నారంభించెను. ఆకారణముననో మరి యెందువల్లనో అన్యయాలవారి పిల్లవానికి పిల్ల నిచ్చెదమని వచ్చువారు లేకుండపోయిరి. అంతట అన్యయాలవారు తమ పిల్లవానికి ఆసంవత్సరము పెండ్లిచేసి తీరవలెనని దృఢప్రతిజ్ఞ పట్టిరి.

ఆపిల్లవాడట్లు రెండుమూడు సారులు క్రియల ధాతయ్యగారి యింటికి వచ్చినపుడు భోజనము చేయుటయేగాక వారియాడవారు వీరింటికి వీరియాడవారు వారింటికి వచ్చుచు పోవుచు బంధువులవలె మెలగుచుండుట గూడ జరిగిపోవుచుండెను. క్రియా కాంతమ్మ ఆపెండ్లిపిల్లవాని విషయమై యెక్కువ యాదరణభావము చూపించుచు అతని తల్లిదండ్రులయెడను ఆమె మిక్కిలి మర్యాదయు మన్ననయు ప్రదర్శింపదొడగెను. ధాతయ్యగారి యాడంగులతో మాటవరుసకు వచ్చి పిల్లవానితల్లి "మాకోడలీవూరిలో వుండగా మరియొకవూరి సంబంధమెట్లా కుదురుతుంది?" అని గడుసుదనముగా దమతో సంబంధము చేయుటకు ధాతయ్యగారు ఒప్పుకొనకపోగను ఆశ వెల్లడించెను. ఒకనాడాపిల్లవాని తండ్రి పలువురు పెద్దమనుష్యులు కూర్చుండియుండగ క్రియల ధాతయ్యగారి నుద్దేశించి "మాపిల్లవాని పెండ్లివిషయమై మీరింత శ్రమపడికూడా కృతార్థులు కాలేదన్నమాట రాకుండగా చేయగలరని ఆశించుచున్నాను." అని పలికెను. అంతట ధాతయ్యగారామాటలందుకొని "మీకాభయమక్కరలేదు. అంతగా వచ్చినప్పుడు మాక్రియాకాంతమ్మను మీపిల్లవానికిచ్చి మీమర్యాద దక్కించుతాను లెండి" అని ఉత్సాహముగా బల్కెను. "ఐతే అమాటేఖాయం చేయం" దని ఆపెద్దమనుష్యులందరు పట్టుపట్టుటచేత కడకు క్రియా కాంతమ్మ అన్యయాలవారి కోడలై పోయినది. ఆమెకు పుట్టినవారే వెనుకటి వ్యాసములో నేను దెలిపిన స్వార్థకమ్మ మొదలగు వారని పాఠకులు జ్ఞాపకమునకు దెచ్చుకొందురు గాక!

3. కథల పిచ్చి

## కథల పిచ్చి

శ్రీమతి మల్లవరపు లక్ష్మీదేవిగారు

అనగా అనగా ఒక ఊళ్లో ఒకరాజుండేవాడు. ఆరాజుపేరు కామరాజు. చిన్నప్పటినుంచి కామరాజు కథలంటే చెవి కోసుకొనేవాడు. రాజ్యానికి వొచ్చాక కథల పిచ్చి మితిమీరిపోయింది. ఒకనాడు లోకంలో లేనిదీ, ఎవరూ ఇదివరకు విననిదీ, అంతులేనిదీ ఒక కథ చెప్పిన వారికి తన రాజ్యంలో అర్థభాగ మిస్తానని చాటింపించాడు. కథ మధ్యలో ముగిసిందంటే, చెప్పినవాడి బుఱ్ఱ తీయిస్తా నన్నాడు. అనేకమందివొచ్చారు. ఒకటి రెండు

రోజులలో వాళ్ల కథలు ముగిసాయి. కనికరం లేకుండా వాళ్ల బుర్రలు తీయించి కోట గుమ్మానికి కట్టించాడు రాజు. ఒకరోజున నొక పేదరాసిపెద్ద మ్మొచ్చి, 'నేచెప్తాకథ' అంది. 'నిష్కారణంగా చస్తావు ముండా' అన్నారు అందరుప్రజలు. కాని పెద్దమ్మ వినలేదు. రాజు తలారివాళ్లని సిద్ధంగా వుండమని, కథ వినడం ప్రారంభించాడు. 'అనగా, అనగా ఒకఊళ్లో ఒక ముసలమ్మ ఉండేది. పడుకునేందుకు మెత్తగా ఉంటుందని ఒక బొంత కుట్టుకుందామను కొంది. అనుకొని నూతిదగ్గర కూర్చొని బొంత కుట్టుతోంది. కొంతసేపటికి సూది జారి నూతులో పడిపోయింది' అంది పెద్దమ్మ. "ఊఁ" అన్నాడు రాజు. 'ఊఁ అంటే వస్తుందా నూ'దంది పెద్దమ్మ.

'కథ జరగనీ' అన్నాడు రాజు.

'జరిగితే వస్తుందా' అంది ముసలమ్మ.

రాజు—వస్తుంది.

పెద్దమ్మ—వస్తుందంటే వస్తుందా?

విసుగొచ్చింది రాజుకి. ఆవులించాడు. 'ఆవులిస్తే వస్తుందా' అని పెద్దమ్మ ఎత్తి పొడిచింది. 'ఇంతే నేఁవిటి కథ?' అని అడిగాడు రాజు. 'కథఎంతైతే వస్తుంది సూ'దంది. రాజు తన తెలివి తక్కువతనానికి విచారించాడు. 'పెద్దమ్మా! నన్నొదిలిపెడుదూ, నీకు పుణ్యం వుంటుంది' అన్నాడు రాజు. 'కథంతా వినందే వొదిలిపెట్టడం ఎలాగా? వదిలితే మాత్రం వస్తుందా సూది?' అంది పెద్దమ్మ. 'సగం రాజ్యం పుచ్చుకో తల్లీ! నన్నుమాత్రం వొదిలెయ్యి' అన్నాడు రాజు విచారంతో. పెద్దమ్మ నవ్వింది. "ఓరి తెలివి తక్కువ పెద్దమ్మారా! యుక్తకోరిలు కోరి ఎంతమంది బుర్రలు తీయించావురా? ఓరీ కథల కామ రాజా! వొదిలిందా నీకథల పిచ్చి! నీరాజ్యం ఎవరికి కావాలి? ముసిలిముండని నేను రాజ్యం ఏల్తానా? ఇంకనైనా రాజ్యం న్యాయంగా ఏలుకో!" అని చెప్పి పెద్దమ్మ వెళ్లిపోయింది. అప్పటినుంచి కామరాజుగారి కథల పిచ్చి తగ్గింది. కథ కంచికి. మనం ఇంటికి మీరూ చూడావు. మారూ పాడావు.

## ఎత్తుకు పైయెత్తు

శ్రీమతి వీరమాచనేని చుక్కమ్మగారు

అనగా అనగా ఒకఊళ్ళో ఒక బ్రాహ్మణుడు. ఆబ్రాహ్మణుడు పెళ్లిళ్లకు తద్దినాలకు వెళ్లి బాగా సంభావన సంపాదించేవాడు. ఆడబ్బుపెట్టి ఒకసారి ఆబ్రాహ్మణుడు ఒక ఉంగరం చేయించుకొన్నాడు. వాళ్లయింటి కెదురుగుండానే ఒక కోమటి ఉండేవాడు. అంతా మంచి వాడే. కాని పాపం అతనికి ఒక్కటే దుర్గుణం ఉంది. ఎవళ్లేనా సరే, ఏదేనా కొత్త వస్తువు తెచ్చుకొంటే దాన్ని దొంగలించందే ఒదిలిపెట్టేవాడు కాడు. బ్రాహ్మణుడు 'స్నేహితుడే కదా' అని తన ఉంగరం ఆకోమటికి చూపించాడు. చూచే చూడడంతోటే అతని కళ్లు

దానిమీద పడ్డాయి. దాన్ని ఎల్లాగేనా బ్రాహ్మణునికి తెలియకుండా లాగేయాలని బుద్ధి పుట్టింది ఆకోమటికి. బ్రాహ్మణుడుకూడా సామాన్యుడా మరి! అతి తెలివితేటలు కలవాడు. సక్కజిత్తులన్నీ బాగా తెలుసును. కోమటిఉద్దేశాన్ని క్షణంలో కనిపెట్టేశాడు. "సరే వీడి పని యిల్లా ఉందా?" అనుకున్నాడు. అప్పుడు తత్క్షణం కోమటి చూస్తూండగానే ఆవుంగరం ఒక చిన్న డబ్బీలో పెట్టి యెదురుగుండా ఉన్న ఒక గూట్లో దాచాడు. పాపం కోమటి రాత్రి యెవ్వరికి తెలియకుండ వచ్చి దాన్ని తీసుకోవచ్చు కదా అని చాలా మురిసిపోయాడు. ఏమీమాట్లాడకుండా యింటికిచక్కాపోయాడు. కోమటి వెళ్ళిపోగానే బ్రాహ్మణుడేమిచేశాడు?—చటుక్కున డబ్బీలోంచి ఉంగరంతీసి ఎక్కడో దాచేశాడు. పైగా—ఎక్కడినుండి తెచ్చాడో—ఒక తేలుని ఆడబ్బీలో పడవైచి మూసి వేసేశాడు. తరువాత పెందరాళే భోజనంచేసి రాత్రి కాగానే సావిట్లో నిద్రపోతూ ఉన్నట్లు ఒక మంచంమీద గుప్‌చిప్‌గా పడుక్కున్నాడు. వీధి తలుపులు బార్లా తెఱచే ఉండనిచ్చాడు. అప్పుడప్పుడు కళ్లు తెఱుస్తూ, ఏం తమాషా జరుగుతుందో కనిపెడుతున్నాడు. పాపం కోమటి యిదేసమయం అనుకొని మెల్లిమెల్లిగా వీథిలోకి వచ్చి అటూ నిటూ పచారు చేస్తున్నాడు. తలుపులు తెఱచి ఉండడం బ్రాహ్మణుడు నిద్రపోతూండడం, చూచి చంకలు గ్రుద్దుకొనుచు లోపలకే దూరాడు. చప్పుడు చెయ్యకుండా మెల్లగా గూటి దగ్గరకు వెళ్ళాడు. ఇదంతా ఆ మాయబ్రాహ్మణుడు కనిపెడుతూనే ఉన్నాడు. కోమటి సంతోషంతో డబ్బీమూత తీసి చటుక్కున ఉంగరం తీయ బోయాడు. పాపం పాటుక్కున పొడిచేసింది.—ఎఱ్ఱ తేలేమో కూడాను—ఒక్కసారిగా నెత్తికెక్కిపోయింది. దానితో కోమటిపని అయిపోయింది. ఆ ఏడ్పు ఏం చెప్పను! ఒక్కటే గోల. ఈతమాషా అంతా చూస్తూన్న బ్రాహ్మణునకు కడుపు ఉబ్బేలాగ నవ్వు వస్తోంది. అతి కష్టంమీద ఆపుకొంటూ 'ఏమి' ఉంగరం ఎల్లా ఉంది? అని అడగడం మొదలెట్టాడు. అసలే దొంగతనం ఎక్కడ బయలుపడిపోతుందోయని యోచిస్తున్నాడు. ఆమాటలతో మరీకాస్త సిగ్గుపడిపోయాడు. నోరెత్తకుండా పప్పు జారినట్లుగ జారిపోయాడు. అప్పటినుంచి ఏదైనా క్రొత్త వస్తువును చూచినప్పుడు కొంచెం తమాయించడం మొదలుపెట్టేడు. కథ కంచికి వెళ్ళింది. మన మింటికి వచ్చాము.

## బాలక్రీడ

శ్రీమతి కొడాలి బసవపూర్ణమ్మగారు

నాఁడు హోలీపండుగ. రాత్రి వర్షము కురిసియుండుటంజేసి గ్రామములోని పిల్లకాలువలు వెల్లువలై నాటియుదయమునఱకును ప్రవహించుచునేయుండెను. చిన్నబాలిక లిరువురు క్రొత్తదుస్తుల ధరించి వీథిలో నాడుకొనసాగిరి. వారిలో మాయ యనుబాలిక దేవకి యను పిల్లపై నీళ్ళనుజల్లి వస్త్రములను మురికిచేసి పరుగిడబోవునంతలో దేవకితల్లి వచ్చి యామె కుమార్తె యేడ్పునకు కారణము నడిగి తెలిసికొని మాయ కొక లెంపకాయ బహుమతిగా నిచ్చినది. అంతట మాయ గొల్లున నేడ్చుచు తల్లిదగ్గఱకు పఱుగెత్తుకొనిపోయినది. తల్లి

ఆయేష్పను విని బజారులోనికివచ్చి! దేవకితల్లిని తిట్టసాగినది. క్రమముగా యుద్ధకాండము ప్రారంభమయినది. అంత నొక వృద్ధమాత యిట్లనినది. "ఏమిటమ్మా నేడు పర్వదినము గదా; పోనిండు" అని. కాని, వారిలో వినువారేరీ? చివర కాబాలికలిరువురే యీక్రింది విధముగా పోరాటము నాపివేసిరి. ఒకవైపు స్త్రీపురుషులంచ తేకమై జగడమాడుచుండ, మఱొకవంక దేవకి మాయ నోదార్చి మరల నక్కడకే వెళ్లి యాడుకొనసాగినది. ఒకచిన్న గుంటలోని నీటిని కాలువగాజేసి దానిలో గడ్డిపరకలు వైచి యాప్రవహించుచున్న జలమువంక తదేకదృష్టితో చూడసాగిరి. ఒకతృణము కొట్టుకొనిపోవుచుండెను. అంతట వీరిద్దఱు బాలికలు నవ్వుచు, పోరాటముదగ్గఱకు వెళ్లిరి. వృద్ధస్త్రీ. సంతోషముతో పరుగులు వెట్టుచున్న బాలికలను గాంచి యిట్లన్నది: "ఈయిద్దఱు బాలికలకొఱకేనా యీపోరాటము; సిగ్గులేదటమ్మా; పాపమీపిల్లలు గతించినదానిని మఱచి ప్రేమతో నాడుకొనుచున్నారు. మఱి, మీరలో; మహాభారతములోని కర్ణపర్వమునే ప్రారంభించిరి. మీకంటె నీపిల్లలే వేయిరెట్లు మంచివారనిపించారే" అని.

అంత నందఱు నిశ్శబ్దముగానుండిరి. మనుజుడెంతవఱకు బాలబాలికలవలె తన యంతఃకరణమును శుద్ధము గావించుకొనడో అంతవఱకును పరమాత్ముని దివ్యసందర్శనమును బడయజాలడను పెద్దలవాక్యములను మఱల మఱల స్మరించుకొనుచు బాలలీలలను మఱిమఱి దలంచుచు, నచ్చట నున్నవారందఱు తమతమదారినిఁ బోయిరి.

## నావికా!

కనకదండి గోపాలకృష్ణ శాస్త్రిగారు

గగనమంతట మేఘాలు క్రమ్ముకొనియె
రాలవర్షంబు జలజల రాలుచుండె
సంద్రమంతయు కెరటాల సరణిచేత
నల్లకల్లోల మయ్యెను అన్నిదిశల
వీచుచుండెను పెనుగాలి వేగముగను
ఫేనశకలాలు గాలికి పైకినెగిరి
పడుచునుండెను ముత్యాల పదిగిలోన
దిక్కులేమియు దెలియక దిక్కుఅయ్యె
దారితెన్నును గానక హోరుమనుచు
నావ ఏవైపుకోగాని నడచుచుండె
నలలదెబ్బకు తలక్రిందులగునొ? ఏమొ?
రాతిదెబ్బకు ముక్కలై చితికిపోనొ?
చేతచుక్కాని గట్టిగ సేకరించి
కాచుకొనుమోయి, నావికా, కాచుకొనుము!
కండ్లముందరి వస్తువే కానరాదు
చుక్కకన్నెల తళతళ చూడరాదు
మెఱపుతీగెలు ధగధగ మెరయువయ్యె
కానుపింపదు దీపాల కాంతి యెచట
వెలుగుమాటయె దూరాన వెడలిపోయె
ఎటుల దారిలో బడుదుమొ? ఎఱగమయ్య!
ఈమహాంధకారమునుండి యిపుడు మాకు
వేడుచుంటిమి చూపింప విమలదీప్తి
నావ దేనిని డీకొని నలిగిపోనొ?
చేతచుక్కాని గట్టిగ సేకరించి
కాచుకొనుమోయి! నావికా! కాచుకొనుము!




## కళ్యాణి—రూపకతాళం

సా సరి గరి గా,, గమ_పా పమ గరి సా,,,, ॥ ॥
శ్రీ గృహ ల_క్ష్మీ॥ చిర_జీ వవు గ_మ్మా॥ ॥ ॥
సా పసాని దదని పాప_సా సని దప_నిధపమగరి॥
భా గ ధేయ గరి మ నాంధ్ర_భా రతి_ని హా_ర వగుచు॥
॥ సా సస సాగరి గగ మమ_పా మగ రీస దని ససా।
నీ గుణ సంపద గని రమ_ణీ గణ మింపొ దవ సదా।
సా గరి పనిద మపద నీ_సాని దప పామ గరి సని॥ సా॥
స్వా గత మొసగ జెలగి నీ_వాగ మృత ధార జిలుకుచు॥ శ్రీ॥

—దాసుఁడు

## శివస్తుతి

శ్రీమతి ఓరుగంటి సుభద్రమ్మగారు

హిందూస్తాని భైరవి. ఆటతాళం

కైలాసాలయ మాం పరిపాలయ। తవ। కరుణాకటాక్షస్మయి। చాలయ॥ హే! కైలా॥
గజచర్మవసనభు, జంగభూషా, గిరిరాజవరపుత్రీ చిత్తతోషా।
సాంద్ర జటాగుప్త కూలంకషా। బాల। చంద్రశోభితశీర్ష దివ్యవేషా॥ హే కైలా॥
హుతభుగాదులనేత్రయుక్త ఫాలా। హస్త మండితహేమమయత్రిశూలా।
లీలాధిష్ఠితవృషభ భక్తలోలా। హేలానిర్జితత్రిపురనీలగళా॥ హే కైలా॥
ధవళాట్టహాస తవ తాండవే। దధిగిణత, దధిగిణత శబ్దశ్రూయతే।
మేఘగర్జితమితి తంసదా। మూఢజనః ఖలుమన్యతే॥ హే కైలా॥
ఏహిముదం దేహీభోప్రభో। మహిషాసురమర్దనీవిభో।
చౌర్యాది దురిత భయంకర। శంభో సుమశరహర శంకర॥ హే కైలా॥

# కథలు-కబుర్లు

## సంయుక్త రాష్ట్రి శాసన సభ తీర్మానములు:—

సంయుక్తరాష్ట్రి శాసన సభలయందు ఆర్థిక మంత్రియగు కైలాస శ్రీవాస్తవగారి సతి యీక్రింది తీర్మానమును నుపపాదించెను. "బాలురకు విద్యాభ్యాసము విధాయకమై యుండు చోటులం దంతటను బాలికలకు ప్రారంభ విద్య నిర్బంధము చేయుటకు ప్రభుత్వమువారు చర్య పుచ్చుకోవలెనని యీసభ తీర్మానించుచున్నది". దేశమునుండి విద్యాహీనతను తొలగింపవలెననియు, శిశువులకు విద్య నేర్పుటకు తల్లులు విద్యావంతులై యుండవలెననియు నీ రుపన్యసించిరి. ఈ యుపపాదనముపై ఆర్థిక మంత్రిగారు స్త్రీవిద్యకై సర్కారువారొనర్చిన యేర్పాటుల నేకరువు పెట్టుచు నుపన్యసించిరి. తర తరములనుండి విడువక వేధించు చున్న పూర్వాచారములను, పరదా పద్ధతియును సర్కారువారి ప్రయత్నములకు అడ్డువేయుచుండెనని వీరు వచించిరి. తీర్మానముపై స్థానిక పరిపాలకుల అభిప్రాయములను గొనుటకయి, యీతీర్మానమునకు దాము సమ్మతించెదమనియు ఈలోపల ఆర్థిక స్థితులు చక్కబడి ఈ తీర్మానమును అమలులో పెట్టుటకు వీలుకలుగ వచ్చుననియు వీరు వచించిరి. తీర్మానము వోటుకు పెట్టబడి ఏకగ్రీవముగ అంగీకరింపబడెను. అ॥ వ॥

## గజాకారమగు భవనము:—

అమెరికాసంయుక్తరాష్ట్రిములలో ఒకధనాఢ్యునకు యేనుగలయెడల మిగులఅభిమానము. కనుక అతను తన భవనమును గజాకారముగ నిర్మించుకొనెను. ఇల్లు దూరమునుంచి చూచిన పెద్దయేనుగువలె నగుపించును. ఏనుగ నాలుగుకాళ్లవలెనుండు నాలుగు స్తంభములపై యిల్లు మోపియున్నది. మొదటిరెండుకాళ్ళలోను మేడమీదికివెళ్లుటకు వంకర మెట్లును, తక్కినకాళ్ళలో సామాన్యపుగదులును నున్నవి. మేడమీద ఆరుగదు లున్నవి. చావడి యేనుగ కడుపులోనున్నది. ఈచావడియెత్తు అరువదియైదు అడుగులు. ఏనుగశరీరము పొడవు ముప్పదియెనిమిది అడుగులు. ఏనుగు కైవారము రెమువదిఅడుగులు. ఒకొక్కకాలుపొడగు 22 అడుగులు. పద్దెనిమిదిఅంగుళముల వెడల్పుగల కిటికీలు ఏనుగుకండ్లవలె నుండును. ఇంటికి మొత్తముపైని యిరువదిరెండు కిటికీలున్నవి.

## కీ॥ శే॥ మరకాని పరాత్పరరావుగారు:—

14-2-33 తేదీన మధ్యాహ్నం పన్నెండు ఘంటలకు శ్రీమరకాని పరాత్పరరావుగారు దివంగతులైరని యాంధ్రలోకమునకు వెల్లడించుటకు జాల చింతించుచున్నాము. ఈతడొక కష్టజీవి. నుమా రిరువదిరెండేండ్ల ప్రాయము. శ్రీపరాత్పరరావుగా రాంధ్రలోకమునకు చిరపరిచితులు. వ్యాసకర్త, కథకుడు. సమదర్శిని, కృష్ణా, ఆంధ్రజ్యోతి, దీనబంధు మున్నగు పత్రికా రాజములయం దాతని నామ మిప్పటికిని మాఱుమ్రోగుచున్నది. అతడు రచించిన వ్యాసములు, కల్పించిన కథలు, అమూల్యములు. ఆంధ్ర భాషా యోష కాతడొనరించిన సపర్య లనుపమములు. అతని కథ లాంధ్రభాషకు ముత్యాలసరములు, పరాత్పరరావు

ఋషివంటివాడు. మిత్రులయందు వాత్సల్యము, శత్రులయెడ మానముగలవాడు. స్వోత్కర్ష, పరనింద యెఱుగని మానవుడు. ఇతరు లెవరైన తన్నుగూర్చి నిందించినప్పుడు చెవియొగ్గి వినునంతటి సాత్వికుడు. అతని గోల్పోవుటలో తల్లిదండ్రులు లోకయుత్తమ పుత్రుని, మిత్రులోక యాంతరంగిక స్నేహితుని, దేశ మొక యాదర్శ పురుషుని, యాంధ్రభాష యొక నిజమగు పరిచరుని పోగొట్టుకొనె ననుటలో నతిశయోక్తి గానరాదు. పరాత్పరరావుగారి తల్లిదండ్రులకును, వారి మిత్రబృందమునకును మా సానుభూతి నిదే తెలియజేయుచు నింతతో విరమించుచున్నాము.

## బండియే కచ్చేరి, బండియే యిల్లు:—

చికాగో పట్టణములో ఒకవ్యవహారస్థునికి ఒక అసాధారణపరిణామము గల పెద్దబండి యున్నది. అందులో ప్రయాణము చేయుచునే తన వ్యవహారమునంతటిని అతడు చేసుకొనుచుండును. ఇతని పేరు జార్జి ఏ. హాల్యాను. అడిసను అప్లయన్సుకంపెనీ కధ్యక్షుడు. ఆబండిలో స్నానపుగది, కచ్చేరిగది, పడకగది, వంటిల్లు సమస్తసదుపాయములతో నున్నవి. కుర్చీలు, మేజాలు, పటములు, వ్రాతపరికరములు వంటసామాను, దానికి తగిన సిబ్బంది అందులో విద్యుచ్ఛక్తిదీపములు, టెలిఫోను, పైపులు—అందులో లేని సదుపాయములు లేవు. వ్యవహారములు బలిసి మోపైనకొద్దీ ఇట్లుకూర్చున్నచోటనే కుర్చీ, నిలుచున్నచోటనే నిలువుటద్దముగా సమస్త పరికరములను కూర్చుకొనవలసిన ఆవశ్యకత హెచ్చుచుండును.

## ఇంగ్లాండులో శవదహనములు:—

ఇంగ్లాండు దేశములో శవములను పాతిపెట్టుట యాచారము. ఇందుకొరకెంతో ఖర్చగుచుండును. ఈఆర్థికదుస్థితిలో ప్రజలు శవములను పాతిపెట్టుకొనలేక దహనము చేయుటను ప్రారంభించినారు. శవములను పాతిపెట్టుటవలన కుళ్ళి ముఱిగి దుర్వాయువులు ప్రసరించి ప్రజలు అనారోగ్యముపాలగుదురు. శవదహనమట్లుకాక ప్రజారోగ్యకరమైన పద్ధతి. హిందూదేశములో నాటినుండియు శవములను కాల్చుటయే ఆచారము. దీనికి ఖర్చుకూడ తక్కువ. పాశ్చాత్యదేశములలో శవదహనమునకు, శవములను పాతిపెట్టుటకంటె ఖర్చుతక్కువయే యైనను హిందూదేశములో ఖర్చుకంటె అది చాలా యెక్కువయట. ఈఆచారము క్రమముగ ప్రబలమగుచున్నది. 1931 లో ఇంగ్లాండులో 5195 శవములను 1932 లో 6315 శవములును కాల్చబడినవి. ప్రస్తుతఆర్థికవిషమస్థితికారణముననైనను ఇంగ్లాండు ఈవిషయమున నెక్కువ ఆరోగ్యవంతమైన పద్ధతి నవలంబించుట యెంతయు ప్రశంసనీయము—ఇది యిప్పు డాచారమగుచున్నను ఈపద్ధతియొక్క ప్రాశస్త్యము నెఱిగి బోవర్లామొదలగువారు తాముచనిపోయినతరువాత తమశరీరములను దహనము చేయవలసినదని బ్రతికియున్నప్పుడే విల్లులో వ్రాసికొనిరి.

## కీ॥ శే॥ నరసింహశాస్త్రిగారు.—

బెజవాడ పురప్రముఖులును, ప్రసిద్ధిగాంచిన న్యాయవాదులును అగు సూరి వెంకట నరసింహశాస్త్రి బి.ఏ, గారు క్రిందటినెల 24 వ తేది మధ్యాహ్నము తమ 53 వ యేట దివి కేగిరని వ్రాయుటకు చింతిలుచున్నాము. ఇప్పటి కొకసంవత్సరమునుండియు వీరు పక్షవాత పీడితులై క్రమక్రమముగ ఆరోగ్యవంతులగుచు వచ్చినను అకస్మాత్తుగ 2 వ తేది ఉదయమున మరల నీ వ్యాధి ప్రబలి నాలుగు రోజులు స్మృతిలేకుండనుండి చివరకు మరణముపాలైరి. నరసింహశాస్త్రిగారు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నాయకులు. పుదుక్కోట ప్రథమ గ్రంథాలయ సభకును, బెల్గాంనందు జరిగిన అఖిలభారత గ్రంథాలయ మహాసభకును ఇంక ననేక సభలకును అధ్యక్షులు. గ్రంథాలయోద్యమమును గూర్చి అనేక వ్యాసములును పత్రికలకు వ్రాసిరి. ఒకగ్రంథమును ప్రచురించిరి. బెజవాడలోని రామమోహన గ్రంథాలయ స్థాపకులలో నొకరు. దీనికి 15 సంవత్సరములు అధ్యక్షులుగ నుండి దీని యభివృద్ధికై చాల కృషి సల్పిరి. శ్రీయుత కాశీశ్వరరావు పంతులుగారి యాజమాన్యమున బెజవాడ పౌరులు జరిపిన మహాసభయే వీరి ప్రజాభిమానమును నిరూపించుచున్నది. నరసింహశాస్త్రిగారి మరణమువలన ఆంధ్రదేశ మొక దేశహితైకాభిలాషిని, నిరాడంబర సేవకుని గోల్పోయినది.

# పుష్పచయము

## పాలు - వాసన:—

పాల విలువయంతయూ రుచిమీద ఆధారపడియున్నది. పాలయందు గల సత్తువజేయు పదార్థముల నంతగా విలువజేయక పోయినను జనులు వాటి రుచిని వాసనను ముఖ్యముగా పరీక్షింతురు. అందుచే పాలు బాగుగా బజారునందు చెల్లుబడియగుటకు వాటియందు గల మంచికన్నను సువాసయు రుచియు బాగున్నవాయని చూడవలెను. మంచి పాలయందు కొన్ని విధములైన చక్కెరలు యుండుటచే రుచియు వెన్నయుండుటచే సువాసనయు వచ్చుచున్నవి. ఈరెండు పదార్థముల మీదనే పాలగుణము ఆధారపడియున్నది. కొన్నివిధములైన ఉప్పులు కూడ దీనికి తోడ్పడుచున్నవి. అవి పాలనుండి విడదీసినయెడల రుచి పూర్తిగా మారిపోవును. మరియు కొంతకాలము పాలను వాడకయుంచినయెడల పులియుట విరుగుట సంభవించుచున్నవి. అందువలన రుచియు వాసనయు కూడ తగ్గును. ఆవులు సరియైన ఆరోగ్యస్థితియందు లేనియెడలను, వాటి ఆహారము వలనను, గాలిలోనుండు కొన్ని సూక్ష్మ జీవులవలనను (Bacteria) కూడ ఈమార్పులు కానవచ్చుచున్నవి. లోహ పాత్రలుకూడ కొంతవరకు కారణములే. ఒకరి రుచి మరియొకరి రుచితో భేదించును. అందరి రుచులును సమానముగా నుండవు. ఒకరికి రుచికరముగా నుండు పాలు మరియొకరికి రుచింపవు. ఆవు యొక్క ఆరోగ్యమునకును పాల మంచికిని గల సంబంధమునుగూర్చి చాల కొద్దిగా తెలియును. ఒకే మందలో ఒకే విధమైన ఆహారమును తిని జీవించు ఆవులలోకూడ, వివిధములైన పాలు వచ్చుచున్నవి. ఈనినపిదప నుండు పాలకును, తుదిమాసముల పాలకునుకూడ భేదముండును. సుమారు 10 నెలలు వచ్చునరికి పాలయందలి తీపి నశించి ఉప్పగా నుండుటకు ప్రారంభమగును. ఈ పాలు అప్పుడప్పుడు గొంతు మంటను కలుగజేసి వెగటుగా నుండును. కొన్ని ఆవులయందు ఈనిన క్రొత్తలో పాలు లోపముల వాసనయు, మందుల వాసనయు గలిగియుండును. కాని ఆవు ఆరోగ్యముగనే యుండును. ఆహారము ఎంత మంచిది పెట్టినను ఈ వాసన నశించదు. దీనికి అజీర్తి కారణమై యుండవచ్చును. మరియు, Calciam .Phoshorous అను రెండు పదార్థములు చాలాకాలము ఆవు తిను ఆహారమునుండి విడదీసిన వాని పాల రుచి బాగుగనుండదు. పొదుగునందు మనకు తెలిసినవానికన్న ఎక్కువ జబ్బులున్నవి. అవికూడ పాల రుచిని పాడుచేయును. అందుచే ఎన్నడైనను పాలు బాగుగ లేనప్పుడు వెంటనే పొదుగు పరీక్ష చేయించి తగు చికిత్స చేయించవలెను. పొదుగుయందు వాపు, నొప్పి యున్నయెడల పాలను పితుకగూడదు. పాలలో ఏవిధమైన మార్పు లేకపోయినను వాసన చెడియుండును. సాధారణముగా నీచు వాసన యుండును. జబ్బుపాలు కొన్ని మంచిపాలతో కల్పిన వాసన నశించును గాని రుచిమాత్రము బాగుండదు. అందుచే ఆవుల పాలన్నిటిని వేరుగా తీసి పరీక్ష చేసి అప్పుడే కలుపవలెను. పాలు బజారునందు కొనునప్పుడు వాసనమాత్రము చూడక రుచికూడ చూచిన మంచిది. పాల రుచులలో అనేకము లున్నవి. వాసనకూడ యట్లే. కొన్ని నీచు వాసనయు, కొన్ని పండ్ల వాసనయు, ఇట్లనేక వాసనలు కలిగియుండుటకు ఆవు జబ్బు స్థితిలో నుండుటయే కారణము. ఆవు మేయు మేత పాల రుచియందును, వాసనయందును అనేక మార్పులు చెందించుచున్నది. మంచి రుచిని కలుగజేయు

"తెలీదు"
(కోపంతో) మరి నువ్వెందు కిక్కడికి వొచ్చావ్?
"నేను చాలా అందకత్తెనుగనుక"
"మంచిది; పోతే నీలాంటి అందకత్తెల్తో మాకు పనిలేదు"

*　　*　　*　　*

## నిజమైన ప్రేమ

భర్త:—ప్రేయసీ, నీవే మొట్టమొదట నాముద్దును రుచిచూడగల్గిన భాగ్యశాలివి.

భార్య:—అందుకు సందేహమేమియు లేదు. నిజమైనప్రేమగల మీరు నాకు భర్తయగుటచే నాకా భాగ్యము లభించెను.

భర్త:—అహో! ప్రేయసీ, నేను చెప్పిన విషయమునందెట్టి సందేహమును లేకుండ నమ్మినగానవు నీవొక్కతెవే సుమా!

*　　*　　*　　*

పెనిమిటి:—(కోపముతో) ఓసీ, నేను నీకెన్ని జాబులు వ్రాసినా జవాబు వ్రాయలేదు నీకెంత ధైర్యం!

భార్య:—(ఒయ్యారముగ) జాబు లేదు; గీబు లేదు.

పెనిమిటి:—ఓసి నీయన్యాయంమండ. ఒక్కజాబుకూడా నీకు చేరలేదా! అంత పచ్చిఅబద్ధాలా!

భార్య:—ఒక్కటీరాలేదు. అంతేగాకుండా మీరు వ్రాసిన సంగతులలో వొక్కటిగూడ నాకు నచ్చలేదు.

*　　*　　*　　*

## పేరాశ

తల్లి:—(డాక్టరును చూచి) అయ్యా నాకుర్రాడు దమ్మిడీని మ్రింగేశాడు. అది వాడిగొంతుకలో చిక్కుకుంది. దయచేసి తీయండి.

డాక్టరు:—దానిని బయటికి తీయడానికి అయిదురూపాయలివ్వాలి.

తల్లి:—ఛీస్, చాలా బాగుంది. నువ్వు మాపిల్లవాడి గొంతుకలోనుంచి దమ్మిడీని బయటికి తీస్తే దానితో పచ్చిమిరపకాయలు కొనుక్కుందామనుకున్నాను. ఇందుకు నీకైదురూపాయలు కావాలా?

*　　*　　*　　*

శాస్త్రిలు:—అయ్యా, నాకుర్రదానికి పెండ్లియీడు వచ్చింది. దయచేసి వొకయిరవైయేండ్ల వరుణ్ణి చూస్తారా?

అవధాని:—అలాగే, కాని వొకవేళ యిరవైయేళ్ళవాడు దొరకకపోతే పదేళ్ళవాళ్ళిద్దరిని చూస్తే ఫరవాలేదుకదా అండీ!

*　　*　　*　　*

మాజిస్ట్రేటు:—(ముద్దాయినిచూచి) ఏమిరా, యింతకుముందెన్నోసార్లు దొంగతనానికి పోట్లాట్లకి దండన అనుభవించావే! మళ్ళీ సిగ్గులేకుండా ఎలావొచ్చావు?

ముద్దాయి:—మహాప్రభూ, తాము నాయందు దయయుంచి మెల్లగా మాట్లాడండి; నాకు చెవుడు లేదు. నాకు పిల్లనిచ్చే పెద్దమనిషి బయటనే వున్నాడు. మీమాటలు ఆయన చెవులో పడిందంటే నా పెండ్లి భగ్నమౌతుందండీ.

*　　*　　*　　*

# గ్రంథపరిచయము

**సూర్యనారాయణశతకము:—**

గ్రంథకర్త: డాక్టర్, జటావల్లభుల వెంకటేశ్వరులుగారు (అచ్చంపేట.) డెమీ సైజు 16 పు. వెల రు.0-1-6.

ఇందు "శ్రీసూర్యనారాయణా" అను మకుటముతో 108 శార్దూల మత్తేభవృత్తము లున్నవి. భక్తిపూరితములగు శతకములలో నీతులనుగూర్చి వ్రాయుట" ఈకాలమునకుగూడ మిక్కిలి యవసరమని కవిగారి యుద్దేశము. శైలియందును, రసపుష్టియందును, నీతి వైరాగ్యబోధనమునందును ఈ పద్యములు పూర్వపు శతక కవుల పద్యములను మరపించుచున్నవి.

**మహేశా:—**

గ్రంథకర్తలు: వేం. వీ. కవులు (విశాఖపట్టణము.) ఫూల్స్కేపు 1/8 సైజు 21 పుటలు వెల రు. 0-1-0. "వైశాఖపురనివేశ మహేశా" యను మకుటముతో ఇందు 101 పద్యములున్నవి. సులభసుందరశైలి, అక్కడక్కడ మంచి శబ్దాలంకారములు, భక్తిరసము గలిగి ముద్దుగనున్నవి. వలయువారు "పూషర్ల నారాయణమూర్తిగారు, కొత్తపేట, విశాఖపట్టణము" నకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

**యోగదర్శని:—**

రాయలు 1/16 సైజు. 80పు. అరవిందయోగి వ్రాసిన "Yoga and its object" అను గ్రంథమున కాంధ్రానువాదము. యోగమన నేమో తెలియక అనేక పాశ్చాత్యులును పాశ్చాత్యభావవాసితులగు భారతీయులును మోక్షకాంక్ష యనునది యొక విధమగు స్వార్థపరాయణత్వమని నిందించుచున్నారు. గ్రంథాదిని యోగాభ్యాసము మానవకోటి కొరకనియు, ముక్తియనునది మానవజాతి ముక్తి యనియు గ్రంథకర్త నిరూపించుచున్నాడు. యోగలక్షణములను తదభ్యాస విధులను తెలియఁగోరువారు దీనిని పఠించి దివ్యానందమును గ్రోలగలుగుదురు. రాజమహేంద్రవరము, వీరభద్రపురములోనున్న భారత శక్తి నిలయమువారు దీనిని ప్రచురించినారు.

**కోనేరు:—**

గ్రంథకర్త; కవికొండల వెంకట్రావుగారు (నరసాపురము) క్రౌను సైజు 30 పు. వెల 0-4-0, స్త్రీలకు 0-2-0.

ఇది అయిదు రంగములు గల చిన్న నాటకము. మొదటి రంగములో విద్యావిహీనలై, సంసారముల నవకతవకగ చేసుకొనుచు, వ్యర్థప్రసంగపరాయణలై కోనేటికి పోవు పుల్లమ్మ, సావిత్రి, రుక్మిణమ్మ, భావమ్మ మొదలగువారలు వత్తురు. రెండవ రంగములో కోనేరు కాపలా కాసేవాడి కేకలు. మూడవ రంగములో కోనేటిలో పొందికగా ఒంటరిగా కోనేటి సౌందర్యము ననుభవించి పాడుకుంటూ సత్యవతి నీళ్లు ముంచుకొనుట. నాల్గవ రంగములో పాశ్చాత్యనాగరికతాప్రమత్త యగు వరహా కళ్లజోడు, కాళ్లజోడు, గొడుగు, యిస్త్రీచేసిన చీర, రవికతో కోనేటికి షికారు వచ్చి చూచి పోవుచుండును. సత్యవతికిని ఆమెకు సంభాషణ. ఆర్యాచారములు, నోములు, గృహనిర్వహణము, విద్యాసక్తి మొదలగువానిని గూర్చి సత్యవతి ప్రశంసలు, వరహాలో మార్పు. ఆరవ రంగములో ఊరిలోని స్త్రీలందరును సత్యవతి యింటిలోచేరి హిందూ స్త్రీలు చేయవలసిన కృత్యములు, వారికుండవలసిన లక్షణములుగూర్చి తలా యొక చరణముగా పాటపాడుట. యువతీ విద్యా ప్రచారమున కిట్టి నాటకములును, తత్ప్రదర్శనములును ఎంతయు నుపకరించును. బాలికా పాఠశాలల సాంవత్సరికోత్సవములు మొదలగు వానిలో నిట్టి నాటకములు ప్రదర్శింపఁ జేయవలెను. శ్రీ వెంకట్రావుగారు కేవలము ఏలపాటలతోనే గాక యిట్టి చిట్టినాటకములతో కూడ తమ కవితాసౌరభ్యమును మేళవించి ప్రయోజన విజ్ఞానమునకు ప్రచారము చేయ గడగినందు కెంతయు నభినందనీయులు. ఆంధ్రు లెల్లరును వారి గ్రంథములను ఆదరించి ఇతోధిక గ్రంథముల రచించుటకు తగిన ప్రోత్సాహ మిత్తురుగాక!

**మాలగతి:—**

ఫూల్స్కేపు 1/8, 16 పుటలు. గ్రంథకర్త: బి. వి. ఎల్. ఆచార్యులుగారు, "పంచానన" పత్రికనుండి

యొత్తి వ్రాయబడిన యొక చిన్న కరపత్రము. పండిత గావాల రామమూర్తి, యం. యల్. సి. గారు విశ్వబ్రాహ్మణులను నిమ్న జాతులలో చేర్చవలసినదని చేయుచున్న ఆందోళనము నిది సహేతుకముగ ఖండించుచున్నది. దీనిని పఠించిన వారికి విశ్వబ్రాహ్మణులు నిమ్నజాతులు కారనియు, అనాదినుండియు మంచి కుల గౌరవముతో వలరారు చున్నారనియు, రాజకీయ ఆర్థిక లాభములకొఱకు నిమ్నజాతులలో చేరగోరు వాంఛలు నిష్ప్రయోజన మనియు స్పష్టముగ తెలియఁ గలదు.

నారదోపన్యాసములు:—

గ్రంథకర్త: పిశపాటి సత్యనారాయణగారు. క్రౌను సైజు 114 పుటలు; వెల రు. 0-6-0. బంగాళాలో ప్రకటింపబడు "వరావతి" పత్రికనుండి పునర్ముద్రింపబడిన చిన్న చిన్న వ్యాసములు. విషయము ఆధునిక లోక వ్యవహారములు, ప్రజాహిత సంస్థలు, వాటి నిర్వాహకుల కుండవలసిన సల్లక్షణములు. వీనిని పఠించినవారికి మంచి జాతీయాభిమానము, ధర్మాసక్తి, ప్రజా సేవా పరాయణత్వము మొదలగు ఆధునిక లక్షణములయం దభిలాష మెండగును. చక్కని గ్రాంథిక శైలి. పాఠశాలలలోని బాలురకు పాఠ్యగ్రంథముగ నిర్ణయింప తగ్గది.

వజ్రాయుధము:—

పూర్వము శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు దీనికి సంపాదకులుగ నుండిరి. శుద్ధ గ్రాంథిక భాష కొరకు మిక్కిలి శౌర్యముతో పోరాడినది. ధనాభావము, ఓపిక లేమి, కాలపు కటువుతనము, లోకరుచులలో మార్పు, ఈకారణములచేత వారు దీని ప్రకటనమును విరమించుకొన్నట్లు శాస్త్రిగారు దీని 'స్వవిషయము' లో వ్రాయుచున్నారు. ఎత్రాప్రగడ సత్యనారాయణగారి ప్రస్తుత సంపాదకత్వమున ఇది ఆధునిక రుచులను తృప్తిపరచగల పత్రికారాజ్యమై యలరారునని ఆశింపవచ్చును. యువకులచే వ్రాయబడిన కథలు, పద్యములు, వ్యాసములు కలిగి సులభశైలితో అలరారుచున్నది. రాజమహేంద్రవరమునుండి మాసమున కొకతూరి ప్రకటింపబడును. చందా సంవత్సరమునకు రు. 3.

జన్మభూమి:—

ఇది వారమునకుమూడుసారులు చెన్నపురి తిరువల్లిక్కేణినుండి శ్రీయుత ఎస్. జి. ఆచార్యగారి సంపాదకత్వమున ప్రకటింపబడుచున్నది. 8 పుటల విషయము. అహ్లాదకరములగు చిత్రములు (కార్టూనులు). ప్రతి యొక్కటికి కాలుచాకయగు కానీ ఖరీదు. పేదసాదు లెల్లరును సులభముగ కొనుక్కొన వచ్చును. మంచి రాజకీయ సాంఘిక పరిజ్ఞానము నిచ్చి జనబాహుళ్యమును దేశాభిమానులుగ మార్చును.

ప్రజామిత్రి:—

బెజవాడనుండి ప్రకటింపబడు వార పత్రిక. సుప్రసిద్ధులగు అవటపల్లి నారాయణరావుగారు దీనికి సంపాదకులు. రైతు సమస్యలను చర్చించుచు వారి సౌకర్యములకొఱ కాందోళనము చేయుచున్నది. ఇది ముఖ్యముగ కృష్ణాజిల్లాకు సంబంధించిన స్థానిక రాజకీయములను చర్చించుచున్నది గాన ఆజిల్లావాసులెల్లరును, అందు ముఖ్యముగ రైతులును దీనిని పఠించి దీనిద్వారా తమ కష్టసుఖములను ప్రకటించుకొనుట కనువుపడును. ఇది జిల్లా వాస్తవ్యులెల్లరి యాదరణంబును బడయుటకు ప్రయత్నించవలెనని కోరుచున్నాము.

ఉచ్ఛలవిషాదము:—

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డి (బి.ఏ.బి.ఎల్.) డెమ్మీ 98 పుటలు. వెల రు. 0-12-0.

కాశ్మీరదేశమును క్రీ. శ. 1101—1111 సంవత్సరములలో పాలించిన ఉచ్ఛలుడను రాజుగారి చరిత్రమును కల్హణుని "రాజతరంగిణి" యను గ్రంథమునుండి గ్రహించి గ్రంథకర్త నాటక రూపంబున రచించినారు. నాటకము విషాదాంతమై శౌర్య కరుణారసంబుల నోలుకుచున్నది. గ్రాంథికమగు గద్యము. అక్కడక్కడ మాత్రము కొంచెము పద్యము లున్నవి.

# ఆలోచన

"ప్రాప్తే షోడశేవర్షే పుత్రం మిత్రవదాచరేత్":—

సంతానమును యథాయోగ్యముగఁ బెంచి తమ కాలమున కక్కరకు వచ్చువానిఁగాఁ జేసుకొనుటయందే కష్ట మధికతరమగుచున్నది. ఏల? బిడ్డలు, "అత్తత్త దాయ్‌దాయ్" యనుచు నెల్లప్పుడును దప్పటడుగులు బెట్టుచుఁ దమచేయూఁత విడువకుండవలెననియే చాలమంది తలిదండ్రులు కోరుచుందురు. కాని, యది, యసంభవము. బిడ్డలకుఁ గాలము ననుసరించి మాటలు నడకలు మొదలగునవియన్నియు వచ్చి వ్యక్తిత్వము లేర్పడును. మరియు రానురాను, అభిరుచు లేర్పడఁజొచ్చును. ఆలోచనలయందు మాటలయందును గార్యములయందును బ్రత్యేకత స్పష్టముగఁ గన్పట్టుచుండును. ఇట్టుల నవనవోత్పన్నము లైన వ్యక్తిత్వములను బెంపొందించుచుఁ దప్పుదారులకు దిగునపుడు మందలించి మరల్పుచుఁ జక్కగ నడపించుటకుమారు తలిదండ్రు లనవసరముగ "చదువు - ఆజ్ఞ"లలోఁ బెట్టఁజూతురు:-తనకు మనోహరమగు డ్రాయింగులో శ్రద్ధవహించి పని సేయుచున్న బాలుని బదిపదునాల్గేండ్లవానినిఁ జూచి తండ్రి, "ఒరే వెధవా, అదేమి పనిరా! చదువూ సంధ్యా మానేసి....." అని తిట్టును. తన కొడుకు తాసిల్దారుకచేరీలో దస్తరాలనకుమ తన్నుకొనుటకుఁ దయారు కావలెనని యతని యుద్దేశము; కాని యది నెరవేరదు. పిల్లవాని కట్టి యభిరుచి లేదు. కాబట్టి వాడు తండ్రి చూచునపు డేదో చదువుచున్నట్లును అతని కన్ను చాటుకాగానే డ్రాయింగు వ్రాయుచును గాలము బుచ్చుచుండును. రానురాను పట్టుదలతోఁ దిట్టుచుండు తండ్రిని దిట్టమై తిరస్కరించి యాతనితో వేరుపడును. అలాగుననే యాడుపిల్ల విషయమునఁ దల్లియు నక్కరకు మాలిన యధికారమును వహించి సంసార సుఖానుభవమునకు దూరమగుచుండును. ఈ రవ్వరట్టునకుఁ గారణము మరేదియుఁగాదు. అవ్యాజప్రేమయే సుమండీ! "పుత్రాదిచ్ఛేత్పరాజయం". తాము లోకమును జయించినవారైనా వమ్ముఁ దమ సంతానము జయింపవలెనని కోరుట తలిదండ్రులకు సాజము; కాని యేమి లాభము? సమయాసమయ యుక్తాయుక్తవివేచన లేక పిడుగునకును బియ్యమునకును ఒకటే మంత్రము- అదుపాజ్ఞలు- భయభక్తులు నేకరువు పెట్టుటవలన నయ్యవారుగా జేయఁబడనుండిన మూర్తి కోతియై పరిణమించుచున్నది. తుదకు "అయ్యో, నే గొడ్డుదా

నన్నై యుండిన బాగే" యని తల్లియు వగచుచుండవలసినంత దుస్థితియుఁ జేకూరుచున్నది. తమ పితృత్వము క్రింద నెంతటి వ్యక్తిత్వ స్వాతంత్ర్యములైనను, అణఁగి మణఁగి పడియుండ గోరుటవలనఁ గదా వృద్ధులు యువ యువతీజనుల ప్రేమాదరములకు దూరులగుట తటస్థించుచున్నది. పశుపక్ష్యాదు లిట్టి మానవులకంటె మేలు: తమ సంతానములకు రెక్కలందువరకే తమ సహాయము. తరువాత మరిలేదు. తన్ని గూటినుండి తగులవలసినదే! వీరి బ్రతుకు లిట్లు కావే. అక్కరకు మాలిన చదువులు, వలపులులేని పెండ్లిండ్లు అంతములులేని యాజ్ఞాపాశములు మొదలగు విషయములతో దన్నుకొని ఆత్మసుఖమును జెరచుకొనుచున్నారు. కాదా!! ఇరువదియైదేండ్లవాడయి భార్యతోఁ గాపురముసేయుచు బిడ్డల గాంచుచున్నవాఁడైనను తన కొడుకు కాబట్టి తన మాట విని తీరవలయునని పట్టుపట్టుట మంచిదా తండ్రికి. సాహిత్యాభిరుచికి సర్వేనాఖరీ. స్వాతంత్ర్యవాదికి సబిణా స్పెక్టరీ. కాదంటె తప్పు! చేదామంటే చేయలేదు; కాబట్టి చెట్టంతకొడుకు చివరకు రట్టువడి దండ్రితో వేరుపడుచున్నాడు. కొడుకులను విడచిపెట్టియుండలేక వారిని కేవలము కూపస్థమండూకములను జేయుటకును ప్రేమయే కదా మూలకారణము. ఇట్టి ప్రేమ కుటుంబమునకుఁ గాని దేశమునకుఁ గాని లాభదాయకమనుట సాహసము: తత్రాపి యీ రోజులలో!! ఎవరికే పనియం దభిలాషయుండునో వారి నా పనియందు బెట్టి దానిలో సక్రమముగ నడిపించుట యుక్తమని పెద్దల యాశయము. కాఁబట్టి తమ కున్న ప్రేమనుగాని యధికారమునుగాని దుర్వినియోగము సేయక పిల్లల బాగుపరచి వారివలన సుఖ మొందగల్గుట లెస్స.

విద్య - వివాహము:—

అమెరికాలో బట్లరు విశ్వవిద్యాలయమువారు వివాహ విషయమును పాఠ్యక్రమములో చేర్చి నేర్పుచున్నారు. అచ్చట కొంతకాలమైనపిదప వివాహ విచ్ఛేదములు మిక్కిలిగా ప్రబలుచుండెను. యువతీయువకులకు వివాహమును గూర్చియు, దాంపత్య సంబంధమును గూర్చియు క్రమముగ నేర్పినచో ఇవి కట్టిపెట్టబడునని వారి యుద్దేశ్యము. స్త్రీ పురుషు నెట్లు స్వవశమున నుంచుకొనుట, పురుషుడు స్త్రీ నెట్లు ఆదరించి లాలించుట గృహజీవనము నెట్లానందదాయకముగ చేయుట అను వానిని గూర్చి పాఠములు నేర్పుదురు. కామవశమున పొరబడి తప్పు త్రోవ త్రొక్కినవారి నాదరించి మఱియెన్నడు నట్లొనరింపకుండగల జ్ఞానమును నేర్పుదురు. విలాసపరులై విఱ్ఱవీగుచు కామచక్రమునఁ గొట్టుకొనగోరువారి నందు చేర్చుకొనరు. దేహారోగ్యము, మానసికోత్సాహము, మితవ్యయము, ఇరుగు పొరుగువారితో కలుపుగోలుతనముతోను స్నేహముతోను వర్తించుట, మతవిషయములం దాసక్తి మొదలగు గుణములు యువతుల కలవడఁ జేయుదురు. వివాహితులు, అవివాహితులు గూడ ఇందులో చేరవచ్చును. అవివాహితులు చేరి యుత్తీర్ణులై సద్వివా

హమున కర్తలగుదురు. వివాహితులు తమ దాంపత్య జీవనమును మఱింత మఱింత ఆనంద దాయకముగ చేసుకొనుటను నేర్చుకొందురు. దాంపత్యసౌఖ్య మనునది స్త్రీ పురుషు లేదో వంశానుగతాచార ప్రకార మొకరినొకరు హత్తుకొని యుండవలెననెడి విశ్వాసమువలన కలుగునది కాదనియు, తత్సంబంధమగు విజ్ఞానము, ఆదర్శము, నైతిక ఔన్నత్యము మొదలగువానిని గూర్చి పఠించి తెలుసుకొనవలసిన విషయమనియు విద్యాలయమువారి భావము. ఈ పాఠములలో యీ దిగువ విషయములు నేర్పబడును: (1) ప్రపంచములో వివాహము కుటుంబము అనునవి యెట్లు పొడమి పరిణమించుచున్నవి. (2) ఈ దినములలో కుటుంబమును నడుపుటకగు ఖర్చు వెచ్చములు. (3) కుటుంబధనముమీద నెవరెవరి కెంత స్వాతంత్ర్యముండవలెను. (4) సమయాసమయములలో నెట్టి సర్దుబాటులు చేసుకొనవలెను. (5) పసివారికి, యువకులకు వారి యనుచరులకు మర్మశాస్త్ర విషయములను వారి వారి వయస్సు ప్రకారము నేర్పుట (6) వివాహవిచ్ఛేదము- కుటుంబసమస్య. (7) ఆధునిక కుటుంబములలో స్త్రీ పురుషు లెట్టి సాహచర్య సంపర్కములతో తిరుగుచుండవలెను. (8) మన శాస్త్రజ్ఞులు వివాహ విషయమును గూర్చి యేమి చెప్పుదురు. (9) వివాహమునుగూర్చి మత గురువుల అభిప్రాయము. (10) వివాహము దానికి సంబంధించిన వైద్య విషయములు మొదలగునవి. ఈ తరగతు లప్పుడే ప్రారంభమై యోగ్యముగ జరుగుచున్నవి.

**ఇంగ్లండు—స్త్రీ విద్య:—**

పురాతన కాలములందుఁ గూడ కావ్య నాటకాది సాహిత్య విషయ జ్ఞానము గల యువిద లుండెడివారు. కాని సామాన్యముగ స్త్రీలకు మాత్రము గృహనిర్వహణమే విహితమై యుండెడిది. వ్రాయుట, చదువుట, లెక్క గట్టుటవర కెరిగియుండుట ఆపెకు చాలి యుండెను. కాని శాస్త్రజ్ఞాన మవసరము గాకుండెను. గృహనిర్వహణమే యాడుదానికి తెలియవలసిన విషయమనియు, అది తల్లియొద్దనే యుపదేశింపబడవలయుననియు నాటి పెద్దల యాశయము. ఆ వెనుక వ్యక్తి స్వాతంత్ర్యమునకు గూడ నబలకర్హత లేకుండెను. పురుషులను సంతోషపెట్టుటయు, వారికి ప్రేమాస్పదలై యొప్పుటయు, సమయా సమయములం దాలోచనలఁ జెట్టి వారి హృదయమును కూరట గల్గించుటయు వారి జీవితముల నానందమయముగ జేయుటయు మహిళాధర్మములై యుండెను. జవగాండ్రు సంగీతము, భరతము మొదలగు కళల నభ్యసింపవచ్చును గాని వేదాంత శాస్త్రము మొదలగునవి చదువ నక్కరలేదు. పద్ధతు లిట్లుండియున్నను విదుషీమణులు లేకపోలేదు. ఇక పందొమ్మిదియవ శతాబ్దము రాగానే స్త్రీ విద్యావిషయమున సంస్కరణము లతిత్వరితగతిని వచ్చినవి. బాలికా పాఠశాల లేర్పడినవి. 1871లో స్త్రీ విద్యాభివృద్ధికై నేషనల్ యూనియన్ అను సంస్థ యేర్పడినది. 1870-80 సంవత్సరముల నడుమ నింగ్లండులో స్త్రీ విద్య గాంచిన

యభివృద్ధి ప్రశంసాపాత్రమైనది. 1894లో వెడలిన రాయల్ కమిష్మనులో స్త్రీలు గూడ సభ్యురాండ్రై యుండిరి. ఇరువదవ శతాబ్దములో మరింత యభివృద్ధి కలుగుటయు దేశమునం దెల్లయెడల మహిళా కళాశాలలు స్థాపితములైనవి. ఈ విద్యాభివృద్ధితోబాటు స్త్రీల సాంఘిక మర్యాదయు వృద్ధియైనది. వారికి జేయుట కనేకములైన పనులు దొరికినవి; వైద్య విద్యయందు వారికి స్వాగత మొసగబడినది; అంగికాభివృద్ధియు వారి కవసరమైనది; క్రికెట్టు, హాకీ, టెన్నిసు మొదలగు నాటలలో వారును నేర్పు గడించిరి. ఇదిగాక సంఘ ప్రాముఖ్యతయు వారికి గల్గినది. 1870లో మారీడ్ విమెన్స్ ఆక్టును బట్టి స్త్రీ, తన యార్జనపై హక్కు గల్గియున్నది. సమస్త సంస్థలయందును స్త్రీ ప్రాతినిధ్యము పొసగినది. చివరకు వోటింగు హక్కుగూడ లభించినది. ఇందులో గమనింపదగిన ముఖ్య విషయ మొకటి:—ఈ యుద్యమమునకు దొరతనముతో సంబంధము లేదు. ఎక్కడి కక్కడ నెవరికి వారు యథాశక్తిని కష్టపడిరి. ఇట్టి పట్టున భారతవర్షములో నారీమణులు, తమ యాంగ్ల సోదరీమణుల చిరకాల కష్టార్జిత ఫలము ననుభవింపఁ జొచ్చుచున్నారు. వారికిఁ బ్రభుత్వము సర్వవిధములఁ దోడునీడయై నిలచియున్నది. సాంఘికాభివృద్ధికై యువతులు విద్యావతులై యెంతయేని జేయుట కవకాశము లున్నవి. భారతదేశమున రాజకీయ సాంఘిక వ్యవస్థలయం దెన్నియో చక్కబాట్లు చేయవలసినవారు విద్యావతులగు యువతులే!!

—శ్రీమతి స్టోక్సు సతిగారు.

భక్తాగ్రగణ్యుడై ముప్పదియేడులకు పైగా భారతికి బరిచర్య సేసి సంతత స్మరణీయుడైన శ్రీ దాదాభాయి నౌరోజిగారి మనుమరాలు శ్రీమతి నూర్జీకాప్టెన్ సతీమణి అస్పృశ్యతను గూర్చి తిరుచనాపల్లి మహాసభలోఁ జెప్పిన సూక్తులు:—దుర్భరమగు నీ యంటరానితనమును నాచారమును సంఘమునఁ బెట్టుకొని, "మేము నాగరికులము: బాగుగా జదువుకొన్నా"మని యేమొగము పెట్టుకొని స్వరాజ్యమునకై యాశింపఁగలము? మతమును భాసిల్లజేసి, లోకమున నుచ్చస్థానము నొంది, ప్రేమ ప్రశంసల నొందవలెననిన, ఈ దురాచారమువలన గలుగు ఘోరనష్టములను బాగుగా నెరిగి యితరు లెరుగునట్లు జేయుట లెస్స. మే మొక దేవాలయములోనికి వెళ్లితిమి. అంతట పూజారివాడు మమ్ము గొంత దూరముదాక రానిచ్చెను. "హరిజను లింతవరకు రావచ్చునా" యని నే నతని నడిగితిని. "కూడదు! హరిజను లింతవరకు రాకూడదు. మీరు తెల్లవారు కాబట్టి రావచ్చు" నని యాతడనెను. ఎంతమాట! తన దేశస్థుడును దనవాడునైనవాడు రాగూడని చోటికి విదేశీయుడు విమతస్థుడగు "తెల్లవాడు" రావచ్చునట!! ఈవిషయము మీలోఁ బ్రతివ్యక్తియును ఆలోచింప దగ్గది కాదా!!!"

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.